# ఐటెక్స్

శాస్త్రీయ విధానంలో తయారుచేయబడు
ఐటెక్స్ కాటుక అందాలు చిందేటి
యువతుల కళ్లను దేనినేమీ చేరనీయక
చల్లగా కాపాడుతుంది...




ఐటెక్స్ 48 సంవత్సరములుగా మీ నమ్మకానికి
పాత్రమైన ఉన్నతమైన వస్తువు

అరవింద్ లేబొరేటరీస్ మద్రాసు 600033

# బెణుకుల బాధతో తన గొప్ప రోజు పాడవడం దేనికి?




## నయం చేసే శక్తి మీ చేతుల్లోనే ఉంది.

మీ చేతుల వెచ్చని సౌమ్యమైన స్పర్శ, అయొడెక్స్‌లో గల నయం చేసే శక్తి — ఇవే తనకి కావలసినవి అందుకే అయొడెక్స్‌ను అందుబాటులో ఉంచుకోండి. ఎందుకంటే అయొడెక్స్‌లో, గాయపడిన ధాతువులను నయం చేసే అయొడిన్, నొప్పిని తగ్గించే మిథైల్ శాలిసిలేట్ చేరి ఉన్నాయి.

**అయొడెక్స్ రోజుకు రెండుసార్లు రెండింతలు గుణకారి.**

నొప్పి తగ్గేవరకూ, ఆ తర్వాత రెండు రోజుల వరకూనూ రోజుకు రెండుసార్లు అయొడెక్స్ వాడమని సిఫారసు చేస్తున్నారు డాక్టర్లు ఎందుకంటే, నొప్పి ఒక లక్షణం మాత్రమే కాగా అసలు సమస్య లోపలి ధాతువులకైన గాయం.

కనుక మీ ఆప్తులు ఎవరైనా బెణుకులు, కండరాల పట్లు, కీళ్ల పట్లు, ఒళ్లునొప్పులతో బాధ పడటం జరిగితే అయొడెక్స్ మర్దించండి రోజుకు రెండుసార్లు. తమని రెండింతలు శీఘ్రంగా మళ్లీ చురుకుగా చేసినందుకు వారు మీకు ఋణపడి ఉంటారు.

**అయొడెక్స్®** — నయం చేసే శక్తిగల నమ్మకమైన బామ్.

SKOF — ఎస్‌కేఎఫ్ ఉత్పాదన.

ELL-1509

# ఉత్తరాలు

## ముఖచిత్రం

27-12-85, 2-1-86 నాటి మా అభిమాన నటి సుహాసిని ముఖచిత్రం'తో వెలువడిన పత్రిక ఎంతో బాగున్నది

చెలికాని సురేష్ మెహతా, గోరస

* * *

అందాల తార సుహాసిని ముఖచిత్రంతో వెలువడిన 27 డిసెంబర్ 85 - 2 జనవరి '86 సంచిక చాలా ముద్దుగా, ఆకర్షణీయంగా వున్నది

పట్నాయక్కుని మాలతి, ఆమదాలవలస

## కథలు

'నటి రమ్యకృష్ణ' ముఖచిత్రంతో వెలువడిన 6-12, డిసెంబర్ '85 సంచికలో 'టుర్రయ, టుర్రయ, టుర్ర్ర్ర్ర్ర్రయ కథ చదివాను కేవలం మాటలతో మనసు మార్చి ఎదుటి మనిషిలో పరివర్తన కలిగించే కళ అందరికి అలవడదు. మాష్టారిలాంటి సౌహార్ద్ర హృదయులు నూటికి కోటికి కనిపిస్తారు

కథలో పక్షుల హావభావాల్ని చిత్రించే అరుదైన ప్రక్రియకు జోహార్లు.

పాట్రుడి చక్రరావు, విశాఖపట్నం

* * *

నటి సత్యకళ ముఖచిత్రంతో వెలువడిన 20–26 డిసెంబరు 1985 సంచిక సర్వాంగ సుందరంగా వుంది కథలలో భగవాన్' నాకి జీవితం వచ్చు కథ నా మనస్సును కదిలించి వేసింది. ఒకే వరలో రెండు కత్తులు ఇముడవన్నట్లు ఒకే వ్యక్తి ఇద్దరు భార్యల్ని కల్గి వుండటం కష్టం అటు 'శారద'ను ఇటు 'సరిత'ను వివాహం చేసుకొని, తను సుఖపడక, వాళ్ళని సుఖపెట్టక మనో వ్యాకులత చెందే 'శేఖరం' లాంటి వ్యక్తులకు ఈ కథ మంచి కనువిప్పు కాగలదు రచయిత్రి కృష్ణజ గార్కి అభినందనలు

మోదేకుర్తి సత్యనారాయణ అన్నవరం

## సీరియల్స్

26-12-85 సంచికలో మొదలయిన 3డి సీరియల్ త్రివేణి మొదట్లోనే మమ్ముల నాకట్టుకుంది తెలుగు పత్రికలలో మొట్టమొదటి 3డి సీరియల్ ప్రచురిస్తున్న పత్రిక ఇదే చెప్పుకొనుటకు మాకు గర్వంగా యుంది మిగతా సీరియల్స్‌లో నిజాలు-నిజాలు బాగా సాగుతున్నది

పుప్పాల హన్మంతరావు సిర్పూర్- కాగజ్‌నగర్ □


ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938-1972)

7-13,ఫిబ్రవరి, '86
శ్రీ క్రోధన నామ సం పుష్య బ త్రయోదశి
సంపుటము 78 : సంచిక 22

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-50 |
| పోస్టులో 6 నెలల చందా | రు 71-50 |
| పోస్టులో 12 నెలల చందా | రు 143-00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధినగరం, విజయవాడ-520 003




## విషయానుక్రమణిక

# న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

# ప్రైవేటు రంగాన్ని ఆహ్వానిస్తున్న కమ్యూనిస్టులు!

పశ్చిమ బెంగాల్‌లో కమ్యూనిస్టులు ఉదయం మార్క్స్‌ని, మధ్యాహ్నం బిర్లాని తలుచుకుంటారు. బహుశ వాళ్ళకి అంతకన్నా గత్యంతరం లేదు. పాపం మార్క్స్ చనిపోయి చాలా కాలం అయిపోయింది. బిర్లాలు దినదిన ప్రవర్ధమాన మవుతున్నారు కాబట్టి వాళ్ళే యువకులైన బెంగాలీలకి ఉద్యోగాలని కల్పించగలుగుతారు. ప్రపంచం అంతటా ఇదే జరుగుతున్నదని జ్యోతిబాసు, ఆయన బృందానికి తెలియదు. ఆయన కమ్యూనిస్టు మిత్రులంతా పెట్టుబడిదారులతో కాకపోయినా వారి ఉద్దేశాల్లతో ఏకీభవిస్తున్నారు. మాస్కోలో, పీకింగ్‌లో అదే జరుగుతున్నదని జ్యోతిబాసు, ఆయన సహచరులకి బహుశ తెలిసే ఉంటుంది. కాని పాపం శ్రీ జ్యోతిబాసు తమ ప్రభుత్వం ఉమ్మడి రంగం పథకాలలో ప్రయివేటు వాణిజ్యవేత్తలతో కలవటానికి సిద్ధంగా ఉన్నదన్న విషయాన్ని మరో రకంగా వివరించేందుకు ప్రయత్నం చేస్తున్నారు. అలా చెయ్యమని కేంద్రం తమని వొత్తిడి చేస్తున్నట్లుగా ఆయన చెబుతున్నారు కానీ నమ్మించలేరు. చైనాలో డెంగ్ జియావోపింగ్‌పై వొత్తిడి తేవడానికి అక్కడ రాజీవ్‌గాంధీ లాంటి వారు ఎవరూ లేరు కదా. కానీ ఆయన ప్రభుత్వం బహుళ జాతి సంస్థలతో 2 వేలకి పైగా సహకార వొప్పందాలపై సంతకాలు చేసింది. ఆ దేశం విదేశీ కంపెనీలని పెద్దఎత్తున ఆహ్వానిస్తున్నది.

ప్రపంచంలో అన్నిచోట్లా కమ్యూనిజం తిరోగమనంలోనే ఉన్నది. చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి హు యాన్‌బాంగ్ ఇటీవల ఇటాలియన్ కమ్యూనిస్టు దినపత్రిక 'యూనిటా'లో రాసిన ఒక వ్యాసంలో "1917 అక్టోబరు విప్లవం జరిగి ఇప్పటికి అరవై ఏళ్ళు దాటింది. మరి అభివృద్ధి విషయంలో సోషలిస్టు దేశాలు పెట్టుబడిదారీ దేశాలని ఎందుకు అధిగమించ లేకపోతున్నాయి. అసలు లోపం ఎక్కడ ఉన్నది?" అని ప్రశ్నించారు.

ఎక్కడో తీవ్రంగా విఫలం అయింది. కాని ఇకముందు అది కాదు చర్చనీయాంశం. అమెరికా జీవన ప్రమాణాలని అధిగమించి అమెరికా సంయుక్త రాష్ట్రాలని 'పూడ్చి పెట్టేస్తా'మని కృశ్చేవ్ ప్రగల్భాలు పలికారు. అయినప్పటికీ 1960 లలో ఉన్న దానికన్నా సోవియట్ రష్యాలో ఆర్థికాభివృద్ధి సగానికి దిగజారిపోయింది. తన ప్రజల కోసం మాస్కో టన్నుల కొద్దీ ఆహారధాన్యాలని పెట్టుబడిదారీ దేశాలనించి దిగుమతి చేసుకోవాల్సి వస్తున్నది.

మానవులందరూ వాళ్ళు ఎక్కడ ఉన్నప్పటికీ వారికి ఆహారం, వసతి, రక్షణ అన్నవి అవసరాలు. వాటి కోసమే వారు శ్రమిస్తారు. అవి లభ్యం అవుతాయన్న హామీ ఉంటే ప్రభుత్వం చేసే అస్తవ్యస్తమైన చర్యలని వారు ఒక దశ వరకూ భరించగలుగుతారు. ఆ దశని మించితే పరిస్థితులు దిగజారటం మొదలవుతుంది. చైనాలో భూమి ప్రభుత్వం ఆదేశించిన పద్ధతిలో సాగు చేయబడుతూ ఉండేది. ప్రభుత్వం, అంటే మావ్, నిర్దేశించిన పంటలని పండించి ఉత్పత్తి అయిన ఆహార పదార్థాలని పంపిణీ కోసం ప్రభుత్వానికి అప్పచెప్పాలి. పనిని బట్టి జీతం నిర్ణయింపబడుతుంది. దానికీ, చేసిన ఉత్పత్తికీ సంబంధం అంతగా ఉండదు. మావ్ రోజులలో అలా జరిగేది. కానీ డెంగ్ వచ్చిన తర్వాత ఆయన దానిని రద్దు చేసి దాని స్థానే కాంట్రాక్టు పద్ధతిని ప్రవేశ పెట్టారు. ఇప్పుడు రైతులు వారికి ఇష్టమైనది చెయ్యడానికి అనుమతించబడుతుంది. ప్రభుత్వమే భూమికి, మిగతా ఆస్తులకి యజమాని కాబట్టి వారు ప్రతిఫలంగా డబ్బుగా కాక ధాన్య రూపంలో అద్దెని చెల్లిస్తారు. చైనా ఆహారోత్పత్తి ఏడాదికి 8 శాతం చొప్పున పెరుగుతూ ఉన్నది. అది సుమారుగా మన కన్నా రెండు రెట్లు ఎక్కువ. పారిశ్రామిక ఉత్పత్తి 25 శాతం ఉన్నది, మన కంటె నాలుగు రెట్లు పైనే ఉన్నది. చైనా ఇంకా పేద దేశమే కానీ దాని తలసరి ఆదాయం మన కన్నా ఎక్కువ. ఈ శతాబ్దం ముగిసేసరికి అది ఏడాదికి రు. 10,000 అయ్యే అవకాశం ఉన్నది. అప్పటికి మన తలసరి ఆదాయం బహుశ దానిలో సగం ఉంటుందేమో.

లెనిన్ నూతన ఆర్థిక విధానంలోని పనికిరాని అంశాలని మనం అరువు తెచ్చుకున్నాము. దానిని ఆయన 1921 లో ప్రవేశ పెట్టారు. అప్పటి నించే పరిస్థితులు దిగజారటం ప్రారంభం అయింది. ఇంకా పెట్టుబడిదారీ దేశాల మాదిరిగా తగినంత అభివృద్ధి జరగలేదు, యుగోస్లావియా వంటి సోషలిస్టు దేశాలలో లాగా ప్రతి ఒక్కరికీ తగినంత ఆదాయం కూడా లభ్యం కాలేదు. వాస్తవానికి ప్రభుత్వరంగానికి అత్యధిక ప్రాధాన్యతని ఇచ్చే ఈ వ్యవహారం సరాసరి లెనిన్ నించే అరువు తెచ్చుకోవటం జరిగింది. దానిని ఏ మాత్రం తగ్గించినా మన కమ్యూనిస్టు మిత్రులు సహించలేనంతగా తలక్రిందులవుతూ వుంటారు. మార్క్సిస్టు పద్ధతిలో చైనాలో డెంగ్ చేస్తున్నది, రష్యాలో గోర్బచేవ్ చేయాలనుకుంటున్నది లెనిన్‌కి చెంప పెట్టులాంటిది. నెహ్రూ విధానాలని అనుసరించడంలో రాజీవ్‌గాంధీ, ఆయన సహచరులు చేస్తున్నది ఆ విధంగా లేదు. జ్యోతిబాసు అధ్వర్యంలో ఇటీవల కలకత్తాలో సమావేశమైన కమ్యూనిస్టు సానుభూతి పరులైన



# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

★ ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ యితర రచనలు పంప దలచుకున్నవారు సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీ నగరం, విజయవాడ—520 003 అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరుమీద శీర్షిక పేరు పేర్కొ నడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ, చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి— హామీపత్రం జత చెయ్యాలి

★ గేయాలు తిప్పి పంపబడవు వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు మంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునే వారు— వారి స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్ల లంటిం చిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనే గాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయం కోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తరప్రత్యుత్త రాలకి తావులేదు కాని—తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయ వలసివస్తే రచయితలు— రచన పేరు— అది పంపిన తేదీ, వివ రంగా వ్రాయండే, వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్ల లంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది

★ కార్టూన్లు పంపేవారు కూడా 8 వారాలలోగా మా మీద ఉత్తరాల దాడి చెయ్యకూడదు... ప్రతీ కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి.

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ రచనల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలు వెంబడి జరుగు తుంది.

★ రచయితలకు కార్టూనిస్టులకు [ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలలో 'పడ్డ' వారికి తప్ప తతిమ్మా అందరికి] అవి పడ్డ "ప్రతు"లను— కాల క్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలోపోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు

సం ॥

## న్యూఢిల్లీ లేఖ

ఆర్థికవేత్తలు కొందరు ఢిల్లీలోని కొత్త ప్రణాళికా రచయితలని దుయ్యబట్టారు కానీ మార్క్స్ లెనిన్‌ల పేరు మీద చైనాలో డెంగ్ తదితరులు చేస్తున్న విధ్వంసాన్ని గురించి ఒక్కమాట కూడా మాట్లాడలేదు కమ్యూనిస్టులు తమలో తాము గానీ లేక ఇతరుల పట్ల గానీ నిజాయితీగా ఉంటారని మీరు అనుకోటానికి వీలులేదు

డెంగ్ ఇప్పటికి కమ్యూనిస్టు ఆర్థిక వ్యవస్థలో ఆయన ప్రభుత్వానిదే పైచేయి ఆయన చెయ్యాలనుకుంటున్నదల్లా మావ్ నించి సంక్రమించిన తుప్పు పట్టిన యంత్రాలకి కొన్ని నట్లని వదులు చేసి కొద్ది చమురుతో ఆ యంత్రాలు తిరిగి నడుస్తాయో లేదో చూడటం ఆర్థిక స్వేచ్ఛ ఎక్కువ రాజకీయ స్వేచ్ఛ ఉన్నప్పుడే దీర్ఘకాలం నిలబడుతుంది గోర్బచేవ్ ఆయన సహచరులకి ఈ విషయం తెలుసు కానీ వాళ్ళు చైనా వారి ప్రయోగాన్ని ఆత్రుతతో గమనిస్తున్నారు అది విజయవంతం అయితే చైనా వారిని మించిపోతుంది ఇప్పుడు రష్యాకి ఉన్న పలుకుబడి తగ్గిపోతుంది అది విఫలమైతే మొత్తం కమ్యూనిస్టు వ్యవస్థే కూలిపోతుంది

ప్రపంచం అంతటా కమ్యూనిస్టులు చేస్తున్న పనే వారు కూడా చేస్తున్నప్పటికి పశ్చిమబెంగాల్ కమ్యూనిస్టులు ప్రయివేటు వాణిజ్యంతో తమ కొత్త సంబంధాల విషయంలో చాలా పశ్చాత్తాప ధోరణిని ప్రదర్శిస్తున్నారు సోవియట్ విజ్ఞాన శాస్త్రవేత్తలు అంతరిక్షంలో ఉపగ్రహాలని ప్రయోగించగలరే కానీ ఒక మంచి డిటర్జంట్‌ని లేదా ఒక మంచి బాల్‌పాయింట్ పెన్‌ని తయారు చేయలేరు మన విజ్ఞాన శాస్త్రవేత్తలు కూడా అందుకు భిన్నంగా లేరు ప్రపంచంలో మొట్టమొదటి రకానికి చెందిన ఫాస్ట్ బ్రీడర్ రియాక్టర్‌ని థోరియం ఆక్సయిడ్‌ని ఉపయోగించి పని చేయించగలరు కానీ టెలిఫోన్‌లు సరిగా పని చేసేలా చూడటం వారి వల్లకాదు దేశానికి రెండూ కావాలి మనకి రియక్టర్లూ ఉండాలి టెలిఫోన్‌లూ సరిగా పని చేయాలి డిటర్జంట్ పౌడర్లూ కావాలి ఉపగ్రహాలూ ఉండాలి నెహ్రూ మహలనోబిస్‌ల చలవ వల్ల మనకి ఉన్న ఈ వ్యవస్థ ప్రస్తుతం గోర్బచేవ్ దురవస్థకి మనని గురి చేసింది మన మిత్రులు కొందరు అనుకున్నట్లు సబ్బు కన్నా ఉపగ్రహం ముఖ్యమని టెలిఫోన్ కన్నా రియాక్టర్‌లు ప్రధానం అని అనుకోవటం పొరపాటు రెండూ మనకి అవసరమే ఎక్కువ సంఖ్యలో మనకి అవి లభించాలి అలా రెండూ మనకి ఎందుకు ఉండరాదో నాకు అర్థం కాని విషయం ప్రభుత్వం చెయ్యనప్పుడు మరొకరు చెయ్యవచ్చు ఆ మరొకరు బిర్లా అయినా లేదా టాటా అయినా పర్వాలేదు పిల్లి రంగు ఏమిటన్నది కాదు ముఖ్యం అది ఎలుకలని పట్టుకుంటున్నంత కాలం దాని రంగు ఏదైనాపర్వాలేదు □

శ్రీరస్తు – శ్రీ త్రిపురసుందరీ వరశివాభ్యాంనమః

త్వరలో వెలువడుతుంది

త్వరలో వెలువడుతుంది

# ఆంధ్రపత్రిక

## శ్రీ క్షయ నామ సంవత్సర పూర్ణశాస్త్రీయ పంచాంగము



'దైవజ్ఞచిన్తామణి' శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తిశాస్త్రి,

'భాషాప్రవీణ' శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి సిద్ధాన్తి సోదరులచే గుణించబడినది.

ఆంధ్రపత్రికా కార్యాలయము

ప్రతి 1–కి రూ. 5-00

గాంధీనగరం, విజయవాడ - 3.

బషీర్ బాగ్, హైదరాబాద్-29

సీరియల్

# ఎన్. భారతీ దేవి



# ప్రేమసాగరం

(గత సంచిక తరువాయి)

సాయంత్రం స్వప్న, వాళ్ళమ్మ గార్ని తీసుకుని లేడీ డాక్టర్ దగ్గరకెళ్ళి పరీక్ష చేయించుకుంది ఆమె ఊహించినట్టుగానే చెప్పింది అతనసలు ఆపరేషన్ చెయ్యలేదు పొట్ట మీద అంగుళం మేరకు, ఆపరేషన్ జరిగినట్టు గుర్తుగా గంటు పెట్టాడు అని చెప్పింది గర్భసంచిలో చిన్నగడ్డ లాంటిది ఉన్నట్టనిపిస్తుంది చిన్న ఆపరేషన్ చేస్తానంది

భర్తకు పిల్లలంటే ఎంత మమకారమో తెల్సు స్వప్నకు ఈ చిన్న ఆపరేషన్ చేయించుకుంటే పిల్లలు పుడతారేమో అన్న ఆశతో ఉదయాన్నే ఆపరేషన్ చేయించుకోటానికి వస్తానని చెప్పింది

రాత్రి భర్తతో డాక్టరు చెప్పిన విషయం చెప్పింది ఆ ఉదయాన్నే హాస్పటల్‌కు తీసుకెళ్ళారు స్వప్నను. ఆ రోజుండి, రెండో రోజుకల్లా ఇంటికొచ్చింది

ఒకనెల జరిగిందగ్గర్నుంచి, పిల్లలు కోసం ఎదురు చూడటం మొదలయింది

కాలచక్రంలో మరో ఆరు నెలలు గిర్రున తిరిగిపోయాయి స్వప్నను విశాఖలోని డాక్టర్స్ అందరికి చూపిస్తున్నారు

గర్భ సంచిలోని గడ్డ కరగటానికి, మందులు వాడదాం తగ్గకపోతే, పెద్ద ఆపరేషన్ చేసి ఆ గడ్డను తొలిగిస్తానని చెప్పింది సిటీలో మంచి పేరున్న పెద్దడాక్టరు ఆమె దగ్గర స్వప్నకు ట్రీట్‌మెంట్ ఇప్పిస్తూనే, మద్రాసు, బొంబాయి తీసుకెళ్ళి అక్కడ పెద్దడాక్టర్సుకు చూపిస్తున్నారు అందరూ మందులు వాడే కంటే, ఆపరేషన్ చేసి, ఆ గడ్డను తొలిగించటమే మంచిదని చెప్పారు కొండనాలుకకు మందు వేస్తే, ఉన్న నాలుక ఊడిపోయినట్టుగా, హాస్పటల్స్‌కు తిరగటం, మందులు మింగటం, తనకు పిల్లలు పుట్టే అవకాశం లేదేమో అన్న మానసిక ఆందోళనా అన్నీ కలిపి, స్వప్న మనస్సును మానసిక క్షోభకు గురి చేస్తున్నాయి అలంకరణ మీద శ్రద్ధ తగ్గింది శారీరకంగా కూడా, భర్త కోరిన సుఖాన్ని అందించలేకపోతుంది ఆమె అంతరంగాన్ని ఒకే ఒక ఆలోచన మథిస్తుంది తనకసలు తల్లయ్యే యోగ్యత ఉందా? లేదా? అని

కూతురు ముందు బాధ పడితే, కూతురు మరింత బాధ పడుతుందని మనస్సులోనే కుమిలిపోతున్నారు మాధవరావు గారి దంపతులు వాళ్ళకు పుట్టింది ఒక్కగానొక్క కూతురు స్వప్న తన కూతురుకయినా నలుగురు పిల్లలు పుడితే చూసి సంతోషించాలని, తపించిపోతున్నారు వాళ్ళు.

స్వప్న డాక్టర్ ఎలా చెబితే, అలా చేస్తుంది టయిమ్ ప్రకారం మందులు వాడుతుంది ఎన్ని చేసినా, మానసికమయిన అలజడి ఆమె మనస్సుకు స్థిమితం లేకుండా పోతుంది

లక్ష్మికిద్దరు పిల్లలు పుట్టారు. ఆపరేషన్ చేయించుకుంది. శలవుల్లో ఆమె, పిల్లలూ, భర్తా, వాళ్ళమ్మ గారు అందరూ కల్సి, స్వప్నా వాళ్ళింటికి వచ్చి పోతుంటారు

వాళ్ళత్త గార్ని తన దగ్గరే ఉంచుకోవాలనుకుంటుంది స్వప్న లక్ష్మి కూడా ఉద్యోగాని కెళితే, ఆమె పిల్లల్ని చూసే వాళ్ళు లేరు అందువలన లక్ష్మిఅమ్మగారు, ఆమె దగ్గర తప్పనిసరిగా ఉండిపోవాల్సి వస్తుంది

స్వప్న మందులు వాడుతూనే ఉంది. గడ్డలు మాత్రం కరగలేదు ఆమె స్థితి ఎప్పటి లాగే ఉంది జయరాంలో ఏ లోపం లేదని చెప్పారు డాక్టర్లు స్వప్నను పరీక్ష చేసిన ప్రతి డాక్టరూ, ఆమెకు ఆపరేషన్ చేయించటం తప్పనిసరి అని చెప్పటంతో, స్వప్నకు ఆపరేషన్ చేయించాలన్న నిర్ణయాని కొచ్చారు మధ్య, మధ్యలో జయంతి, స్వప్నను బాబాల దగ్గరకు, స్వాముల దగ్గరకు తిప్పుతుంది స్వప్న మానసికంగా, విసిగిపోయింది గుంటూరు మెడికల్ కాలేజీలో ప్రిన్సిపాల్‌గా

జరిగిన కథ- 3: రఘునాథ్ సిటీలో పేరున్న పెద్ద బిజినెస్ మ్యాగ్నెట్ హాస్పటల్‌లో ఉన్న స్వప్నను చూడను వెళ్ళిన రఘునాథ్‌కు గతం గుర్తుకు వస్తుంది మాధవరావు, రామారావు ప్రాణస్నేహితులు మాధవరావు గారి ఏకైక కూతురు స్వప్న రామారావుగారి కొడుకు రఘునాథ్ పిల్లలు పుట్టినప్పట్నుంచి స్నేహితులిద్దరు వియ్యమందుకోవాలనుకొనేవారు స్వప్నంటే రఘునాథ్‌కి అమితమైన ప్రేమ కానీ స్వప్న జయరాంను ప్రేమించింది జయరాంకు స్వప్నంటే ప్రేమే స్వప్న పుట్టిన రోజు పండుగను ఘనంగా హోటలులో చేయాలనుకొంటారు మాధవరావుగారు. పార్టీలో స్వప్న జయరాంతో సన్నిహితంగా ఉండటం రఘునాథ్‌కి బాధ కలిగించింది. స్వప్న, జయరాంల పెళ్ళి జరిగిపోయింది రఘునాథ్ తండ్రి, తల్లి చనిపోయారు రఘునాథ్‌కి బిజినెస్‌లో కలిసివచ్చింది పట్టిందల్లా బంగారం అయింది నాయర్ పిలుపుతో గతంలోనుంచి తేరుకొన్నాడు స్వప్నకు మతిభ్రమించిందని తెలిసి నాయర్ కళ్ళలో కూడా నీళ్ళు తిరిగాయి మెంటల్ హాస్పటల్‌లో ఒంటరిగా కూర్చున్న స్వప్న మనస్సు గతం వైపు పరుగుతీసింది స్వప్నకు భర్తంటే ప్రాణం స్వప్న భర్తగా జయరాం అంతస్తు, హోదా పెరిగింది పెళ్ళయి మూడేళ్ళయినా బిడ్డలు పుట్టకపోవడంతో జయరాం, స్వప్న డాక్టరు దగ్గరికి పరీక్ష చేయించుకోవడానికి వెళతారు. ఆ డాక్టరు పరీక్షలు చేసి జయరాంలో ఏమి లోపం లేదని, స్వప్నకు చిన్న ఆపరేషన్ చేస్తే పిల్లలు కలుగుతారని చెప్పి, ఆపరేషన్ చేస్తాడు ఆపరేషన్ చేసిన ఆ డాక్టర్ పెద్ద మోసగాడని తెలిసి స్వప్నకు అనవసరంగా ఆపరేషన్ చేయించామే అని అమితంగా బాధపడతాడు జయరాం

పని చేసి, రిటైరయిన సి సావిత్రి గారి దగ్గర ఆపరేషన్ చేయించాలని నిర్ధారణ చేసి, స్వప్నను ఆమె దగ్గరకు తీసుకెళ్ళారు

ఆమె రిటైరయినా, సన్నగా, నాజూకుగా, ఎంతో హుషారుగా, డాక్టరంటే ఇలా ఉండాలి అన్న పద్ధతిలో ఉంది స్వప్నను పరీక్ష చేసి, ఆపరేషన్ చేస్తాను గర్భసంచిలో ఒకటి కాదు పలకలు, పలకలుగా చాలా గడ్డలున్నాయి వీలయినంత వరకూ, అన్నీ తొలగించి గర్భసంచి ఉండేలా చేస్తాను అలా వీలుకాని పక్షంలో గర్భసంచి పూర్తిగా తొలగించవలసి వస్తుంది అందుకు మీ భార్యాభర్తలిద్దరూ మానసికంగా సిద్ధపడి ఆపరేషన్‌కు రండి మీరు ఏ రోజు వస్తే, ఆ రోజే ఆపరేషన్ చేస్తాను అని జయరాంను పిలిచి చెప్పింది డాక్టరు చెప్పిన విషయం అతను స్వప్నకు చెప్పలేదు మాధవరావు గార్కి, జయంతికి డాక్టర్ చెప్పింది

* * * * *

స్వప్నకు థియేటర్‌లో ఆపరేషన్ జరుగుతుంటే మాధవరావు గారు, జయంతి ఇండియాలో ఎంత మంది దేముళ్ళు, దేవతలూ ఉన్నారో అంత మందికి పేరు పేరున మొక్కులు మొక్కుతున్నారు

జయరాం స్థితి వర్ణించనలవిగానిది తీర్పు వినబోతున్న ఖైదీలా ఉంది అతని మనస్సు. డాక్టర్ నోటి నుంచి ఎటువంటి వార్త వినవలసి వస్తుందో అని టెన్షన్‌తో థియేటరు ముందు పచార్లు చేస్తున్నాడు. అలజడితో, ఆందోళనతో ఎటువంటి వార్త వినవలసి వస్తుందో అన్న భయంతో అతని ముఖం ఎర్రగా కందిపోయింది కళ్ళు చింతనిప్పులా మెరుస్తున్నాయి అతని చూపులూ చెవులూ థియేటర్ వైపే ఉన్నాయి చూసిన వాళ్ళకి ఎంతో బాధనిపిస్తుంది అతను పడుతున్న వేదన చూస్తుంటే గంటయింది జయరాంలో టెన్షన్ పెరిగిపోతుంది నిముష, నిముషానికి

థియేటర్ తలుపులు తెరుచుకున్నాయి డాక్టర్ సావిత్రి బయటకు వచ్చింది ఒక్క అంగలో ఆమెను సమీపించాడు జయరాం డాక్టరు అతని కళ్ళలోకి చూడలేకపోయింది ఎన్నో రోగాలూ, చావులూ చూసిన ఆమె మనస్సు కూడా అతని ముఖం చూడగానే ద్రవించిపోయింది

డాక్టర్! ఆపరేషన్ పూర్తి అయిందా? గర్భసంచి ఉంచటానికి వీలయిందా?' ఆతృతగా ప్రశ్నల వర్షం కురిపించాడు

'సారీ! మిష్టర్ జయరాం ఆమె గర్భసంచి నిండా గడ్డలున్నాయి పూర్తిగా గర్భసంచిని తొలగించటమే, మంచిది ఎందుకంటే, ఆ గడ్డలు మళ్ళీ పుట్టవన్న గ్యారంటీ లేదు మళ్ళీ పుడితే మళ్ళీ, ఆపరేషన్ చేయాల్సి వస్తుంది అందువలన గర్భసంచిని పూర్తిగా తీసి వేయటమే మంచిది నీ అనుమతి కోసం వచ్చాను అంది బాధగా

జయరాంకు, తల మీద పిడుగుల వర్షం కురుస్తున్నట్లుగా ఉంది మనస్సులో సముద్రపు హోరు పాతాళానికి కూరుకుపోతున్నట్లుగా ఉంది అతని నరాల్లోని రక్తం మరిగిపోతుంది

"జయరాం! మనస్సును నిగ్రహ పరుచుకో పిల్లల కంటే, ఆమె ప్రాణం



ముఖ్యం గర్భసంచి తొలగించకపోతే క్యాన్సరు వచ్చే ప్రమాదం ఉంది అపతల పేషెంటు టేబులు మీదుంది త్వరగానే నిర్ణయం చెప్పు"

మీ ఇష్టం డాక్టర్ అతి ప్రయత్నం మీద గొంతు పెగల్చుకుని అన్నాడు. డాక్టర్ లోపలి కెళ్ళింది థియేటర్ తలుపులు మూసుకున్నాయి జయరాం రూములో కొచ్చి బెడ్ మీద పడుకుని రెండు చేతుల్లో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చాడు అతన్ని చూడగానే అర్థమయింది మాధవరావు గారి దంపతులకు

ఈ ఆపరేషన్‌తో స్వప్న మాతృమూర్తి అయ్యే అర్హత కోల్పోయిందని ఇద్దరూ కుప్ప కూలిపోయారు డాక్టరు వచ్చే వరకూ. ముగ్గురూ అదే స్థితిలో ఉన్నారు

మీరిలా డీలాపడితే, స్వప్న స్థితి ఎలా ఉంటుందో ఆలోచించండి ఆపరేషన్ పూర్తి అయింది ఒక గంటలో ఆమెకు తెలివి వస్తుంది కొంత కాలం వరకూ, గర్భసంచి తీసి వేసారన్న విషయం ఆమెకు తెలియకూడదు చాలా వీక్‌గా ఉంది. కొంత కాలం వరకూ ఈ విషయం తెలియకుండా జాగ్రత్త పడటం మంచిది

డాక్టర్ వెళ్ళిపోయింది

అంత బాధను మనస్సులో దాచుకుని పైకి మామూలుగా ఉండటం ఎవరికయినా సాధ్యం కాదు

స్వప్నకు తెలివచ్చింది జయరాం ఆమె మంచానికి దగ్గరగా కుర్చీ లాక్కుని కూర్చున్నాడు

'ఏమండి

'ఏమిటి స్వప్నా! ఆపరేషన్ అయిపోయింది ఇంకేం భయంలేదు." ఆమె చేతి మీద తన చెయ్యి వేసాడు

తనకు ఆపరేషన్ అయితేనే, ఇంత బాధ పడుతున్న భర్త రేపు తను చచ్చిపోతే, పిచ్చివాడయి పోతాడేమో అనుకుంది. ఆ క్షణంలో మంచం మీద నుంచి లేచి, అతని గుండెల మీద వాలిపోవాలన్నంత ఆవేశం వచ్చింది. 'ఇప్పుడు నాకేమయింది? కన్నీళ్ళెందుకు?' ప్రేమగా అంది.

'స్వప్నా' ఎక్కువగా మాట్లాడకమ్మా. రెస్టు తీసుకో. తర్వాత మాట్లాడుకోవచ్చు" అన్నారు మాధవరావు గారు. జయరాం ఆ రూములో నుంచి బయటకొచ్చాడు జయంతికి కూతురు ముఖంలోకి చూసే ధైర్యం లేక, బాత్‌రూములోకి, హాలులోకి తిరుగుతుంది స్వప్న మగతగా కళ్ళు మూసుకుంది

* * * * *

స్వప్నకు ఆపరేషన్ జరిగి నాలుగు నెలలయింది. ఇప్పుడు మామూలుగా, ఆరోగ్యంగా ఉంది

స్వప్నకు భర్త ధోరణి అర్థం కావటం లేదు ఇదివరకు ఆమె అంటే ఎంత ప్రేమ చూపించేవాడో ఇప్పుడూ అంతే చూపిస్తున్నాడు కానీ అతని ప్రేమలో ఏదో మార్పు కనిపిస్తుంది ఆమెకు అంతకు ముందులా ఎక్కువ సమయాన్ని ఆమెతో గడపటం లేదు పిల్లల విషయమే ఎత్తటం లేదు అది ఆమెకు చాలా ఆశ్చర్యంగా ఉంది ఆ విషయం ఎత్తితే, వెంటనే మాట మారుస్తాడు

"మీ రెందుకలా మారిపోతున్నారు" భర్త వైపు తిరిగి అడిగింది స్వప్న

'నేనా"'

అవును '

నేనేం మారిపోయాను"

'మీలో మార్పు మీకు తెలియదా?

నాలో, నాకేం మార్పు కనిపించటం లేదు

నిజం చెప్పండి నాకు పిల్లలు పుట్టలేదని, మీకు బాధగా ఉంది కదూ'

'పిచ్చిదానా! బాధపడితే పుడతారా?

ఆపరేషన్ చేయించుకున్నానుగా" భగవంతుని దయ వలన ఒక్క బిడ్డ పుడితే చాలు

జయరాంకు మనస్సును పిండినట్టనిపించింది

'ఒకవేళ నాకు పిల్లలు పుట్టకపోయినా, నన్నింత ప్రేమగానే చూస్తారు కదూ?"

ఎందుకు చూడను? పిల్లలకూ, ప్రేమకూ సంబంధం ఏముంది?

'నిజంగానా?" ఆమె గొంతులోని సంతోషానికి అతను చలించిపోయాడు

"స్వప్నా! మనం కన్న కలలన్నీ నిజం కావు ' బాధగా అనుకున్నాడు

* * * * *

స్వప్న ఈ జీవితంలో తను తల్లిని కాలేనన్న విషయం తెల్సుకుంది ఆ రోజంతా భోం చెయ్యకుండా, ఏడుస్తూ పడుకుంది వాళ్ళ డాడి, మమ్మి, జయరాం అందరూ బ్రతిమాలినా బెడ్‌రూములో నుంచి బయటకు రాకుండా ఏడుస్తూనే ఉంది రెండు రోజుల వరకూ

తనకు పిల్లలు పుట్టరన్న బాధ కంటే, ఆ కారణంగా భర్త ప్రేమ దూరమవుతుందేమో అన్న ఆలోచనే, ఆమెకు అమితంగా బాధ పెడుతుంది

జయరాం, స్వప్నతో ఎప్పటిలాగే ఉంటున్నా, స్వప్నకు మాత్రం ఏదో వెలితిగానే ఉంది

ఆ రోజు ఆదివారం అంతకుముందు, ఆదివారం వస్తే చాలు ఇల్లు కదిలేవాడు కాదు జయరాం ఇప్పుడు ఆదివారం వస్తే ఇంట్లో కనిపించడు

మాధవరావు గారు, జయంతి ఊరెళ్ళారు ఒంటరిగా కూర్చుని, కూర్చుని విసుగు పుడుతుంది స్వప్నకు ఎంత సేపని గదిలో కూర్చోగలదు?

నిద్రపోదామంటే నిద్ర రాదు విపరీతమయిన ఆలోచనలు ఏదయినా పని చేద్దామంటే ఇంట్లో నలుగురు నౌకర్లున్నారు వాళ్ళు చెయ్యటానికే పనిలేదు కాలక్షేపం కోసం కొంతకాలం వీణ నేర్చుకుంది తర్వాత అది విసుగనిపించి సాధన మానేసింది జయరాం ప్రేమలో మునిగియి స్నేహితులంటూ లేకుండా






చేసుకుంది ఇప్పుడు ఎక్కడికెళ్ళాలన్నా పాపం! నీకు ఆపరేషన్ జరిగిందంటగా గొడ్రాలి జీవితం బాధగానే ఉంటుంది ఏం చేస్తావు? పాపం? అంటూ సానుభూతిని చూపిస్తారన్న భయం ఇతరుల సానుభూతిని భరించలేదు స్వప్న

ఈ మధ్య స్వప్న మనస్సులో అశాంతి ఆవేదనా గూడుకట్టుకున్నాయి ప్రతి నిముషం ఆవేదనగా ఉంటుంది దుఃఖం పొంగుతుంది జీవితం వ్యర్థమయిపోయిందన్న ఆలోచన ఆమె మనస్సును కుమ్మరి పురుగులా తొలిచేస్తుంది ఆలోచనల నుంచి తప్పించుకునే ప్రయత్నంలో ఆరుబయట లాన్‌లోకి వచ్చింది

గేటు తెరుచుకుని వస్తున్న లక్ష్మిని చూసి సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయి తేరుకుని లక్ష్మీ! అంటూ ఆమెకు ఎదురొచ్చి కౌగిలించుకుంది

స్వప్నా! ఏమిటలా చిక్కిపోయావు' భోజనం చేస్తున్నావా? లేక డైటింగ్ చేస్తున్నావా?

స్వప్న కళ్ళలో లక్ష్మి చూపుతున్న ఆప్యాయతకు నీళ్ళు తిరిగాయి

స్వప్నా! ఏమిటది చిన్నపిల్లలా? నువ్వింకా నీకు పిల్లలు పుట్టరన్న విషయాన్ని మనస్సులో పెట్టుకుని బాధ పడుతున్నావా? లక్ష్మి ఆశ్చర్యపడుతున్నట్లు స్వప్న ముఖంలోకి చూసింది

స్వప్న పొంగుతున్న దుఃఖంతో గొంతు పూడుకుపోగా మాట్లాడలేకపోయింది

స్వప్నా! నిజం చెప్పు నీ కాపురంలో అసంతృప్తి కనిపిస్తుందా' అంది ఓదార్పుగా

మీ అన్నయ్య చాలా మారిపోయారు లక్ష్మి

లేదు స్వప్నా! నువ్వు పొరపాటు పడుతున్నావు అన్నయ్య ఎప్పటికీ మారడు నువ్వంటే అన్నయ్యకు ఎంత ప్రేమో నీకు తెలియదా?

లేదు లక్ష్మీ! ఆయన చాలా మారిపోయారు

ఎందుకని'

అదే నాకూ తెలియటం లేదు

నమ్మలేకపోతున్నాను

మీ అన్నయ్యకు నా కంటే పిల్లలు ముఖ్యం నాకు ఆపరేషన్ జరిగిన దగ్గర్నుంచే ఆయన మారిపోయారు

మీరిద్దరూ ఒకరంటే ఒకరు ఎఫెక్షనేట్‌గా వుండటం లేదా'

స్వప్న పెదవిని పళ్ళ మధ్య బిగపట్టి దుఃఖాన్ని ఆపుకుంటుంది

స్వప్నా! నాకు చెప్పటానికి సంశయిస్తున్నావా?

నేను ఎప్పటిలాగే ఉంటున్నాను ఆయనే నాకు దూరమవుతున్నారనిపిస్తుంది అప్పటికీ ఇప్పటికీ చాలా మారిపోయారు

అన్నయ్యతో నేను మాట్లాడతాను

వద్దు లక్ష్మి భార్యాభర్తల మధ్య ఒకరి పట్ల ఒకరికి ప్రేమానురాగాలు సహజంగా కలగాలి గాని ఒకరు చెబితే కలుగుతుందా' రాక రాక వచ్చావు నీ మనస్సు పాడు చేసాను

నువ్వు నాకు వదినవు కాకముందు నుంచి నా స్నేహితురాలివి నీ బాధ నా బాధ కాదా స్వప్నా'

స్వప్న లోపలికి వెళ్ళి వంటమనిషితో లక్ష్మి వచ్చింది వేడిగా పకోడీలు చేసి తీసుకురా అని చెప్పొచ్చింది

బాబూ పాపా బావున్నారా?

ఇద్దరూ ఒక్కటే అల్లరి ఒక నెలనుంచి బాబు కాన్వెంటు కెళుతున్నాడు పాప అమ్మను తెగ విసిగిస్తుంది

పాపను నా కివ్వు లక్ష్మీ

స్వప్నా! నువ్వేదడిగినా నేను కాదనను పాప వయస్సు అయిదు నెలలేగా! నెలల పాపతో నువ్వు వేగలేవు కొన్ని రోజులు పోయిన తర్వాత పాపను నీకే ఇస్తాను నిండు మనస్సుతో అంతకు మించిన కృతజ్ఞతతో అంది లక్ష్మి

ఈ మాట మనస్ఫూర్తిగా అంటున్నావా లక్ష్మీ?

స్వప్నా! లక్ష రూపాయల కట్నంతో యాభయ్యివేల రూపాయల ఖరీదు చేసే నగలతో నాకు భర్తను కొనిచ్చావు ఈ రోజు హాయిగా సంతోషంగా బ్రతకగలుగుతున్నానంటే ఈ అదృష్టం నువ్వు ప్రసాదించిందేగా? ఆ రోజు నువ్వు

# ప్రేమసాగరం

స్వర్గం చూపిస్తే, ఈ రోజు నేనింత సుఖంగా ఉండగలిగేదాన్నా? ఏమిచ్చి నీ ఋణం తీర్చుకో గలను? నువ్వు కోరితే, నా ప్రాణాలయినా ఇస్తాను. మంచికి మాకు పేరు నువ్వు. దేవతలాంటి నీ నీడలో పాప జీవితం హాయిగా ఉంటుంది. నీ ప్రేమను పొందగలిగితే, నా పాపంత అదృష్టవంతులు ఎవరూ ఉండరు."

"నీకయినా ఆ నమ్మకం ఉంది. నాకంతే చాలు లక్ష్మి."

"నేనేకాదు అన్నయ్యా, అమ్మా అందరం జీవితాంతం నీకు ఋణపడి ఉంటాం."

నీళ్ళు నిండిన కళ్ళతో స్వప్న లక్ష్మి వైపు చూసింది.

"స్వప్నా! నీ కళ్ళలో నీళ్ళు నేను చూడలేను. ప్లీజ్! కళ్ళు తుడుచుకో."

వంటమనిషి, పకోడీల ప్లేటు తెచ్చి వాళ్ళముందు పెట్టి వెళ్ళింది.

★ ★ ★ ★

ఆ రాత్రి జయరాం ఇంటి కొచ్చేసరికి, చాలా పొద్దు పోయింది. అతని కోసం ఎదురు చూస్తూ లక్ష్మి వరండాలో నే కూర్చుంది.

"ఎప్పుడొచ్చావు? లక్ష్మీ?" చెల్లెల్ని ప్రేమగా పలకరిస్తూ, కుర్చీని ఆమెకు దగ్గరగా లాక్కుని కూర్చున్నాడు జయరాం.

"నాలుగ్గంటలకొచ్చాను."

"భోం చేసేసావా?"

"భోంచేసాను."

"పిల్లలూ, మీ ఆయనా, అమ్మా అందరూ బావున్నారా?"

"ఏం అన్నయ్యా! నెల కొక్కసారయినా, మమ్మల్ని చూడటానికి రాకూడదూ?"

"ఎక్కడమ్మా! మామయ్యగారి ఆరోగ్యం పాడయింది. ఆయన మందులు వాడుతున్నారు. ఫ్యాక్టరీ విషయాలన్నీ నేనే చూసుకోవాల్సి రావటంతో, నిముషం తీరటం లేదు."

"ఇప్పటివరకూ ఎక్కడికెళ్ళావు?"

"మోహన్ దగ్గరకెళ్ళాను. కాస్త ఆలస్యమయింది."

"స్వప్న చెబితే నమ్మలేక పోయాను. నీలో మార్పు స్పష్టంగా కనిపిస్తుంది. ఇంత బంగళాలో, ఆంటీ, అంకుల్ కూడా లేరుకదా? స్వప్న ఒంటరిగా ఎలా ఉంటుందను కున్నావు? నీ ఫ్రెండ్‌ను కల్సుకోవటానికి అంత అర్జెంట్ ఏముంది. అయినా, ఆదివారాలు కూడా ఇంటి పట్టు నుండకుండా ఈ తిరుగుళ్ళేమిటి?"

"పనిమీద వెళ్ళానమ్మా."

"అన్నయ్యా! స్వప్న మనస్సు అమృతం లాంటిది. ఆ దేవతను బాధపెడితే, నీ అంత ద్రోహి ప్రపంచంలో ఇంకొకరుండరు."

"నేనేం బాధ పెట్టానమ్మా?"

ఇటీవల ఒరిస్సాలోని బరంపురంలో జరిగిన ఆంధ్ర మహిళా సమాజం సమావేశంలో ముఖ్య అతిథిగా పాల్గొన్న ప్రముఖ రచయిత్రి శ్రీమతి రావి నూతల సువర్ణా కన్నన్, సంస్థ అధ్యక్షురాలు శ్రీమతి ఇ. పద్మావతి, కార్యదర్శి శ్రీమతి ఎ. కాళీ కుమారి గార్లని చిత్రంలో చూడవచ్చు.



"ఇంతకంటే ఇంకేం బాధ పెట్టాలి? స్వప్న నిన్ను సంపాదించమనటం లేదు. నగలూ, చీరలూ అడగటం లేదు. నిన్ను తనకళ్ళ ముందుండ మంటుంది. అంతేగా? అది కూడా బాధగా ఉందా నీకు? అన్నయ్యా! మనకు అంతస్థును పెంచింది. మన జీవితాలకు, బంగారు బాటలు వేసింది. కలలో కూడా మనం ఊహించలేని జీవితాల్ని ప్రసాదించిన దేవత స్వప్న. ఆమె మనస్సు బాధ పెడితే, ఈ ఇంటి గుమ్మం కూడా తొక్కను నేను."

"ఇప్పుడేం జరిగిందని లక్ష్మి! నువ్వింత ఆవేశపడుతున్నావు?"

"నేను రాగానే, ఆత్మీయులు కనిపించిన ఆనందంతో స్వప్న కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆత్మీయతా, అనురాగం కోసం, ఆమె మనస్సు ఎంత తల్లడిల్లి పోతుందో అర్థమయింది. స్వప్న కళ్ళలో నీళ్ళు తిరగటం నేను ఈ రోజే మొదటిసారిగా చూడటం."

"స్వప్న ఈ మధ్య మరీ పిచ్చిదానిలా తయారవుతుంది. కొంత కాలానికి, ఆమెను హాస్పటల్‌లో ఎడ్మిట్ చెయ్యాల్సి వస్తుందేమో అని భయంగా ఉంది. నాలో ఎటువంటి మార్పులేదు. నేను ఎప్పటిలాగే ఉన్నాను. అయినా మీరు మారిపోయారు, మీరు మారిపోయారు అని సాధిస్తుంది. కాస్త పెద్దగా మాట్లాడితే చాలు కోపంగా మూతి ముడుచుకుని ఏడుస్తూ కూర్చుంటుంది."

"నువ్వు చెబితే మాత్రం, నేను నమ్ముతాననుకున్నావా అన్నయ్యా! ఇన్ని సంవత్సరాలలో, ఎప్పుడూ ఇలా ప్రవర్తించని స్వప్న, ఇప్పుడు కొత్తగా ఇలా ప్రవర్తించుతుందా?"

పట్టుబడిన దొంగలా ఉంది జయరాం పరిస్థితి.

"ఆమె ప్రేమ కోసం. ఒకప్పుడు నువ్వెంతగా ప్రాకులాడావో గుర్తుకు తెచ్చుకో. వాళ్ళ అంతస్థుకు తగిన రఘునాధ్‌ను పెళ్ళి చేసుకోకుండా, పేదవాడయిన నిన్ను కోరి ప్రేమించి పెళ్ళి చేసుకుంది. అందుకు ప్రతిఫలంగా ఆమెకు నువ్విస్తుంది కన్నీళ్ళు. అంతేనా?"; అంది లక్ష్మి కోపంగా.

"నన్నేం చెయ్యమంటావమ్మా? నేనెంత చెప్పినా తన ధోరణి తనదే గాని, నా మాట వినిపించుకోదు."

"అన్నయ్యా! చివరి సారిగా చెబుతున్నాను. నీ ధోరణి మార్చుకుని, స్వప్నను సంతోషపెట్టు. మరో సారి స్వప్న కన్నీళ్ళు పెట్టు కోవటం నేను చూస్తే, నీ గుమ్మం తొక్కను. స్వప్న తర్వాతే నాకు నువ్వయినా."

"మీవార్ని, పిల్లల్ని తీసుకురాలేకపోయావా?" అన్నాడు జయరాం మాట మారుస్తూ.

"స్వప్నను చూడాలనిపించింది. ఈ రోజు ఎలాగూ, శలవేకదా? రేపొక్క రోజు శలవు పెట్టి వచ్చాను. రేపు సాయంత్రం ట్రెయిన్‌లో వెళతాను."

"మీరు కూడా, విశాఖ ట్రాన్స్‌ఫర్ చేయించు కోకూడదూ?"

"ఆ ప్రయత్నం లోనే ఉన్నారు. ఒకటి, రెండు నెలల్లో, మేం కూడా విశాఖ రావచ్చు."

"నన్ను ప్రయత్నం చెయ్యమంటావా?"

"ఆయన చేసుకుంటున్నారుగా? అవ్వకపోతే, అప్పుడు నువ్వు ప్రయత్నిద్దువుగాని."

"చాలా ప్రొద్దు పోయింది. వెళ్ళి పడుకోమ్మా." అంటూ లేచాడు జయరాం.

★ ★ ★ ★ ★ ★

రఘునాధ్ ఆఫీసురూములో కూర్చున్నాడు. మాధవరావుగారొచ్చి, అతని కెదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నారు. ఆయన ముఖం సహజమయిన చిరునవ్వుతో లేదు. ఎందుకో బాధపడుతున్నట్టుగా ఉంది.

"అంకుల్! ఎందుకలా ఉన్నారు?"

"ఏం లేదు రఘూ."

"అబద్ధం చెబుతున్నారు. స్వప్నకు పిల్లలు పుట్టరన్న విషయం మీరింకా మరిచిపోలేక పోతున్నారు."

"ఆ భగవంతుడు, ఏ పాపం ఎరుగని స్వప్నను, కక్ష కట్టినట్టు

సాదిస్తున్నాడు రఘూ! పిల్లలు లేక పోయినా ఫరవాలేదు ఏ అనాధ బిడ్డనయినా తెచ్చి పెంచుకోవచ్చు కానీ, దాని జీవితం సుఖంగా గడిచిపోతే చాలనుకుంటున్నాను

అయన ఏదో బాధను తనతో పంచుకోవాలని వచ్చి చెప్పటానికి సంశయిస్తున్నారని అర్థమయింది రఘునాద్‌కు

ఏం జరిగింది ?

ఏమి లేదు బాబూ

స్వప్న కేమయిందని మీరింతగా బాధ పడుతున్నారు?

ఇప్పటి వరకూ ఏం కాలేదు ఈ మధ్య నాకు బీ పి ఎక్కువయింది అప్పుడప్పుడు గుండె నెప్పికూడా వస్తుంది నేనింకెంతో కాలం బ్రతకను నేను పోయిన తర్వాత స్వప్న భవిష్యత్ ఎలా ఉంటుందో ఊహించ టానిక్కూడా భయంగా ఉంది బాబూ నాకు బాధతో అయన గొంతు బొంగురు పోయింది

మీరు అనవసరమయిన ఆలోచనలతో మనస్సు పాడు చేసుకుంటూ అనారోగ్యాన్ని కొని తెచ్చుకుంటున్నారు

లేదు బాబూ! నేను పోయింతర్వాత స్వప్న బాధ్యత తీసుకుంటానని నాకు మాటివ్వు

అసలేం జరిగింది అంకుల్? ఎందుకిలా బాధపడుతున్నారు?

ఈమధ్య కాలక్షేపం కోసం చెస్స్ ఆడటానికి మా స్నేహితుడింటికి వెళుతున్నాను సాయంత్రం పూట ఒక నెలరోజుల నుంచి అప్పుడప్పుడు జయరాం కారు ఆ వీదిలో ఒక పెంకుటింటి ముందు ఆగి ఉంటుంది ఒకటి రెండు సార్లు జయరాం ఏదైన పని మీద వాళ్ళింటికొచ్చాడేమో అనుకున్నాను మొదట్లో వారానికి ఒకటి రెండుసార్లు మాత్రం కనిపించేది అతని కారు ఇప్పుడు రోజూ కనిపిస్తుంది అతను రోజూ ఆ ఇంటి కెళ్ళాల్సిన అవసరం ఏముంది? ఈ మధ్య స్వప్న ముఖంలో సంతోషమన్నది కనిపించటం లేదు కారణం అడిగితే నోరు మెదపదు

అతను కూడా మీలాగే సాయంత్రం పూట స్నేహితుడితో కాలక్షేపం కోసం కార్డ్సు ఆడటానికి వెళుతున్నాడేమో

లేదు రఘూ! అతనికా అలవాటు లేదు

ఎవరినయినా కల్సుకోవటానికి వెళుతున్నాడనా మీ అనుమానం?

అనుమానం కాదు నిజం

ఆ వివరాలు నేను తెల్సుకుంటాను మీరు ప్రశాంతంగా ఉండండి

రఘునాద్! వీలయినంత త్వరలో ఆ ఇంటి కెందుకెళుతున్నాడో జయరాం ఎవర్ని కల్సుకుంటానికి వెళుతున్నాడో తెల్సుకోవాలి లాయరుతో మాట్లాడి ఫ్యాక్టరీ ఇతర ఆస్తులవి స్వప్న ఇష్టానుసారంగా రాయాలను కుంటున్నాను

నేను రెండు రోజుల్లో వివరాలన్నీ మీకు చెబుతాను అన్నాడు రఘునాద్

పదినిముషాలు కూర్చుని ఇంట కెళ్ళారు మాదవరావుగారు

రఘునాద్ స్వప్నను గురించి ఆలోచిస్తూ బరువెక్కిన మనస్సుతో అలాగే కూర్చుండి పోయాడు

* * * * * *

రెండు రోజుల తర్వాత మళ్ళీ మాదవరావుగారు రఘునాద్ దగ్గరకు వచ్చారు తనకు తెల్సిన విషయం అయనతో ఎలా చెప్పాలా అన్న మీమాంసలో పడిపోయాడు రఘునాద్ నిజాన్ని దాచి పెడితే పాముకు పాలు పోసినట్టుగా మాదవరావుగారు ఆస్తి జయరాంకు రాసేస్తే స్వప్న పరిస్థితి మరి హీనంగా తయారవుతుంది చెబితే ఆ షాక్ అయన భరించగలరో లేదో ఏం చెప్పటానికి తోచలేదు

మాధవరావుగారు తరిచి తరిచి అడగటంతో చెప్పక తప్పలేదు

ఆ పెంకుటింట్లో రమణరావుగారు అనే అతను ఉంటున్నాడు అతను గుమ్మస్తాగా పని చేసి రిటైరయ్యాడు పక్షవాతంతో బాధపడుతూ మంచంలో ఉన్నాడు అయన కొచ్చే పించను అయన మందులకే చాలదు అయన భార్య వరలక్ష్మి వాళ్ళ కూతురు మోహిని ఆ అమ్మాయి జయరాం ఆఫీసులో టైపిస్టుగా పనిచేస్తుంది ఆ అమ్మాయిని కల్సుకోవటానికి జయరాం రోజూ వాళ్ళింటి కెళుతున్నాడు ' తను తెల్సుకున్న వివరాలన్ని చెప్పాడు రఘునాద్

# ప్రేమసాగరం

మాధవరావు గారికి తల తిరుగుతున్నట్టనిపించింది. ఆయనకు ఇంతవరకు అల్లుడి మీద కలిగిన అనుమానం నిజమని తెల్సేసరికి రెండు చేతులతో ముఖం దాచుకుని ఏడుస్తున్నారు.

ఎప్పుడూ గంభీరంగా హుందాగా పులిలా ఉండే ఆయన చిన్నపిల్లాడిలా రోదిస్తుంటే ఆయన్ని ఏమని ఓదార్చాలో కూడా అర్థంగాక చూస్తూ కూర్చున్నాడు రఘునాథ్.

పది నిముషాల తర్వాత తేరుకున్న మాధవరావు గారు "స్వప్నను అతని బారి నుంచి దేముడు కూడా రక్షించలేడు బాబూ! అది ప్రేమనే ఊబిలో గొంతువరకూ కూరుకు పోయింది. మనం జయరాం విషయం చెప్పినా నమ్మే స్థితిలో లేదు. అది పిచ్చి ప్రేమలో ఏదో ఒకరోజు ఈ నిజం దానికి తెలిసినప్పుడు దాని గుండె బ్రద్దలయి పోతుంది. ఆ దుర్మార్గుడు స్వప్నకింత నరకాన్ని సృష్టిస్తాడని కలలో కూడా ఊహించలేక పోయాను. ఇప్పుడేం చేయను? నా బిడ్డనెలా కాపాడుకోను? స్వప్న సంతోషంగా కనిపించటం లేదనే మీ ఆంటీ కుమిలి పోతుంది. ఇక ఈ విషయం కూడా తెలిస్తే జయంతి బ్రతకదు" కళ్ళు తుడుచుకుంటూ అన్నారు.

"ఎందుకయినా మంచిది. ఆస్తిపాస్తులన్నీ స్వప్న ఇష్టానుసారంగా వ్రాసి రిజిస్టర్ చేయించండి. ఇంత విశ్వాసం లేకుండా ప్రవర్తించిన అతను ఈ ఆస్తిని మాత్రం నిలుపుతాడన్న నమ్మకం ఏమిటి? అల్లుళ్ళను అందలం ఎక్కిస్తే ఇలాగే ఉంటుంది."

"నేనూ అలాగే చేద్దామనుకుంటున్నాను."

"డబ్బు అందక పోతే అతనే దారికొస్తాడు."

"అతను ఏం చెయ్యమన్నా ముందు వెనుకలు ఆలోచించకుండా చేస్తుంది స్వప్న. అంత పిచ్చి ప్రేమ అతనంటే దానికి. నేనిప్పుడు ఆస్తి అంతా స్వప్న పేర వ్రాసినా రేపు అతను తన పేర రాయమని అడిగితే మొత్తం వ్రాసేస్తుంది."

"మన ప్రయత్నం మనం చేస్తున్నాం. స్వప్న కావాలని ఆస్తి అతని పేర వ్రాస్తే మనం మాత్రం ఏం చెయ్యగలం?"

"నేను ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాను రఘూ."

"అంకుల్ మీకెలా చేస్తే బాగుంటుందనిపిస్తే అలా చెయ్యండి."

"అందుకు నువ్వు కూడా నాకు సహకరించాలి."

"చెప్పండి అంకుల్. స్వప్న సంతోషంగా మీరు ప్రశాంతంగా ఉండటానికి నేనేం చెయ్యమన్నా చేస్తాను."

"నిన్ను దూరం చేసుకున్న రోజునే నా మనస్సుకు శాంతి లేకుండా పోయింది. ఇంకెక్కడి ప్రశాంతత? నాకు శాంతి లేదు. స్వప్నకు సంతోషమూ లేదు" అన్నారు బాధగా.




"మరేం చెయ్యమంటారు?"

"ఆస్తి స్వప్న పేర సగం అక్కడ నీ పేర రాయాలనుకుంటున్నాను."

"వద్దు. పొరపాటున కూడా అలా చెయ్యొద్దు. మీరు స్వప్న భవిష్యత్తును దృష్టిలో పెట్టుకుని, అలా చేసినా మీరు చేసిన మంచి భార్యాభర్తల మధ్య గొడవలకు దారి తీస్తుంది. ఒకవేళ మీరు ఊహించినట్టు జరిగి ఆస్తి అంతా జయరాం పాడు చేస్తే నా ఆస్తి అంతా స్వప్నకిస్తాను అంకుల్! స్వప్న అంటే నాకెంత ప్రాణమో తెల్సు మీకు. ఆమె సుఖాన్ని సంతోషాన్ని నావిగా భావించుకుని బ్రతుకుతున్నాను. అటువంటి నేను స్వప్న బాధ పడుతుంటే చూడగలనా? మీరు ఆస్తి విషయాన్ని గురించి బాధపడొద్దు. మిగిలి పోయినా నాదుంటుంది. అనవసరంగా మీరు వాళ్ళ మధ్య కలతలు రేపొద్దు. మొత్తం స్వప్న పేర రాయండి" అన్నాడు.

* * * *

ఆ రెండో రోజే రఘునాథ్ సమక్షంలో ఆస్తంతా స్వప్న ఇష్టానుసారంగా లాయరు గారి ద్వారా రాయించి రిజిస్టర్ చేయించారు మాధవరావు గారు. అప్పటికి గాని ఆయన మనస్సు శాంతించలేదు.

మాధవరావుగారు, జయంతి హాలులో కూర్చుని బెడ్ రూములో పడుకున్న స్వప్నను పిలిచారు. జయరాం ఇంట్లో లేడు. స్వప్న వచ్చి వాళ్ళ డాడీ పక్కన కూర్చుంది. కూతుర్ని చూస్తుంటే గుండె పగిలిపోతుంది ఆయనకు. స్వప్నలో చాలా మార్పు కనిపిస్తుంది.

"స్వప్నా! మీ డాడీ ఆస్తి అంతా నీ పేర వ్రాయించి రిజిష్టర్ చేయించారు. అందుకు సంబంధించిన కాగితాలు డాడీ బీరువాలో ఉన్నాయి చూసుకో. ఆ విషయం చెప్పటానికే నిన్ను పిలిచారు" జయంతి చెప్పింది.

"నాకు చెప్పకుండా ఎందుకలా రాయించారు? అంత తొందరేమొచ్చింది?"

"నా ఆరోగ్యం బావుండటం లేదు. చెయ్యాలనుకున్న పనులు చేసేస్తే ప్రశాంతంగా ఉంటుంది."

"అంతా నా పేర ఎందుకు రాసారు? ఆయనేమనుకుంటారు? తనమీద నాకు నమ్మకం లేక మీకు చెప్పి అలా రాయించుకున్నాననుకుంటారు. తనకంటే నాకు డబ్బే ముఖ్యం అనుకుంటారు. ఆయన నన్ను అపార్థం చేసుకుంటే నేను భరించలేను డాడీ! మొత్తం ఆయన పేరుతో వ్రాసినా నాకెంతో సంతోషంగా ఉండేది. నాతో మాట మాత్రంగానయినా చెప్పకుండా చేసారు."

స్వప్న మీద మొదటిసారిగా పట్టలేనంత కోపం వచ్చింది మాధవరావు గారికి. అయినా తమాయించుకున్నారు.

"స్వప్నా! మీ డాడీ ఏం చేసినా నీ భవిష్యత్తును గురించి ఆలోచించే చేస్తారు. పిల్లలు లేరు. ఆస్తి అయినా నీ పేరుతో లేకపోతే ఎలా? ఎందుకంత బాధపడతావు? ఎవరి పేరుతో ఉంటే ఏం?" అంది కోపంగా.

కూతురు అల్లుడు మీద పెంచుకున్న ప్రేమకు, నమ్మకానికి, అతను ఆమెకు చేస్తున్న అన్యాయానికి ఏమీ చెయ్యలేని తన నిస్సహాయ స్థితిని తలుచుకుంటూ మనస్సులో కుమిలి పోవటం తప్ప ఏం చెయ్యలేక పోయారు మాధవరావుగారు.

"అలా అన్నావు గాని మమ్మీ! మనకున్న ఆస్తి అంతా డాడీ పేరుతోనే ఉంది. నీ పేరుతో ఏమీ లేదు. నాది మాత్రం నా భర్త పేరుతో కాకుండా నా పేరుతో ఉండాలనుకుంటున్నారు. ఇదేం న్యాయం? ఏం ఆస్తి లేకపోతే నా భర్త నన్ను పోషించ లేరనుకుంటున్నారా? ఆయన్ని గురించి మీరెప్పుడూ తేలికగానే ఆలోచిస్తారు. ఆయన పేదవాడని మీరిద్దరూ మొదటి నుంచి నా భర్తను చిన్న చూపే చూస్తున్నారు. ఆ భావంతోనే ఇప్పుడు ఆస్తి అంతా నా పేర వ్రాసారు. నా మనస్సు, నా ఆలోచనలు అన్నీ తెల్సి కూడా మీరిలా చేసారు" అంది కోపంగా.

"స్వప్నా! మీ డాడీ దేముడులాంటి మనిషి. మీ ఆయనకూ మీ డాడీకి నక్కకూ నాగలోకానికున్నంత తేడా ఉంది. ఎయ్యానికయినా కయ్యానికయినా సమమయిన వాళ్ళు కావాలి. నువ్వు ప్రేమించావని నీ సంతోషం కోసం ఇతన్ని

అల్లుడిగా చేసుకున్నాం కుక్కను సింహాసనం మీద కూర్చో బెట్టినా, చెప్పులు కొరకటం మానదని, అల్లుడిగా చేసుకున్నందుకు మా గుండెల్లో మంట పెట్టాడు ఆవేశంగా కోపంగా అంది జయంతి

జయంతీ! నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుసా? నోర్ముయ్యి ఖంగుమంది మాదవరావు గారి గొంతు

అల్లుడన్న గౌరవం కూడా లేకుండా ఆయన్ని కుక్కతో పోల్చి మాట్లాడావు ఆయన మీద గౌరవం లేకపోయినా నేను బాదపడతానేమో అన్న ఆలోచన కూడా లేకుండా అన్నావు ఏం మమ్మీ! ఆయనకు మీరేం కట్నం ఇచ్చారు? ఆయన్ని మీరు అందలం ఎక్కించినా మీ డబ్బు ఆయనేం ఖర్చు పెట్టటం లేదు మన ఫ్యాక్టరీలో రోజుకు పది గంటలు పని చేస్తున్నారు ఆయన ఆ పని ఎవరి దగ్గర చేసినా నెలకు వెయ్యి రూపాయల జీతం ఇస్తారు వెయ్యి రూపాయలతో మేమిద్దరం బ్రతకలేమా? అంది కోపంగా

పోనీ అమ్మా! మీ అమ్మ పిచ్చిది ఏదో తెలియక మాట్లాడింది క్షమించు తల్లీ ఆయన బాదగా అన్నారో కోపంగా అన్నారో అర్థం కాలేదు స్వప్నకు కోపంగా అక్కడ నుంచి లేచి తన గదిలో కెళ్ళింది

జయంతీ! పిలిచారు

జయంతి ఏం మాట్లాడకుండా లేచి తమ బెడ్ రూములో కొచ్చి పడుకుంది ఆమె వెనుకనే వచ్చిన మాధవరావు గారు ఆమె పక్కన కూర్చుని నేను కసురు కున్నందుకు కోపం వచ్చిందా? అన్నారు

లేదండీ! మీ రెందుకు కసురుకున్నారో నాకు తెలియదా?

స్వప్న ఒక విదమయిన పిచ్చిలో భర్తే లోకంగా బ్రతుకుతుంది జయరాం చేస్తున్న మోసం దానికి తెలిస్తే దాని గుండె ఆగిపోతుంది కోపంలో నువ్వెక్కడ ఆ మాట జారతావో అని అలా కసురుకున్నాను

న కు తెల్సు బాదగా కళ్ళు తుడుచుకుంది జయంతి

స్వప్న చిన్నపిల్ల దాని మాటలకు బాదపడుతున్నావా? అనునయంగా అన్నారు

దాన్ని మనం ఎంత అపరూపంగా పెంచాం? అది ఈ రోజు మనిద్దర్ని పరాయివాళ్ళను చేసి మాట్లాడింది మనం డబ్బు మనుష్యులం అన్నట్టుగా మాట్లాడింది మా ఆడబడుచు కోసం రెండులక్షలు ఖర్చుపెట్టి పెళ్ళి చెయ్యాలి అంది అలాగే చేసాం మా అత్తగార్కి జబ్బుచేసింది మద్రాస్ తీసుకెళ్ళి ఆపరేషన్ చేయించాలంది మనం కూడా నెలరోజులు మద్రాసులో కాపురం పెట్టి ఆమెకు ట్రీట్ మెంట్ ఇప్పించాం ఇదంతా ఎవరికోసం చేసామండి? దాని కోసమేగా? ఇప్పుడు ఈ ఆస్థి అయినా దాని బవిష్యత్ కోసమేగా దాని పేర రాయించాం ఆ మాత్రం తెలియదా దానికి

జయంతీ! దానికి నువ్వు తల్లివి దాన్ని నువ్వు కడుపులో పెట్టుకోవాలి స్వప్నకు తన భర్తే ప్రపంచం అతను కూడా దాన్ని అలాగే అనుకుంటే దానంత అదృష్ట వంతురాలు లేదని పొంగిపోయేవాళ్ళం పిల్లలు లేరని అది ఎంతో మానసికక్షోబను అనుబవిస్తూ పిచ్చిదానిలా తయారయింది దాని మాటలు పట్టించుకోకు

దానిభర్త దానికెంత అన్యాయం చేస్తున్నాడో తెలియటం లేదు తెలిస్తే నయినా అతన్ని దారిలోకి తెచ్చుకుంటుందేమోనండి

జయంతీ! నీ ఆలోచన బాగానే ఉంది ఆ విషయం తెలిసిన క్షణం అది ఏమవుతుందో ఆలోచించావా?

అలా అనుకుని మనం దానికి తెలియకుండా చేస్తే అతని ఆటలు అలాగే సాగుతాయి

మామిడి కాయలు తీయగా ఉంటాయి వేపకాయలు చేదుగా ఉంటాయి అవి వాటి సహజ లక్షణం మనం మార్చాలని ప్రయత్నించినా వాటి రుచులు మారవు దానికి తెల్సినంత మాత్రాన అతని బుద్ధి మారుతుందనుకోవటం పొరపాటు దాన్ని మరింత క్షోబకు గురిచెయ్యటం తప్ప ఎలాంటి ప్రయోజనం ఉండదు

మనమలా ఊరుకోవటమేనా?

ఊరుకోక చెయ్యగలిగింది ఏముంది?

మనం ఉండగానే ఇలా ఉంది మనం పోయింతర్వాత ఇంకెలా ఉంటుందో నాకూతురు దేనికి ఇబ్బంది పడకూడదు అది ఏదడిగినా నేను కాదనను అంటూ పగలూ రాత్రీ శ్రమించి రూపాయి రూపాయి కూడ బెట్టారు మనం సంపాదించి పెట్టాం అతను జల్సాగా వాళ్ళకూ వీళ్ళకూ ఖర్చు పెడుతున్నాడు

మన ఒక్కగా నొక్క కూతురి బవిష్యత్తే నాశన మయిపోయింది ఇక ఈ ఆస్థి పాస్థులు ఉంటే ఏం? పోతే ఏం? ఆయన ఎంత బాదపడుతున్నారో ఆయన మాటల్ని బట్టే అర్ధమవుతుంది

భర్త బాద చూస్తూ జయంతి ఇంకేం అనలేక పోయింది

రఘునాద్ స్వప్నమూలంగా పెళ్ళి పిల్లలూ ఏమీ లేకుండా వంటరిజీవితాన్ని గడుపుతున్నాడు ఇంత మంది గుండెల్లో తుపాన్ సృష్టించాడు ఆ దుర్మార్గుడు కోపంగా అన్నారు

ఆవేశపడకండి మీ ఆరోగ్యం మంచిది కాదు

మనం ఎంత త్వరగా పోతే అంత మంచిది జయంతీ బాదగా అన్నారు

ఏమండీ! పెద్దగా అరిచింది జయంతి తన కన్నీళ్ళు ఆమెకంట పడకుండా ఆమె వడిలో ముఖం దాచుకున్నారు మాదవరావు గారు

(ఇంకా ఉంది)

# సర్కస్

—నిఖిలేశ్వర్

సూదిమొన మీదైనా
నిలుచునే ప్రయత్నం చేయగలడు మనిషి,
ఏనుగుల్ని స్టూళ్ళపై కూచో బెట్టి
సింహం నోట్లో తలదూర్చి నవ్వగలడు,
—ఇదంతా పొట్టకూటికే కావచ్చు!

మరి రాళ్ళు ఎత్తి
ఈసడింపుల ముందు చెయ్యి చాచి
కష్టార్జితాల జేబులుకొట్టి
పొట్ట కూటికే అలమటించే ఈ వ్యవస్థలో
సూదిమొన మీద
నిజంగానే నిలుచుంటే పరమాద్భుతం!

ఆ క్షణాల్లో అమూల్యమైన ప్రాణాల్ని
తీగెపై గడ్డి పరకల్లా ఆడించడం
నిచ్చెనలపై శరీరాల్ని
ఎండిముద్దలుగా మలచి బ్యాలన్స్ చేయడం
ట్రపేజ్‌పై ఊగే ఉయ్యాలలపై
ప్రతి ఘడియాకాలాన్ని దూరాన్ని
కాళ్ళు చేతులతో ఏకం చేయడం!!

ఆ క్షణం నిరంతరం
మనిషి ఎదుట మనిషి కళాత్మకంగా
కన్నార్పనివ్వకుండా
నోటిమాట రానివ్వకుండా
ఆ పొట్ట కూటి కోసమే
ప్రత్యేక శైలిలో అద్భుతాలు చేయడం
నేలబారు బతుకులకు
ఆ కాస్సేపు ఇచ్చే కొనుగోలు ఆనందం

# వ్యక్తిగతం



జనరల్ కె.ఎం. కరియప్ప జనవరి 15న గౌరవ ఫీల్డ్‌మార్షల్ అయినారు. ఈ గౌరవం ఆయనకి జీవితాంతం ఉంటుంది. ఈయన భారత సైనిక దళానికి, జాతికి చేసిన విశిష్ట సేవలకి గుర్తింపుగా ఈ గౌరవం ఆయనకి లభించింది భారత సైనిక దళానికి కమాండర్ – ఇన్ – చీఫ్‌గా నియమితులైన తొలి భారతీయుడు ఈయన 1949 నించి 1953 వరకూ ఆయన ఆ పదవిని నిర్వహించి స్వాతంత్ర్యానంతరం భారత సైన్యం ప్రపంచంలోని ఉత్తమ సైనిక దళాలలో ఒకటిగా ఉండేలా తీర్చిదిద్దారు భారత సైన్యంలో ఫీల్డ్ మార్షల్ గౌరవాన్ని పొందిన రెండవ వారు ఈయన మొట్టమొదట జనరల్ మనేక్‌షాకి ఈ గౌరవం దక్కింది శ్రీ కరియప్ప 1900 జనవరి 20న మైసూరు సమీపంలోని మెర్కారాలో జన్మించారు అక్కడ సెంట్రల్ హైస్కూల్ మదరాసు ప్రెసిడెన్సీ కళాశాలలలో విద్యాభ్యాసం చేసారు 1919లో ఇండోర్ డాలీ కాలేజి నించి కమిషన్ అయిన తొలి భారతీయ సైనిక బృందంలో

ఈయన ఒకరు 1933లో క్వెట్టా స్టాఫ్ కాలేజిలో ప్రవేశం పొందిన తొలి భారతీయ సైనికాధికారి ఈయన 1939లో డెప్యూటీ అసిస్టెంట్ క్వార్టర్ మాస్టర్ జనరల్‌గా నియమింప బడ్డారు 1941 నించి సంవత్సరంపాటు ఇరాక్ సిరియా ఇస్రాయిల్‌లలో 10వ భారతీయ డివిజన్‌లో పని చేసారు 1942లో రాజ్‌పుట్ రెజిమెంట్ మెషీన్‌గన్ దళానికి అధిపతి అయిన తొలి భారతీయుడు ఈయన 1945లో సైనిక దళాల పునర్ వ్యవస్థీకరణ సంఘం సభ్యుడిగా బ్రిగేడియర్ హోదాలో నియమితులైనారియన అమెరికా సంయుక్త రాష్ట్రాలు కెనడాలలో పర్యటించి ఆ దేశంలోని అత్యున్నతాధికారులతో చర్చలు జరిపి తమ నివేదికని సమర్పించారు యు కె లోని ఇంపీరియల్ డిఫెన్స్ కాలేజికి పంపబడిన ఇద్దరు భారతీయులలో శ్రీ కరియప్ప ఒకరు సైనిక దళాల పునర్ నిర్మాణానికి ఏర్పడిన సైనిక ఉప సంఘంలో సభ్యుడిగా పని చేసారు 1947 జూలైలో ఆయన మేజర్ జనరల్ పదవిని అదే సంవత్సరం నవంబరులో సాధారణ సైనిక దళాల ప్రధానాధికారి పదవిని అలంకరించారు □

# వారఫలం

## 7-2-1986 శుక్రవారం మొదలు 13-2-1986 గురువారం వరకు

★ **మేషం :** దైవారాధనకు, పుణ్య కార్యాచరణమునకు వారం అనుకూలం. సుప్రసిద్ధుల సహాయాన్ని అందుకోగలరు. వారంవ్యాపారలోపాన్ని సమర్థించుకోగలరు. ఏమయినా కృషిలోపం కనిపించనీయరాదు. అనుకూలకాలమందు బాగా కృషి చేయాలి. స్త్రీలకు : ధన లబ్ధి, ఉద్యోగాభివృద్ధి

★ **వృషభం** అధికారులచుట్టూ తిరిగి తిరిగి ప్రయోజనంలేదు కృషి లోపం లేకుంటే అంతా సుముఖమే ఒకరు సాయం చేయవలసిన అగత్యముండదు ఆరోగ్య లోపం ఏర్పడుతుందేమో జాగ్రత్తగా గమనించి మెలగాలి స్థితియందు కూడా కొంత లోపం ఏర్పడవచ్చు గ్రహించాలి స్త్రీలకు మాట చెలామణి కావటం ఉద్యోగంలో అనుకూలత చేకూరగలదు

★ **మిధునం** శుభకాలం మీ ప్రయత్నాలు అన్ని రంగాలలో సుకరంగా నెరవేరగలవు మీరు పట్టినదంతా బంగారమే వ్యాపారం బాహాటంగా చేసి అధిక లాభాపేక్షకుపోక ఉన్నంతలో తృప్తిపడటం వలన సర్వం అనుకూలంగా నెరవేరగలదు స్త్రీలకు మనోవాంఛాసిద్ధి ఉద్యోగమందు పెంపు చేకూరగల వారంగా గ్రహించాలి

★ **కర్కాటకం** దూరపు ప్రయాణాలు మానుకొనుట ఎంతైనా శ్రేయం విరోధి వర్గమున్నది జాగ్రత్తగా మెలగండి వెనుక చేసిన అప్పుల బాధ ఈవారం వెంటబడుతుంది కృషి లోపం చేయకండి నిజాయతి గుర్తించేలాగు మెల్గగటం అలవరచుకోండి స్త్రీలకు : సుఖశాంతులకు స్వల్పాదాయానికి అనుకూలమే గ్రహించాలి

★ **సింహం** అనుకోకుండా దూరాన్నుండి బంధువులో మిత్రులో యింటికి రాగలరు తలవనితలంపుగా ధన వత్తిడి ఏర్పడగలదు మాటకు విలువ తగ్గటం అనుకొన్న రీతిగా డబ్బు అందకపోవటం వ్యాపారాన లేనిపోని యిబ్బందులు తటస్థించటం గ్రహింపగలరు స్త్రీలకు వృత్తియందు ఆటంకాలు ధనలోపం చేకూరుతుంది

★ **కన్య** పరాయివారి పెత్తనాన్ని సుతరామూ మీరు ఒప్పుకోరు పరులకివ్వవలసిన ధన వత్తిడి తట్టుకొనుట కష్టంగా భావిస్తారు పనులుకాక యిబ్బంది పడుతారు ఎంత ఓర్మితో సంచరిస్తే అంత మేలు స్త్రీలకు కొందరకు ఆరోగ్య లోపం కొందరకు వృత్తియందు ఆటంకాలు సంభవం అందులకుతోడు అధిక వ్యయం

★ **తుల :** మీ దారికి ఎవరు అడ్డు వచ్చినా ఓర్చలేని ప్రకృతిమీది. హోదా చెలాయించాలని రాత్రింబవళ్ళు మీకు ఉబలాట. గ్రామాన పేరు పెంపులు రావాలని తాపత్రయం. కాలం అనుకూలంగాదు. జాగ్రత్తగా మెలగి రానున్న ఆపద నుండి తప్పించుకోవాలి. స్త్రీలకు : ప్రశాంత సమయంగాదు.

★ **వృశ్చికం** ఎంతో కృషి చేస్తేనేగాని వ్యాపారమందు వృత్తియందు మేలు కనిపించదు ఎంతో ఆసక్తిచూపితేనేగాని కార్యాలు సుకరంగా నెరవేరవు రాజకీయంగా ఏమాత్రం మేలుగాదు అనవసరమైన వ్యవహారాలు నెత్తికి రాగలవు గ్రహించండి స్త్రీలకు ఉద్యోగరీత్యా పొరపాట్లు జరుగకుండా చూసుకోవాలి

★ **ధనుస్సు** నూతన వ్యక్తుల పరిచయం ఏర్పడుతుంది లలిత కళలందు నేర్పరులకు, చిత్ర నిర్మాతలకు ఈ రాశికి చెందిన దర్శకులకు కార్మిక వర్గానికి రచయిత్రులకు మేలైన వారం ఆదాయమున్నది సదవకాశాలు లభ్యం కాగలవు స్త్రీలకు శుభ వ్యయం కొందరకు నూతనోద్యోగలబ్ధి

★ **మకరం** కృషి లోపం లేకుంటే అన్ని విధాలా బాగా పుంజుకొంటారు గ్రహానుకూల్యత గల వారం స్థితిగతులు మెరుగవుతాయి ఆశించినట్లు కార్యానుకూలత చేకూరుతుంది మొండికెత్తిన వ్యవహారం సొంతం సానుకూలం కాగలదు స్త్రీలకు శక్తివంచన లేకుండా కృషిచేస్తే వృత్తియందు పెంపు కనిపిస్తుంది

★ **కుంభం** ముఖ్య బంధువులతో విభేదాలు రాకుండా చూచుకోవాలి ఏదో శుభ ప్రస్తావనలందు మాట మాట పట్టింపులు రావచ్చు కుటుంబ సభ్యులకు వ్యతిరేకంగా ఒకానొక విషయంలో సంచరించవలసివస్తుంది గ్రహించి మెలగండి స్త్రీలకు మాటకు అడ్డు వచ్చే వారుంటారు వృత్తియందు కూడా ఆటంకం రావచ్చు గ్రహించండి

★ **మీనం** స్వయంగా మీకు యిబ్బంది కలుగదుగాని చుట్టుపట్ల వ్యవహారాలు తలనొప్పి పుట్టిస్తాయి వ్యతిరేక శక్తులు తలలెత్తగల సమయం అనుకూలగ్రహస్థితిగల సమయం గాదని గ్రహించాలి స్థితియందు పెంపుకై చేసేయత్నాలు ఫలింపవు అలాగని ఊరుకోరాదు స్త్రీలకు : ఉద్యోగమందు హాయి పెంపు ఆనందాలు

–విద్వాన్ కోట సత్య రంగయ్యశాస్త్రి

# ఆదర్శం అనుభవమైన వేళ.....

శ్రీమతి పి. నిర్మలాచర్చిల్

ఆఫీసులో ఫైల్లో తల దూర్చి కూర్చుందన్న మాటేగాని ఒక్క అక్షరం అయినా బుఱ్ఱకెక్కించుకోలేక పోతుంది ఉష గంటన్నర క్రితం ఆఫీసుకి బయలుదేరి వస్తుంటే యింటి దగ్గఱ తల్లి చెప్పిన మాటలే పదే పదే గుర్తొస్తున్నయ్ రేపు తనను చూచేందుకు ఎవరో పెళ్ళివారొస్తున్నారు కనుక సెలవు పెట్టి వెళ్ళాలట ఉషకు పెళ్ళి చూపులంటేనే కంపరమెత్తుతుంది

*　　*　　*　　*　　*　　*

ఒక్కసారి తలెత్తి చూసింది తోటి వాళ్ళంతా ఎవరి పని వాళ్ళు చేసుకుపోతున్నారు తన సీటుకి రెండు సీట్ల అవతల వున్న సుమిత్రాదేవి తప్ప ఆ విశాలమైన హాల్‌లో వున్న అందరూ పురుషులే సభ్య సమాజంలో బాధ్యత కలిగిన ఉద్యోగులుగా మెలిగే వీళ్ళంతా పెళ్ళి చూపుల పేరుతో తనలాంటి ఎంత మంది యువతుల్ని మానసికంగా హింసించారో మూడు సంవత్సరాల క్రితం తనకు జరిగిన మొదటి పెండ్లి చూపులు గుర్తొచ్చాయి ఉషకు పెండ్లి చూపులనగానే గబగబా ఎన్నో కలలు కనేసిన తన అమాయకత్వాన్ని కాదు కాదు ఫూలిష్‌నెస్‌ని తలంచుకుంటే ఇప్పటికి తన మీద తనకే అసహ్యమేస్తుంది తనది కన్ను చెదిరిపోయేంత అందం కాకపోవచ్చు అయినా తాను అందంగానే వుంటుంది బి కాం డిగ్రీ వుంది కనుక ఆ వచ్చినతనికి తాను నచ్చి తీరుతుందిలే అనుకుంది యూనివర్సిటీలో చదివినవాడు అంతో యింతో అందంగా వున్నవాడు చిన్న ఆఫీసర్‌గా వెలిగిపోతున్నవాడూ అయిన అతనికి తాను నచ్చాలని మనసారా కోరుకుంది చివరికి పెండ్లి చూపులప్పుడు అతను తనతో ఒంటరిగా మాట్లాడాలని నాన్నను అనుమతి అడగటం ఆ విషయం నాన్న తనతో చెప్పిడాబా మీద ఏకాంతం కల్పించటం అబద్ధమేం కాదు అప్పుడు ఏవో కొన్ని మాటల తర్వాత చివరగా అతనన్న దేమిటో తనకింకా గుర్తే

మిస్ ఉషా! ఒక మనిషికి మరో మనిషినచ్చటం నచ్చకపోవటం అనేది నిర్ణయించుకొటానికి పెండ్లి చూపుల సమయం ఎలా సరిపోతుందా అనుకొనే వాడ్ని ఇప్పుడనిపిస్తుంది ఆ సమయం చాలా ఎక్కువేమో అని ఎందుకంటే మీరు నాకు మొదటి చూపులోనే నచ్చారు నేనూ మీకు నచ్చి వుంటానని యివిగో ఈ ఎఱుపెక్కిన బుగ్గలు వాలిపోయే కనురెప్పలు చెప్పేస్తున్నయ్ ఔనా?! సరే యింక మిగిన విషయాలు మన పెద్దవాళ్ళు మాట్లాడుకుంటారు సీయూ అంటూ గబగబా మెట్లు దిగి వెళ్ళిపోయాడు

ఒంటరిగా మిగిలిపోయిన తనకు ఆనందంతో మైమరపు కలిగింది మంద్ర స్వరాన అతనన్న మాటలు తన మనసులో మల్లెలను పూయించినయ్ చెప్పనలవి కాని ఉద్విగ్నతతో తడబడే అడుగులతో మెట్లు దిగి వచ్చింది తను అప్పటికే పెండ్లివారు వెళ్ళిపోయారు పెండ్లి



కొడుకుగా వచ్చిన అతని రూపం మాటలు తన మనసుకు పులకింత లను కలిగిస్తూనే వున్నాయ్ స్వప్న జగత్తులో తన మనస్సు విహరిస్తూనే వుంది ప్రక్కింటి ఆంటీతో అమ్మ

పెండ్లి చూపుల వరకూ బాగానే జరిగాయనుకోండి ఆ తర్వాతేగా అసలు సమస్య మేమివ్వగల కట్న కానుకలు కూడా వాళ్ళకు నచ్చి- ముహూర్తాలు పెట్టుకున్ననాడుగదా మనం నిజంగా సంతోషించాల్సింది అని అనటం తాను వింది ఆ మాట- తన మనసుకెక్కడో చురక వేసినట్లయింది అయినా తనను తాను సమర్థించుకుంది కట్నం ప్రమేయం లేకుండా వాళ్ళ తల్లి దండ్రులను ఒప్పించి అతడు తననే చేసుకుంటాడు అనే నమ్మకం తనలో ఎందుకు అంతగా ఏర్పడిందో తెలియదు మూడవ రోజు నాన్నగారికి కబురొచ్చింది- పెండ్లి వారు మాట్లాడుకోటానికి రమ్మంటున్నారూ అని ఇంక మిగిలిన విషయాలు పెద్ద వాళ్ళు మాట్లాడుకుంటారు అని తనతో అతనన్న మాటలనుబట్టి బహుశః ముహూర్తాలు పెట్టుకోటానికే పిలిపించారనుకుంది తను కాని సాయంత్రానికి దిగులుగా తిరిగి వచ్చిన నాన్న అమ్మతో చెబుతున్న మాటలను వింటుంటే తన కాళ్ళ క్రింద భూమి కదలిపోయినట్లే అనిపించింది

ఏం చెప్పమంటావ్ లక్ష్మి ఎంత కట్నం యివ్వగలరు? అని అడిగారు పాతిక వేల వరకు యివ్వగలమని చెప్పాను యాభై వేలకు పైసా తగ్గినా యీ సంబంధం అక్కర్లేదు అన్నారు నా ఉద్యోగం బాంక్‌లో వున్న యిరవై వేల చిల్లర నీ మెడలో వున్న బంగారం- అంతా గుర్తు చేసుకొని ముప్పైయైదు వేలిస్తానన్నాను అమ్మాయి ఉద్యోగం చేస్తోందిగదాని గుర్తు చేసాను లాభం లేకపోయింది ఆ ఆలుమగలిద్దరిది ఒక్కటే మాట ఆ అబ్బాయి కూడా పేపర్‌లో మొహం దూర్చి అంతా వింటూనే వున్నాడు నేనే ఆశ చావక అబ్బాయి అభిప్రాయం కూడా అదేనా!? అని అడిగాను

# ఆదర్శం అనుభవమైన వేళ....

"ఆలోచించుకోండి మీ అమ్మాయేగా సుఖపడేది అన్నాడు ఆ క్షణంలో పోనీ యీ యిల్లమ్మి వాళ్ళు కోరిన కట్నం యిచ్చి చేస్తేనో అనిపించింది కానీ యింకో ఐదారేళ్ళలో రిటైరవ్వబోయే నేను యింకా కాలేజీ చదువులదాకానైనా రాని మగపిల్లలిద్దరికి ఏదొక దిక్కు చూపించాలి గదా'అందుకే అంత సాహసం చెయ్యలేక చేతులు జోడించి లేచొచ్చాను అమ్మాయి మనసెంత బాధపడుతుందో తెలిసీ నేనేం చెయ్యలేకపోయాను ఈ దేశంలో ఆడ పిల్లకు తండ్రిగా పుట్టటం ఎంత దౌర్భాగ్యం? జరిగిన విషయం తల్లివి- నువ్వే ఎలాగో అమ్మాయికి చెప్పు అంత కట్నం ఖచ్చితంగా కావాలి అంటున్న వాళ్ళను రాక్షసులనుకోవాలో యివ్వలేకపోతున్న మనల్ని అసమర్థులనుకోవాలో తెలియటం లేదు హుం మనింట్లో జరుగబోయే మొదటి ప్రయత్నం మొదటి శుభ కార్యం అని సంబర పడినంతసేపు పట్టలేదు అమ్మ ఏదేదో అంటూ బాధపడటం తనకు వినిపిస్తూనే వుంది తాను తలుపు దగ్గర్నుండి మంచం దగ్గఱకి ఎలా వచ్చిందో తెలియదు ఎంతో సేపు అలాగే పడుకుండి- పోయింది ఆశాభంగపు ఆవిరులు ద్రవీభవించి వెచ్చని కన్నీరుగా ఎడ తెరిపి లేకుండా తన కన్నుల నుండి కారుతూనే వున్నయ్ ఎంతోసేపటికి స్తబ్ధుగా మారిన మనసుతో ఆలోచించటం ప్రారంభించింది కలలు వెరు-జీవితం వెరు ఎదైనా తన దాకా వస్తేగాని తెలియదంటారు వరకట్నంయొక్క స్వరూప స్వభావాలు- ఒక్క మాటలో దాని విశ్వ-రూపం యీ క్షణాన తనకు ప్రత్యక్షమై తనను చూచి వెకిలిగా నవ్వుతున్నట్లనిపించింది అంతే కాదు తనను చు చి నవ్వే ఆ రాక్షసి చుట్టూ చేరి మరింత వెకిలిగా బజనలు చేస్తున్న ఆ వికృత రూపులెవరు? ఆఁ వాళ్ళు వాళ్ళే- పెండ్లి కొడుకు అతని తల్లి తండ్రి మనసంతా అసహ్య బావన కలిగింది లేచి అద్దంలో తన మొహం చూసుకుంది కళ్ళు వాచి వడలిపోయి వున్న యీ ముఖం తనదేనా? ఛీ ఛీ ఒక కీలు బొమ్మ కోసం తనను తాను బాధ పెట్టుకుంటుందా? ఎంత మూర్ఖత్వం తాను యిక ఎంత మాత్రం బాధపడగూడదు తనకేమీ తెలియదనుకొని ఎలా తెలియచేయాలో తెలియక వాళ్ళల్లో వాళ్ళే కుమిలిపోతున్న తల్లి దండ్రులకు తానే ధైర్యం చెప్పాలి ఔను ఈ యింటి పెద్ద బిడ్డగా యిప్పటి వరకూవాళ్ళ మమతాను రాగాలతో ఏ లోటూ లేకుండా పెరిగిన తన ప్రదమ కర్తవ్యం అది అంతే మరు క్షణంలోనే బాత్ రూంలో కెళ్ళిపోయి చలిగావున్నా లెక్క చెయ్యకుండా తలారా స్నానం చేసింది అప్పుడే దీక్ష పూనినట్టుగా మనసులోనే అనుకుంది తను' ఓ కట్నమా నేను పెళ్ళంటూ చేసుకుంటే నా కాపురానికి నాకు అండగా నిన్ను మాత్రం రానివ్వను నిన్ను కాదని నాకు అండగా నిలువగలిగిన వాడే నా భర్త అని

ఆ రాత్రి భోజనాల సమయంలో పెద్ద తమ్ముడు నాన్నా అక్కయ్య పెళ్ళికి వీడికి జీన్ పాంట్ కావాలట అన్నాడు- చిన్న తమ్ముణ్ని చూపిస్తూ తను తలెత్తి తండ్రి మొహంలోకి చూసింది ఆయన ఎంతో కృంగిపోయినట్టుగా తల వంచుకొని అన్నంకెలుకుతున్నారు

నాన్నా మీరు ఏదో తప్పు చేసినట్టు బాధపడతారెందుకు? మనం బాదంటూ పడితే వాళ్ళు డబ్బుకు మాత్రమే విలువ యిచ్చే అల్ప మనస్కులని తెలియక అన్నేసి మర్యాదలు చేసి పంపామే అందుకు బాధ పడాలి ఇంక నా విషయం అంటారా? అతనిని నేను యిష్ట పడిన మాట నిజమే అయినా అతని వికృతమైన అంతరంగం గురించి తెలిశాక కూడా అతనే కావాలి అనుకొనేంత మూడురాలిని కాదు కానీ నాన్నా!

నాదొక్క కోరిక ఇక ముందు కట్నం కావాలనే పెండ్లి కొడుకుల ముందుకి దయచేసి నన్ను వెళ్ళమనకండి పెండ్లి కాకుండా జీవితమంతా గడపాలన్నా నాకు బాధనిపించదు కానీ నాకు కాకుండానే తీసికెళ్ళే కట్నానికి విలువిచ్చే వారితో విలువైన నా జీవితాన్ని పంచుకోవాలంటే మాత్రం నా మనస్సంగికరించదు అని చెప్పి తను గబగబా భోజనం ముగించి వెళ్ళిపోవటం తన వెనుకే అమ్మ అయ్యయ్యో ఇవేం భీష్మ ప్రతిజ్ఞలండి? కట్నాలిచ్చి ఎంత మంది పెళ్ళిళ్ళు చేసుకోటం లేదు అందరు ఆడ పిల్లలూ యిలాగే అనుకుంటే ఇంక అసలు పెళ్ళిళ్ళౌతాయా? మీరైనా ఏం మాట్లాడరేం? అని అనటం దానికి తండ్రి లక్ష్మి నువ్వూరికే హైరానా పడకు అమ్మాయి అన్న మాటల్లో తప్పేముంది? అభిమానవతియైన ఏ ఆడపిల్ల అయినా యిలాగే మాట్లాడుతుంది ఏది ఎలా జరగాలో కాలమే నిర్ణయిస్తుంది నువ్వేం గొడవ చెయ్యకు అంటూ నచ్చ చెప్పటం విన్న తర్వాతగాని తన మనసుకు శాంతి కలుగలేదు

నాప్రాక్టీస్ యిక్కడ పెట్టినప్పటినుండి బాగా యింప్రూవ్ అయ్యిందిరా!!

దంతవైద్యశాల
పళ్ళు అందముగా కట్టబడును

ఉమెన్స్ కాలేజీ

## తోటివారికి పొదుపును నేర్పడం కూడా సమాజసేవలో ఓ భాగమే దాన్ని మహిళా మండలి కార్యక్రమాలలో చేర్చండి.




## మహిళా మండలి సభ్యులు ఇప్పుడు జాతీయ పొదుపు సంస్థ ఏజంట్లుగాచేరి ఆకర్షణీయమైన కమిషన్ సంపాదించవచ్చు.

మహిళలకోసం జాతీయ పొదుపు సంస్థ ప్రత్యేకంగా రూపొందించిన మహిళాప్రదాన్ క్షేత్రీయ బచత్ యోజన'లో ఏ మహిళ అయినా సరే వ్యక్తిగతంగా గాని, తమ మహిళా మండలి పరంగా గాని చేరవచ్చు

తోటివారిని ఒప్పించి పొదుపు చేయించగలగడమే దానికి కావలసిన కనీస అర్హత మహిళా ప్రధాన్‌లకు ఆకర్షణీయమైన 4% కమిషన్ లబిస్తుంది మహిళామండలి సమాజం తరఫున ఈ ఏజన్సీ తీసుకుంటే మీరు సంపాదించిన కమిషన్‌కు సమానమైన మొత్తాన్ని మీ సంస్థకు ప్రోత్సాహకరంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మంజూరు చేస్తుంది

ఎక్కువ శ్రమ లేకుండా పొదుపు చేయించే రెండు పథకాలు

- 5 సం.ల రికరింగ్ డిపాజిట్ పథకం
- 10 సం.ల క్యుములేటివ్ టైమ్ డిపాజిట్ పథకం

ఈ స్కీము క్రిందకు వస్తాయి

దరఖాస్తుఫారాలు మీ జిల్లా కేంద్రంలో ఉండే జిల్లా సేవింగ్స్ అదికారులవద్ద నుండి పొందండి



**కమిషనర్, స్మాల్ సేవింగ్స్,**
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము
హిమయత్ నగర్
హైదరాబాదు 500 029



## జాతీయ పొదుపు సంస్థ

మీ భద్రతే మా లక్ష్యం

TARA/CSS/6/8586

మూడు సంవత్సరాల యీ సుదీర్ఘ కాలంలో తన కోసం అని వచ్చిన సంబంధాలే తక్కువ ఒకరిద్దరికి తాను నచ్చినా కట్నం కావాలని పరోక్షంగా వెలిబుచ్చటంతో తనే నిర్మోహమాటంగా తిరస్కరించింది అప్పుడు అమ్మ ఎంత గొడవ చేసింది?

ఒక్కగానొక్క ఆడఎల్లకు పెళ్ళి చేయలేని అసమర్ధులని లోకం మమ్మల్ననుకోవటం నీకు యిష్టంగా వుందా? అంటూ పరుషంగా మాట్లాడింది అమ్మ బాద వేఱు మిగిలిన వాళ్ళొ!? పిన్ని కూతురు సరళ ఇంచుమించు తన వయసుదే ఏదో సందర్భంలో తాను లేదనుకొని ఎవరితోనో

ఉష తనంత అందగత్తె లేదనుకుంటుందో ఏమో! కట్నం అడిగిన వాడిని పెళ్ళి చేసుకోను అంటుందట ఇంక వృద్ధ కన్యగా మిగిలిపోతుందనుకుంటా అనటం విని కూడా ఉవ్వెత్తున లేచిన కోపాన్ని నిగ్రహించుకొని మౌనంగా ఇవతలికి వచ్చేసింది తమ బంధువుల్లో తనను గురించి వింతగా చెప్పుకుంటున్నారని అమ్మ తన దగ్గఱ మొత్తుకుంటూనే వుంది నాన్న మాత్రం తన మనసు నొప్పించలేక తనలో తనే మదనపడుతుంటారు

ఉషకు ఆపీసుకు వచ్చే ముందు తల్లి తనతో చెప్పిన మాటలే గుర్తొస్తున్నయ్ రేపు పెండ్లి చూపులకు రాబోయే అతను యీవూర్లోనే ఏ.డబ్ల్యు.డి.లో అసిస్టెంట్ ఇంజనీరుగా చేస్తున్నాడట. పేరు మురళీకృష్ణ. కట్నం

# ఆదర్శం అనుభవమైన వేళ....

ప్రమేయం లేకుండా అమ్మాయి నచ్చితే చేసుకుంటాడట ఆశ్చర్యంగా వుంది ఎందుకంటే ఓ యింజనీరు ఓ లక్షరూపాయలైనా కావాలనే రోజులు అమ్మ ఎంతో సంతోషంగా వుంది ఈ సంబంధం కుదిరిపోతుందన్న నమ్మకంతో ఎందుకైనా మంచిదని తను ముందే హెచ్చరించింది యీ సంబంధం కూడా తప్పిపోతే మాత్రం బాదపడకూడదని తనేం చెయ్యాలి?

మిస్ ఉషా! మీ మనసిక్కడ లేదు యామై కరెక్ట్? నవ్వుతూ అడిగిన కొలీగ్ మాటలకు ఉష చిరునవ్వే సమాదానమైంది

అంతలోనే మెరుపులాంటి ఆలోచన ఔను అలాగే చెయ్యాలి లేకపోతే రేపు జరుగబో ఆశాభంగాన్ని అమ్మ తట్టుకోలేదు అలా అనుకున్న వెంటనే లీవ్ నోట్ వ్రాసి ఆఫీసరు గదిలోకి వెళ్ళిపోయింది మరు నిముషంలో హ్యాండ్ బ్యాగ్ తీసుకుని గబగబా బయటకు వెళ్ళిపోతున్న ఉష వైఖరి మిగిలిన వారికి అర్థంకాలేదు

* * * * * *

పి డబ్ల్యు డి అఫీసు అవరణలో ఒక ప్రక్కగా చెట్టు క్రింద నిలబడి వుంది ఉష అంతలో హుందాగా ఆఫీసులో నుండి బయటకు వచ్చి తనను చూచి ఆశ్చర్యంగా దగ్గఱకు వస్తున్న అతనే మురళీకృష్ణ కావచ్చు అనుకుంది తాను రెండడుగులు ముందుకు వేసి నమస్తే మురళీకృష్ణ మీర కదూ! రేపు మీరు విశ్వపతిగారమ్మాయిని చూడ్డానికి వెళుతున్నారని తెలిసింది నేనే ఆ ఉషని మీతో ఒక్క మాట చెప్పి పోదామని వచ్చాను

అతని ముహంలో కొంత ఆశ్చర్యం దాన్ని కనబడనివ్వకుండా చెప్పండి అభ్యంతర మేముంది? అన్నాడు

ఎం లేదు మీరు కాని మీవాళ్ళుగాని కట్న కానుకలు ఆసించే వారైతే మాత్రం దయచేసి మ యింటికి రావొద్దు అలాంటి వారితో జీవితాన్ని ముడి పెట్టుకోవటం అనేది నాకు సాద్యం కాని పని చివరకు యీ సంబంధం కూడా కుదరలేదే అనే వ్యద మాత్రమే మిగులుతుంది నా తల్లిదండ్రులకు నా అభిప్రాయాలను మార్చుకోలేక మా వాళ్ళను నొప్పించలేక యిలా మీ అడ్రస్ వెతుక్కుంటూ వచ్చాను మీకేమైనా బాద కలిగితే క్షమించండి అంటూ వెనక్కి తిరిగింది

మిస్ ఉషా! అంత తొందరెందుకు? మీరెందుకు వచ్చింది చెప్పారు మరి నన్ను మాట్లాడనివ్వండి ఐతే యిక్కడ కాదు ఆగండి ఒక్క నిముషంలో వస్తా అంటూ లోఎలకు దూసుకు వెళ్లాడు

ఆలోచనలో పడింది ఉష తనేంటి యిలా వచ్చింది? అతనేం చెబుతాడు తనతో?! ఏమో భయపడవలసిందేముంది? చూద్దాం అనుకొనేంతలోనే చిన్న బ్రీఫ్‌కేస్‌తో మొదటిసారికంటే

ఉత్సాహంగా బయటకు వచ్చేశాడతను రోడ్డు మిదకొచ్చి ఆటో పిలుస్తూనే ప్లీజ్ కమ్ అన్నాడు ఉషతో

* * * * * *

ఆ పెద్ద హొటలు ముందు ఆటో ఆగటంతోనే డబ్బులిచ్చేసి ఓ పది నిముషాలు మీతో మాట్లాడి పంపిస్తాను అభ్యంతరం లేదు కదూ! రండి అంటూ లోపలికి నడిచాడు ఓ మూలనున్న ఫ్యామిలీ రూంలోకి నడిచి బేరర్‌తో రెండు కాఫీలు చెప్పి ఉష వంక నిశితంగా చూశాడు

ఇప్పుడు చెప్పండి కట్నం కోరే మగవాడిని మీరిష్టపడరు ఔనా?!

చివ్వున తలెత్తి చూచింది ఉష

నేను మీకు మీ ఆఫీసు దగ్గఱ చెప్పిన విషయం అదే కదా! కొంచెం కోపంగానే అంది

ఐతే వినండి కట్నం తీసుకొస్తాను అనే ఆడపిల్లను నేనిష్టపడను

కనులు విప్పార్చుకొని అతన్నే చూస్తుంది ఉష అతనింకా చెబుతూనే వున్నాడు

ఔను నా దృష్టిలో నా జీవితం చాలా విలువైనది ఆ జీవితాన్ని పంచుకోవటానికి నా యింటికి వచ్చే యిల్లాలు నాకంటే విలువైనది అటువంటప్పుడు యింకా ఆమె నాకు నష్టపరిహారంలా కట్నం యివ్వటమేమిటి? అసలు సృష్టిలో మమతకు వెలగట్టగలిగిన వారెవరు చెప్పండి నాకు డబ్బు కంటే నన్నర్థం చేసుకొనే మనిషి ఆమె మనసులో నాపట్ల వుండే మమత ముఖ్యం ఇంకో మాట నా బార్య నాతోపాటు కష్టపడి ఉద్యోగం చెయ్యటం నాకిష్టం లేదు ఆ కష్టమేదో నేనే పడతాను ఆమె నా యింటి యిల్లాలుగా నా సహధర్మచారిణిగా నా పిల్లలకు తల్లిగా తన బాధ్యతను సక్రమంగా నెరవేరిస్తే చాలు నా తల్లి దండ్రులు కూడా నా అభిప్రాయాలకు పూర్తి విలువనిస్తారు మీ గురించి కూడా విని వున్నారు కనుకనే మనకు పెండ్లి చూపులు ఏర్పాటు చేశారు మీకిష్టమైతే నేను వాళ్ళతో కలిసి రేపు మీ యింటికి వస్తాను ఇప్పుడు చెప్పండి రమ్మంటారా? వద్దంటారా?

తన చెవులను తనే నమ్మలేకపోతుంది ఉష తన కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అడుగుతున్న అతని నుండి దృష్టి మరల్చుకొని తల వంచుకొని

మీకెలా చెప్పాలో నాకు తెలియటం లేదు మీ మాటలు నా మనసు మీద పన్నీరు చిలకరిస్తున్నాయి రేపటి కోసం యిప్పటి నుండే ఎదురు చూస్తున్నా అంటూ లేచి నిలబడింది

అరెరె అంత తొందరెందుకు? ఒకసారి మీ ముఖం చూడనివ్వండి నవ్వుతూ అంటున్న అతనికి రెండు చేతులను నుదుటిపైపెట్టి నమస్కరిస్తూ

నన్ను వెళ్ళనివ్వండి ప్లీజ్ అంది

ఆమె కళ్ళల్లో నిండిన ఆనందబాష్పాలను చూస్తూ చిరు నవ్వుతో అనుసరించాడతను

* * * * * *

ఇరు వైపుల పెద్దలూ కలిసి సంతోషంగా చేసిన పెండ్లి అది అది ఆ జంటకు లభించిన మొదటి [illegible] తలుపుకు గడియపెట్టి వెనుదిరిగి చూచిన మురళీకృష్ణకు కిటికి దగ్గఱ నిలబడి పరధ్యానంగా బయటకు చూస్తున్న ఉష కన్పించింది బయట పిండారబోసినట్లున్న వెన్నెలతో కొబ్బరి చెట్ల నీడలు దోబూచులాడుతున్నాయి తన రాకను కూడా గమనించలేనంత పరధ్యానంలో ఉన్న ఆమెను మెల్లగా సమీపించి ఉషా! అంటూ భుజం మీద చెయ్యేశాడు ఉలికిపాటుతో తల తిప్పి చూచిన ఆమె రెండు కనుల నిండా నీరు

ఉషా! ఏమైంది? ప్లీజ్ చెప్పవూ?! అంటూ ఆమెను తన వైపు తిప్పుకున్నాడు

మురళీ! మీరు నా జీవితంలో మొట్టమొదటి పెండ్లి కొడుకుగానెందుకు రాలేదు? ఈ మూడేళ్ళు నేనెంత నరకం అనుభవించానో తలచుకుంటే మన పెండ్లి కలేనేమో అన్పిస్తుంది అంటూ అతని ఎదపైతల వాల్చి వెక్కి వెక్కి ఏడ్చింది

నిశ్చేష్టుడైన మురళి మరు క్షణంలో తేరుకొని ఆమెను దగ్గఱకు పొదువుకుంటూ పిచ్చి గతాన్ని గురించి బాద పడుతున్నావా? నేనుండగా నువ్వింక దేనికి దుఃఖపడవలసిన అవసరం లేదు ఒక్క మాట చెప్పనా?! త్వరగా ఓ బాబును కనేసి వాణ్ణి మన కంటే ఉన్నతంగా పెంచేద్దాం అప్పుడు మన కోడల్ని కూడా కట్నం తీసుకోకుండా తెచ్చుకుందాం సరేనా?! నవ్వుతూ అడిగాడు

ఔను నా బాబు వాళ్ళ నాన్నగారికంటే గొప్పవాడౌతాడు ఆయనలాగే ఏ కన్నె హృదయంలోనూ చిచ్చు రగిలించడు ఆవేశంగా అనేసింది ఉష

వెరి గుడ్ మరి బాబెప్పుడు పుడతాడంట? కాస్తంత అమాయకంగా కాస్తంత చిలిపిగా అడిగిన మురళీకృష్ణ మాటలకు సిగ్గుతో రెండు చేతుల్లో మొహం దాచుకుంది ఉష అపురూపంగా ఆమెను పాన్పు దగ్గఱకి నడిపించుకొని వెళుతున్న ఆ యువకుని ఔన్నత్యానికి పరవశించిన ఓ పిల్ల తెమ్మెర- ఆ జంటను మృదువుగా తాకి తన సంతోషాన్ని తెలియజేసింది □

# ఇ·వేమన·పద్యాలు




పతిని దిట్టరాదు పదివేలకైనను
పెట్టి చెప్పరాదు పెద్దకైన
పతి దిట్టరాదు సతి మానవతియైన
విశ్వదాభిరామ వినురవేమ

### పళ్లరసం పళ్లకు నీరసం



# పళ్లరసాలా? బాబోయ్ వద్దు!!

డా. కె.ఎల్.వి.ప్రసాద్

అతిదులు ఎవరైనా వస్తే సాదారణంగా మన యిళ్లల్లో కాపినో టీనో లేకుంటే పాలో మజ్జిగో యిస్తుంటాం అలా కాకుండా కాస్త అత్యాదునికన గరికతకు అలవాటుపడ్డ వాళ్లయితే కూల్‌డ్రింకులు పళ్ల రసాలు సర్వ్ చేస్తుంటారు వేసవికాలం వస్తే వీటి విషయం చెప్పనక్కరలేదు అయితే యివి వారి వారి అబిరుచుల మీద పోదా మీద ఆదారపడి ఉంటాయి

కాని పళ్ల రసాలు త్రాగితే పళ్ళు రాలిపోగలవంటున్నారు డాక్టర్లు ఈ మద్య బ్రిటిష్ డెంటల్ జర్నల్ లోని ప్రముఖ పరిశోదకుల అంచనాల మేరకు పళ్ల రసాలు కూల్‌డ్రింకులు అదికంగా తీసుకొన్నవారికి పళ్ళు (టీత్) పలు చోట్ల అరిగిపోయి విపరీతమైన బాదకు గురిచేయడమే కాకుండా దంత సౌందర్యానికి మాయని మచ్చగా మారుతున్నట్లు తేలింది

బ్రిటిష్ సైంటిష్టులు కదనం ప్రకారం నిమ్మ నారింజ జాతికి చెందిన అన్ని రకాల పళ్ల రసాలు కూడ దంతారోగ్యానికి అవరోదాలు కల్పిస్తున్నట్లు తేలింది పంటిపై పళ్ల రసాల చర్యల గురించి అనేక సంవత్సరాలు పరిశోదనలు జరిగినయ్ 1907వ సంవత్సరంలో డబ్ల్యు డి మిల్లర్ అనే పరిశోదకుడు పంటి బాగంలో నుండి కాల్షియం హరించిపోవడానికి ఎక్కువగా పళ్ల రసాలు త్రాగడమేనని తేల్చి చెప్పాడు

అలాగే 1912లో పికెరిల్ అనే శాస్త్రజ్ఞుడు నిమ్మకాయలను అదే పనిగా చప్పరించేవారిలో విపరీతంగా పంటి ఎనామిల్ (పింగాణి) పదార్థం వృదా అయిపోతున్నట్లు దృవీకరించాడు అయితే యీ రోజుల్లో కూల్‌డ్రింక్స్‌తో పాటు బద్రపరచబడిన పళ్ల రసాల వాడకం కూడ ఎక్కువయినందున వీటి విషయంలో పరిశోదనలు మరింత వుదృతంగా జరుగుతున్నాయ్ పైన ఉదహరించిన వైజ్ఞానికుల పరిశోదనలతో పాటు జరిగిన మరికొంత మంది పరిశోదనలలో పరిశోదనశాలల్లోని జంతువులపై పళ్ల రసాలు ప్రయోగించగా ఆ జంతువుల పళ్లల్లో అరుగుదల కన్పించినట్లు తేలింది

అసలు పన్ను అరిగిపోవడం (ఇరోజన్) అంటి ఏమిటి? ఇది వ్యాది మాత్రం కాదు పిప్పి పన్ను అనే వ్యాదికి దీనికి యేమాత్రం పోలికలేదు తియ్యని పానీయాలు పిప్పి పళ్లను కలుగజేస్తాయనే వాదన వున్నప్పటికి అరిగిపోవడం (ఇరోజెన్) మాత్రం వ్యాదికాదు అయితే పంట పదార్థం కోల్పోవడం ద్వారా పల్స్ కుహరం బయటపడి దంత వ్యాదులు సంబవించవచ్చు విపరీతమైన నొప్పి రావచ్చును పంట పదార్థం కోల్పోయిన పన్ను ఆకృతి మారిపోయి జివ్వు మని లాగడం మొదలుపెట్టి విసుగు పుట్టిస్తాయి

బ్రిటిష్ శాస్త్రజ్ఞులు చేసిన ఒక పరీక్షలో ఎలుకలకు అనేక రకాలైన పళ్లరసాలను యివ్వడం జరిగింది అలాగే కొన్ని ఎలుకలకు మంచినీటిని (పంచదార కూడ కలపబడింది) యివ్వడం జరిగింది అయితే పళ్ల రసాలు సేవించిన ఎలుకల్లోనే విపరీతమైన పంటి అరుగుదల (ఇరోజన్) కన్పించింది పంచదార కలిపిన నీళ్ళు త్రాగిన ఎలుకల్లో యిలాంటి వైపరీత్యాలు చాల తక్కువగా కన్పించినాయి

అలాగే ఆమ్లాలు అదికంగా ఉండే ఆహారపదార్థాలు నోటిలో ఎక్కువసేపు వుంచుకోవడం వల్ల కూడ పళ్ళు ఇరోజన్ కు గురి అవుతున్నట్లుగా తేలింది అయితే మన నోటలో వూరే లాలాజలంలో అమ్లత్వ గుణాన్ని తగ్గించగల సత్తా వున్నట్లు కూడ రూడి అయింది

అందుచేత పంటి అరుగుదల అనేది కేవలం పదార్థాల అమ్లగుణం పల్లనే కాక లాలాజలం తట్టుకొనే శక్తిపై కూడ ఆదారపడి వున్నట్లుగా అర్థం చేసుకోవాలి పళ్లరసాల్లోను కూల్‌డ్రింకుల్లోను ఉపయోగించే తీపి పదార్థాలు పంట అరుగుదలకే పరిమితంకాదు జీర్ణకోశంలో వున్న పంచదార ఎక్కువగాను త్వరగాను పీల్చుకోబడి వెంటనే రక్తప్రసారంలో కలపడం మూలాన రక్తంలో చక్కెర లెవెల్ పెరిగి చాల అపాయకరమైన పరిస్థితులు యేర్పడుతుంటాయి

చక్కెర రక్తంలో కాల్షియం - పాస్ఫరస్‌ల నిష్పత్తిని చిన్నాబిన్నం చేసి మరిన్ని ఉపద్రవమైన పరిస్థితులను సృష్టిస్తుంది అలాగే చక్కెర శరీరంలోని బి విటమిన్ నిల్వలను తగ్గించటం వల్ల మన నోటలో వూరే లాలాజలం మరింతగా అమ్ల గుణాన్ని ఆపాదించుకొంటుంది అందుచేత అమ్లత్వాన్ని కలిగివున్న లాలాజలము చిన్నాబిన్నమైన కాల్షియం పాస్ఫరస్‌ల నిష్పత్తి దంతారోగ్యానికి హాని కలిగిస్తాయి



చిగురు వ్యాదులతోను (చిగురు వాచడం చిగుళ్ల నుంచి రక్తం కారడం వంటివి) జివ్వు మనిపించే పళ్లతోను బాదపడేవారు తప్పనిసరిగా పళ్ల రసాలను తీసుకోవడం పూర్తిగా మానివేయడంగాని స్థాయి తగ్గించడంగాని చేయవలసి వుంది అంతేకాకుండా అవసరాన్ని బట్టి కాల్షియం విటమిన్ - బి అస్కార్బిన్ ఆసిడ్ (ప్రతి దినం 50 మి గ్రా సరిపోతుంది) వాడుతుండవచ్చు బ్రిటన్‌కు చెందిన డా హెన్రి హిక్స్ అనుభవం మేరకు వారానికి మూడు నారింజ పండ్లు లేక మూడు ద్రాక్ష పండ్ల బద్దలుగాని ఒక నారింజ లేక రెండు ద్రాక్ష బద్దలుగాని మధ్యలో ఏదో ఒక తాజా పలం రోజుకు ఒకటి చొప్పున తీసుకొని నిత్యం శాస్త్రీయ పద్ధతుల ననుసరించి దంత దావనం చేసుకొంటూ సరిపడినంతగా బోజనం తీసుకున్నట్లయితే దంత సంరక్షణ విషయంలో మరేమి జాగ్రత్తలు తసుకొనవలసన పని వుండదు

### చికిత్సా విధానం

ఇరోజన్ వచ్చిన పళ్లకు రెండు రకాలు చికిత్సా పద్ధతులున్నాయి మొదటిది తాత్కాలికమైనదైతే రెండవది శాశ్వతమైన పద్ధతి మొదట పద్ధతి ప్రకారం ప్రతి దినం తెర్మోసిల్ టూత్ పేస్టను గాని సెన్సొడైన్ టూత్ పేస్టునుగాని అరిగిన (ఇరోజన్) చోట చేతి ప్రేలితో రుద్దటం వల్ల తాత్కాలికంగా ఉపశమనం లబించి జివ్వు మనకుండా వుంటాయి రెండవ పద్ధతి ప్రకారము అరిగిన చోట ఎల్లింగులు చేయించుకోవాల్సి వుంటుంది ప్రత్యేక శ్రద్ధలు తీసుకొంటె యీ ఎల్లింగులు చాలా కాలం నిలుస్తాయి అయితే అరిగిన అన్ని పళ్లకు యీ ఎల్లింగులు చేయడం సాధ్యంకాదు ఏది యేమయినప్పటికి అనుమానం వున్నప్పుడు దంత వైద్యుని సంప్రదించడం ఆరోగ్యకరం






సీరియల్

# చైతన్య స్వరూపం

కంచుమర్తి వెంకటేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

అదే సమయంలో

షాపింగుకు వచ్చిన జ్వాల ఒక హోటల్‌లోకి బార్గవ వెళ్ళడం చూసింది బేగ్‌ను షాపులోనే ఉంచి హోటలు కెళ్ళింది కాఫీకి ఆర్డరిచ్చి ఓ మూల కూర్చుని అన్ని వైపులా వెదకింది బార్గవ కనిపించలేదు

కాఫీ త్రాగి కౌంటరులో అడిగింది

అతను రూం నెంబరు చెప్పాడు

జ్వాల మేడెక్కి ఆ గది దగ్గరకు వెళ్ళింది

కిటికీలోంచి చూసింది

ఆ అమ్మాయి ఎవరు?

మరో ప్రేమికురాలా!

ఇలా ఎందరు?

రేపు అతని చావు ముహూర్తం పెట్టడానికి ఇదే సమయం

బార్గవ ఆ అమ్మాయిని దగ్గరకు తీసుకుని చెవిలో ఏవేవో చెబుతున్నాడు ఆ అమ్మాయి విరగబడి నవ్వుతోంది

టేబిలు మీదున్న మందును గ్లాసులో పోసి అమ్మాయి బార్గవ నోటి కందిస్తోంది బార్గవ తాగుతూనే కైపెక్కిన కళ్ళతో అమ్మాయి అందాలను జుర్రుతున్నాడు అమ్మాయి ఒక్కొక్క బట్టను తీస్తూ బార్గవను అల్లుకుపోతుంది తమకంతో బార్గవ నగ్నంగా ఉన్న ఆ అమ్మాయి శరీరంలోని అణువణువును ముద్దులతో తడిపేస్తున్నాడు బలంగా ఎత్తుగా ఉన్న వక్షోజాలను తన గుండెల కదుముకుని తనలో ఇముడ్చుకున్నాడు ఆ అమ్మాయి మరింత వెర్రిగా ఆవేశంగా బార్గవను చుట్టి మెలికలు తిరిగిపోతూంది

ఇక ఏం జరుగుతుంది?

ముఖం త్రిప్పేసింది జ్వాల

తలుపు తట్టింది

కొంత సేపటికి తలుపులు తెరచుకున్నాయి

ఆ అమ్మాయి బట్టలు కట్టుకుంటోంది

బార్గవ ఆశ్చర్యపోయాడు జ్వాలను చూసి

నువ్వా ఇక్కడెందుకొచ్చావ్

ఏం రాకూడదా ఒకప్పటి నీ ప్రేయసిని నిన్ను వెదక్కుంటూ వచ్చాను అని ఆ అమ్మాయిని చూసి బజారు పిల్లా మరో ప్రేయసా అంది వెటకారంగా

ఆ అమ్మాయి రుసరుసలాడుతూ వెళ్ళిపోయింది

నిజంగా నా కోసం వచ్చావా

అవును డియర్ సంవత్సరం నుండి వెదకుతున్నాను క్లబ్బులో కనిపించి ఇట్టే మాయమయ్యావు అప్పుడెప్పుడో ఇంటికి వచ్చి నేను కావాలని నువ్వడిగినప్పుడు తొందరపడి బయటకు గెంటేసాను ఆ క్షణంలో అలా అన్నానే కానీ తర్వాత ఎంతో బాధ పడ్డాను

జ్వాల మాటలకు ఉబ్బిపోయాడు

నాకు తెలుసు నువ్వు ఎప్పటికైనా నా దగ్గరకు వస్తావని

అని జ్వాలను పట్టుకోబోయాడు

జ్వాల తెలివిగా తప్పించుకుంది

ఇప్పుడు కాదు రేపు సాయంత్రం ఆరు గంటలకు నేను చెప్పే హోటలుకు రావాలి అక్కడ నేను సంతోషంగా నీలో కరిగిపోయి నీకు స్వర్గం చూపిస్తాను

తప్పకుండా నీ కోసం ఎక్కడికైనా వస్తాను

ప్రామిస్

ప్రామిస్

నవ్వుతూ బయటకు వచ్చింది జ్వాల

అలాగే చూస్తూ నిలబడిపోయాడు బార్గవ

★ ★ ★ ★ ★

ఈ మూడ్రోజులూ ఎక్కడకు పోయావ్

రూంకి రాగానే అడిగింది జ్వాల డాలీని

పని మీద వెళ్ళాను ఆ ఒక్క ముక్కే చెప్పింది డాలీ

డాలీ భార్గవ చావు రేపు రాత్రి ఏడుగంటలకు మన హోటలులోనే ముహూర్తం చావడానికి ఓ గంట ముందే వస్తాడు

జ్వాలా ఇలా చేయడం వలన నీకు కలిగే లాభం ఏమిటో గానీ మరిన్ని విపరీతమైన పరిణామాలు ఎదుర్కొంటావు

అయినా ఫరవాలేదు నా జీవితం ఇలా కావడానికి కారకుడయిన బార్గవను చంపందే నా పగ చల్లారదు

పగ ముఖ్యమా తిరిగి నీ జీవితంలోకి వెళ్ళడం ముఖ్యమా

జ్వాల నవ్వింది

నా అనేవాళ్ళందరితోనూ అసహ్యించబడి ఏ ఆశతో మళ్ళీ అటువంటి జీవితాన్ని కోరుకొమ్మంటావు

అంటే నీ భర్త తిరిగి నిన్ను భార్యగా స్వీకరించడనా నీ అభిప్రాయం

అభిప్రాయమే కాదు అత్యాశకూడా

అత్యాశని ఎందకనుకుంటావు ఆ ఆశతో జీవించవచ్చు కదా"

ఆ ఆశలేదు కాబట్టే నిరాశను పెంచుకుని నా జీవితాన్ని అంతం చేసుకోవాలనుకుంటున్నాను భార్గవ నా చేతుల్లో మరణించిన క్షణంలోనే నా జీవితం కూడా అంతమవుతుంది అయితే భార్గవ చనిపోయే ముందు పెళ్ళికి ముందు నేను శీలం కోల్పోలేదనే నిజం వాడి చేత చెప్పిస్తాను

డాలీ నీకు రామాయణం తెలుసా

సీత కొంత కాలం లంకలో రావణుడి చెరలో ఉంది రాముడు

జరిగిన కథ - 4 కాలేజిలో లెక్చరర్‌గా పని చేస్తున్న స్వరూప స్వంత కొడుకుని హత్య చేసింది, ఈ నేరం తనే కోర్టులో స్వయంగా ఒప్పుకుంది తన తరపున వాదించడానికి వచ్చిన లాయరు హరితకు తన జీవిత విశేషాలను చెప్పసాగింది ఇద్దరు పిల్లల తల్లిఅయిన స్వరూప భర్త బార్గవ దుర్మార్గాలను కళ్లారా చూచి అతనికి విడాకులిచ్చింది అంతేగాక అతనిని జైలుకి పంపింది సీత డాలీలు చెప్పింది హరిత ముందు ఉంచింది స్వరూప సీత నళిని అక్కచెల్లెళ్ళు తల్లి లేని పిల్లలని తండ్రి మన్మధరావు వీళ్లని అల్లారుముద్దుగా చూసుకుంటున్నాడు సీత తను ప్రేమించిన బార్గవ మోసగాడని తెలుసుకుని తన తండ్రి తెచ్చిన సంబందానికి ఒప్పుకుంది సీత పెళ్లి రామారావుతో జరిగిపోయింది బార్గవ రాసిన అబద్ధపు ఉత్తరం వల్ల రామారావు సీత విడిపోయారు క్లబ్ డాన్సరు డాలీ ఆశ్రయంలో సీత చేరుతుంది సీత తన పేరు జ్వాలగా మార్చుకుంటుంది జ్వాల క్లబ్బులో సింగర్‌గా ఉద్యోగంలో చేరుతుంది జ్వాలకు బార్గవ కనిపిస్తాడు డాలీ జ్వాల పెట్టెలోని ఆల్బమ్ చూసి అసలు పేరు సీతని ఆమెకు రామారావుతో వివాహం అయిందని తెలుసుకుంటుంది సీతను ఎలాగైన ఆమె భర్త దగ్గరకు చేర్చాలని డాలి వైజాగ్ వెళ్లి రామారావుని కలుసుకుని సీత బార్గవ గురించి అంతా చెప్పి ప్రస్తుతం చేయవలసింది చెప్పింది

రావణాసురున్ని జయించి అగ్ని సంస్కారం వలన సీత లంకలో పవిత్రంగానే ఉందని ఋజువు చేసుకుని రాజ్యానికి తీసుకొచ్చి ఏలుకుంటాడు అయితే ఒక చాకలి వాడి మాటకు అంతటి శ్రీరాముడే ప్రజల తీర్పు తన తీర్పుగా బావించి సీతను అడవులకు పంపించేస్తాడు సీత పునీతురాలని అగ్నిదేవుడు అష్టదేవతలు ఎలుగెత్తి చాటినా ఒక సామాన్య చాకలి వాడి మాటకే భ్రమ పడిన శ్రీరామచంద్రుడు భగవంతుడు అవతార పురుషుడే అలా ప్రవర్తించాడంటే ఈ యుగంలో ఈ రోజుల్లో ఒక మగవాడు అలా చేయడం అతిశయోక్తి కాదు

అనాడు రాముడు రావణుడిని జయించి తన సీతను ఇంటికి తెచ్చుకున్నాడు అయితే అంతటి ఔదార్యం గొప్పతనం ఈనాటి రాముళ్ళకు ఉందా! భార్య తప్పు చేసిందని తెలియగానే నిజానిజాలు తెలుసుకోకుండా ఇదే అదననుకుని భార్యను విడిచి ఎట్టి విడాకులు పేరుతో పూర్తిగ బంధాలు త్రెంచుకుని మరో ఆడదాన్ని భార్యగా తెచ్చుకుంటాడు అనాటి రాముడిలా యుద్ధం చేయడు ముఖ్యంగా ఏక పత్నివ్రతుడిలా ఉండడు ఈ పరిస్థితిలో ఈ నాటి స్త్రీలకు రక్షణ ఏలా?

తన రాముడు వస్తాడు

తనకు చెర విడిపిస్తాడు

తనను మళ్ళీ ఏలుకుంటాడు

ఆ నాటి సీత ఆ ఆశతో జీవించింది

రాముడు తీసుకెళ్ళాడు

ఏమయింది తర్వాత?

ఈ నాటి సీతకు ఆ ఆశలేదు ఒకవేళ ఆ రాముడిలా ఈ రాముడు కాపాడి ఇంటికి తీసుకొచ్చినా గతాన్ని గుండెలో ఉంచుకుని క్షణం క్షణం మానసిక క్షోభ అనుభవిస్తూ ఆమెను చిత్రవధకు గురి చేస్తాడు మళ్ళీ అడవుల పాలు ఆ యుగంలో ఆ సీతకు వాల్మీకి లాంటి మహా పురుషులు నీడనిచ్చారు భూదేవి తన గుండెలో దాచుకుంది కానీ ఈ రాక్షస యుగంలో ఈ సీతలను ముక్కలు ముక్కలుగా చీల్చివేస్తారు దగాపడిన నేటి సీతలకు ఆశ్రయం ఎక్కడుంది?

అయితే మారుతున్న కాలంలో మగువ ముందంజ వేస్తున్న ఈ రోజుల్లో ప్రతీకారం తీర్చుకోవడానికి కూడా వెనుకంజ వేయడం లేదు ఆ సీతకు ఈ సీతకు అదే తేడా!

జ్వాల ఆవేశంగా చెబుతుంటే ఆశ్చర్యంగా చూసింది డాలీ

ఎలాగైనా జ్వాలను రక్షించాలి

రామారావుకు జ్వాలను చూపించి సీతగా ఇంటికి తీసుకెళ్ళమంటే జ్వాల చెప్పినట్లు అపవాదు అబద్ధమని ఋజువు కాకుండా తీసుకెళ్ళి ఒక మగాడిలా మానసిక క్షోభకు గురి చేస్తే ఏం లాభం

జ్వాల పథకాన్ని ఆపాలి

సీత పవిత్రమైందనే నిజం రామారావుకు తెలియాలి

భార్గవను పోలీసులకు అప్పగించాలి

ఏం చేస్తే ఇవి జరుగుతాయి

డాలీ ఆలోచనల్లో ఓ మెరుపు మెరిసింది

* * * * *

స్వరూప చెప్పడం ఆపింది

హరిత ఆసక్తిగా వింటుంది

ఏమిటి ఆగిపోయారు

హరిత అడిగింది

చూడమ్మా నా భర్త ఒక రాక్షసుడని సీత డాలీ చెప్పితే ఎంత ఆశ్చర్య



పోయానో ఆ రాక్షసత్వం నేను చూసే ప్రాప్తం కలిగినందుకు అంత బాధ పడ్డాను నిజానికి డాలీ నా దగ్గరకు వచ్చే వరకు నా భర్త గురించి నాకు పూర్తిగ తెలియదు డాలీ నా దగ్గరకొచ్చి నా సహాయాన్ని అర్థించింది నా మనసుకు నాకు అంతర్‌యుద్ధం ఆరంభమయింది ఒక స్త్రీ చేతిలో నా భర్త చనిపోతాడు అనే నిజం నా గుండెను కలచి వేసింది అయితే ఒక స్త్రీగా ఒక అడుగు ముందుకు వేయక తప్పలేదు ఇలా నేను చేయడం వలన నా పసుపు కుంకుమలు నాకుంటాయి ఒక రాక్షసుడికి శిక్షపడుతుంది

డాలీ ఎందుకు వచ్చింది ఏమడిగింది మీరేం చెప్పారు ఆతృతగా అడిగింది హరిత

స్వరూప చెప్పడం ప్రారంభించింది

* * * * *

ఆరోజు సాయంత్రం గార్డెనులో మాలీచేత మొక్కలకు నీళ్ళు పోయిస్తున్నాను పాప పూలతో ఆడుకుంటుంది అర్నెల్ల బాబు ఆయా చేతిలో ఉన్నాడు

ఇంతలో ఒకమ్మాయి లోపలకు వచ్చింది

ఆమె డాలీ

ఎవరు కావాలి

భార్గవ గారున్నారా

డాలీని లోపలకు తీసుకెళ్ళాను

డ్రాయింగ్ రూంలో ఎదురెదురుగా కూర్చున్నాం

నేను మిసెస్ భార్గవను స్వరూప భార్గవగారు గంట క్రితమే పని మీద బయటకు వెళ్ళారు మీరు వచ్చిన పనేమిటో చెప్పితే అతను రాగానే చెబుతాను అన్నాను

డాలీ అసలు విషయానికి వచ్చింది

మీ వారు గురించి మీకు బాగా తెలుసా

భర్త గురించి పరాయి ఆడది అలా అడిగితే సహజంగా ఏ భార్యకైనా కోపం వస్తుంది అయితే నాకు కోపం రాలేదు సరికదా ఏదో తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో మీకు తెలుసా అని ఎదురు ప్రశ్న వేసాను

తెలుసు ఒక రాక్షసుడు అమ్మాయిల జీవితాలను నాశనం చేసే కిరాతకుడు

రాక్షసుడు కిరాతకుడు అన్న పదాలను డాలీ నొక్కి పలికింది

మరీ దారుణంగా మాట్లాడుతున్నారు భార్య ఎదుటే భర్తను నీచంగా వర్ణిస్తున్నారు

చూడండి మీ దృష్టిలో భర్త మంచివారే కాని లోకం ముఖ్యంగా అమ్మాయిల పట్ల ఎంత అమానుషంగా ప్రవర్తించారో మీకు తెలిస్తే అతన్ని క్షమించలేరు ఏ ఏ అమ్మాయిలను ఏ ఏ రకాలుగా నాశనం చేసారో చెప్పితే మీరే అసహ్యించుకొంటారు అతని వలలో పడిన అమ్మాయిలను అనుభవించకుండా వదలని మనస్తత్వం మీ వారిది అవన్నీ ఒక ఎత్తు అతను రాక్షసుడని తెలిసిం తర్వాత అతని ప్రేమ వలయం నుండి తప్పించుకుని పెళ్ళి చేసుకొని భర్తతో సుఖంగా సంసారం చేస్తున్న ఆడదాన్ని కూడా తనకు దక్కలేదన్న కసితో కక్షతో ఆమె సంసారాన్ని ముక్కలు ముక్కలుగా సర్వనాశనం చేయందే వదలని మూర్ఖత్వం గలవారు మీ శ్రీవారు ఇప్పుడు అదే జరిగింది సీత అనే అమాయకురాలి పచ్చటి సంసారంలో విషపు చుక్క వేసి భార్య కులటని ఆ భర్త నమ్మేలా చేసి ఆమెను రోడ్డెక్కించేలా చేసారు మీ భర్త ఆ సీత పగతో జ్వాలగా మారి మీ వారిని సజీవ దహనం చేయడానికి ఈ రోజు ముహూర్తం పెట్టింది స్నేహితురాలిగా ఈ విపత్తు నుండి కాపాడి ఆమెను తిరిగి భర్త దగ్గరకు చేర్చేలా నేను చేస్తున్న ప్రయత్నం సక్సెస్ కావాలంటే భార్గవ నిజ స్వరూపం లోకానికి తెలియాలి

నేను చాలాసేపటి వరకు మాట్లాడలేదు

భార్గవ చాలామంది అమ్మాయిలతో తిరిగాడని పెళ్ళయిం తర్వాత తెలిసింది అయితే ఇంత నీచంగా ప్రవర్తిస్తున్నాడన్న సంగతి మాత్రం తెలియదు సహజంగా జరుగుతున్న అవినీతిని అన్యాయాన్ని ముఖ్యంగా స్త్రీల పట్ల రోజు రోజుకి జరుగుతున్న ఘోరాలను ఖండిస్తూ కాలేజీ యూనివర్సిటీలో వ్యాసాలు రాసాను ఉపన్యాసాలిచ్చాను ఇప్పుడు జరిగిందేమిటి? తన కర్తవ్యం ఏమిటి?

ఇప్పుడు నన్నేం చేయమంటారు

మీ సహాయం కావాలి మీ వారు ఎంత మంది అమ్మాయిలను ఏ విధంగా నాశనం చేసారో స్వయంగా డైరిలో వ్రాసుకుంటారు ఆ డైరిల వలన కొంత కాలం శిక్ష పడుతుంది అవి మీరివ్వకపోతే పగబట్టిన ఆడదాని చేతిలో దారుణంగా చంపబడతారు

ఒక్క నిముషం ఉండమని చెప్పి నేను గదిలోని వెళ్ళాను వారం రోజుల క్రితం పై ఊర్లో ఉన్న గెస్ట్ హవుస్‌ను ఖాళీ చేసి భార్గవ సామాను తెచ్చినప్పుడు రెండు డైరీలు పెట్టెలో చూసాను ఏవో బిజినెస్ వ్యవహారాలుంటాయనుకున్నాను

వాటిని తీసి చదివేసాను ఒక్కొక్క పేజీ భార్గవ అసలు స్వరూపం చూపిస్తుంటే అప్రయత్నంగా నా కళ్ళలో నీళ్ళు నిలిచాయి

ఇప్పుడేం చెయ్యాలి?

పోలీసులకు అప్పగించాలా!

పగబట్టిన ఆడదాని చేతిలో చావనియ్యాలా!

ఓ నిర్ణయానికి వచ్చిన నేను డైరీలు డాలీకిచ్చాను

డాలీ కృతజ్ఞతలు చెప్పి వెళ్ళిపోయింది

డాలీ చెప్పిన మాటలకు పిల్లలను ఆయాకు అప్పగించి బయలుదేరాను

* * * * *

హోటల్‌లో ఓ మూల కూర్చుని జరుగుతూంది జరగబోయేది చూస్తున్నాను

డాలీ సరాసరి మేనేజరు దగ్గరకెళ్ళి అతని చెవిలో ఏదో చెప్పింది మేనేజరు ఒక్కసారిగ కళ్ళప్పగించి ఆశ్చర్యం నుంచి కొంత సేపటికి తేరుకొని ఫోన్ అందుకున్నాడు

వాచీ చూసింది

నేనూ చూసాను

ఆరు కావొస్తుంది .

అప్పుడే స్కూటరు దిగి లోపలకు వెళుతున్న భార్గవ నన్నుగాని డాలీనిగాని గమనించలేదు

అదే సమయంలో గదిలో

జ్వాల యుద్ధానికి సన్నాహాలు చేస్తుంది

భార్గవా నీ నోటితో నిజం చెప్పిస్తాను అనుకుంది కసిగా

పరుపు కింద టేపు రికార్డర్ ఉంచింది

తలుపు తీసింది

ఎదురుగా భార్గవ

రా భార్గవా నీ కోసం ఎదురు చూస్తున్నాను లోపలకు తీసుకెళ్ళింది తలుపు వేసింది భార్గవ జ్వాలలో ఇంతకుముందు తను ప్రేమించిన సీతను చూసాడు తెల్లని చీర తెల్లని బ్లౌజు తెల్లని మల్లెలు అందంగా మెరిసిపోతుంది

ఏమిటంత దీక్షగా చూస్తున్నావు?'

నిన్నూ నీ అందాన్ని

చిన్నగా నవ్వింది జ్వాల కాదు ప్రతీకారం తీర్చుకోబోతున్న సీత

ఇంకొంచెం సేపట్లో ఈ అందం నీ సొంతమవుతుందిలే

మరింతగా ఒయలు ఒలకబోసింది సీత

భార్గవా నా అందాన్ని ఇంతవరకూ అనుభవించలేదా

ఏది ఆ అవకాశం ఎక్కడ ఇచ్చావు

మరి మా వారికి ఒకసారి లెటరు రాసావు కదా! పాపం వారు నిజమనుకుని బయటకు గెంటేసారు మన మంచికే అయిందిలే తర్వాత నీ కోసం ఎంత వెదికానో తెలుసా నీకు దక్కని ఈ అందాన్ని నీకు ఇద్దామని ఆ రోజు నుండి ఎంత ఆతృతగా ఎదురు చూస్తున్నానో తెలుసా

గోముగా అతని షర్టును విప్పుతూ అంది

భార్గవ సంతోషంగా గెంతులేసాడు

భార్గవకు తెలియదు టేపు తన మాటలు దాస్తోందని

నాకు తెలుసు సీతా నా వలలో పడిన ఏ ఆడది కూడా నన్ను తప్పించుకునిపోదు దూరమయినా మళ్ళీ నా దగ్గరకే వస్తుంది ఆ రోజు నువ్వు లాడ్జికి రాలేదని మన ప్రేమ కథంతా మీ వారికి తెలిసేలా రాసాను మీ వారు నిన్ను అనుమానించి బయటకు గెంటేస్తే ఎప్పటికైనా నువ్వు నా దగ్గరకు వస్తావనే అలా చేసాను

విస్కీ గ్లాసుమీద గ్లాసు నోటికందిస్తోంది

ఆబగా త్రాగేస్తున్నాడు భార్గవ

అయితే మరి పెళ్ళికి ముందు నన్ను అనుభవించలేదా

భార్గవకి పూర్తిగా మత్తెక్కిన తర్వాత అసలు విషయంలోకి దింపింది

అప్పుడు అనుభవిస్తే నీ కోసం అంత నాటకం ఆడవలసిన అవసరం ఏముంది సీతా

అయితే పెళ్ళయ్యే వరకూ నేను పవిత్రంగానే ఉన్నానా

ముమ్మాటికి నీవు వాడని పువ్వువి అంత పవిత్రంగా పదిలంగా నువ్వు నాకు దూరమయ్యావు కాబట్టే నీ మీద మోజు పెరిగింది ఎప్పటికైనా నిన్ను నీ అందాన్ని సొంతం చేసుకోవాలనే నీ భర్తకు దూరమయ్యేలా చేసాను

భార్గవ మాటలు తడబడుతున్నాయి

భార్గవా నేను కులటను కానని శీలం కోల్పోలేదని నువ్వు ఒప్పుకున్నావు ఇక నీ పని అయిపోయింది అనుకుని సీత హేండ్ బేగ్‌లోంచి పాయిజన్ తీసింది ఒక ఉత్తరం

అది భర్తకు రాసిన ఉత్తరం

ఏవండీ

ఆ రోజు మీరు నన్ను బయటకు పంపేటప్పుడు నేను తప్పు చేయలేదని క్షమించమని అడిగే ధైర్యం లేక తలవంచుకుని వచ్చేసాను ఆధారాలు ఎదుట ఉంటే మీరెలా క్షమిస్తారు పెళ్ళికి ముందు నేను శీలం కోల్పోలేదని ఋజువు చేసుకునే వరకు మీకు కనిపించకూడదని జ్వాలగా బ్రతికాను రోజులు గడిచే కొద్దీ మీ చెంతకు వచ్చి మళ్ళీ మీతో అందంగా సంసారం చేస్తాననే ఆశ ఆశగానే మిగిలిపోతోంటే నా మీద నాకే అసహ్యం పెరిగిపోతుంది మీ చేత అవమానింపబడి నా గురించి తెలిసిన నాన్న చెల్లెలు అత్తా మామయ్య మరుదులు అసహ్యిస్తుంటే ఏ కోరికతో అందమైన జీవితాన్ని ఆశిస్తాను అందుకనే మీకు దూరమైన తనువును అంతం చేసుకోవాలని నిర్ణయించుకొన్నాను అయితే చనిపోయే ముందు నా జీవితం ఇలా తయారవ్వడానికి కారకుడయిన ఆ భార్గవ చేత నేను పవిత్రురాలినని చెప్పించాలని మీకు తెలిస్తే–

సీతా నువ్వు తప్పు చేయలేదని మీరంటే చాలని ఆశతో ఈ పథకం




వేసాను

ఇదంతా నేను చనిపోయిన తర్వాత మీకు పోలీసుల ద్వారా తెలుస్తుంది అప్పుడు ఓ కన్నీటి బొట్టు రాల్చండి అది నాకు చాలు

మీ సీత

ఏమిటి డియర్ ఇంకా ఆలశ్యం

మత్తుగా అన్న భార్గవ మాటలకు తేరుకుని కర్తవ్యం గుర్తుకొచ్చి సీత బేగ్‌ను టేబిలు మీద ఉంచి పాయిజన్ విస్కీలో కలిపి భార్గవకు అందించబోయింది

ఇంతలో తలుపు చప్పుడు

జ్వాల వినిపించుకోకుండా గ్లాసు భార్గవకు ఇచ్చింది

మళ్ళీ తలుపు గట్టిగా చప్పుడు

ఉండు సీతా బోయికు సిగరెట్లు చెప్పాను

అని గ్లాసు టేబిలు మీద ఉంచి తూలుతూనే లేచాడు

నేను తీస్తాను నువ్వు తీసుకో భార్గవా

గ్లాసు భార్గవకిచ్చి తలుపు తీసింది

అంతే తలుపు తీయడమే తరువాయి లోపలకు దూసుకు వచ్చారు పోలీసులు భార్గవ గ్లాసు ఎత్తబోతుంటే బలమైన ఇన్‌స్పెక్టర్ చేతులు గ్లాసును

## చైతన్య స్వరూపం

పగులగొట్టాయి

సీత అలాగే నిలబడిపోయింది కొయ్యబారిపోయి

మీరెందుకు వచ్చారు

అంది కొంతసేపటికి తేరుకుని

మీరు చేయబోయే పని తెలిసే వచ్చాం

ఎవరు చెప్పారు ఈ భార్గవ బ్రతికితే ఇంకా ఎందరో అమ్మాయిలు నాశనమవుతారు ఈ రాక్షసుడు బ్రతక్కూడదు

అని సీత ఇంకేదో చెప్పబోయి ఆగింది

డాలీ నేను లోపలకు వెళ్లాం

డాలీ చేతిలో డైరీలు

ఇన్స్పెక్టర్ ఈ భార్గవ ఎంతమంది అమ్మాయిల జీవితాలతో ఆడుకున్నాడో ఈ డైరీలే చెబుతాయి

డాలీ డైరీలను ఇన్స్పెక్టర్‌కిచ్చింది

ఇన్స్పెక్టర్ చదివాడు

భార్గవ మత్తు పూర్తిగా దిగజారిపోయింది

సీత ప్లాను పూర్తిగా అర్థమయింది

భార్గవ్ ఎదురుగా భార్య

నా ముఖంలోకి చూడలేక తల దించేసారు

పోలీసులు భార్గవ చేతికి బేడీలు వేసారు

భార్గవ దగ్గరికెళ్ళాను

నా జీవితం వివాహంతో మరో అందమైన మలుపు తిరుగుతుందని భ్రమపడి ఎంతో ఉన్నతంగా వూహించుకొన్నాను కానీ మీరొక రాక్షసుడని తెలిసిం తర్వాత మిమ్మల్ని భర్తని చెప్పుకోడానికే సిగ్గుపడుతున్నాను మీ పై మెరుగులు చూసి మా డాడీ నేనూ మోసపోయాం నేను బ్రతుకుతూ నా ఎల్లలను ఉత్తములుగా తీర్చగల చదువు డబ్బు నాకున్నాయి మీకు పెళ్ళయిందన్న సంగతి కలగా మరిచిపోండి

విడాకుల కాగితాలు అతని మీదకు విసిరాను

భార్గవను పోలీసులు తీసుకెళ్లారు

నేనూ సీత డాలీ మిగిలాం

సీతా డాలీ పిలిచింది

సీత తలెత్తి చూసింది

నాకంతా తెలుసు సీతా జ్వాల ఈ రోజుతో చనిపోయింది సీత ఎప్పటికైనా పవిత్రురాలే సీతా ఒక్క క్షణం కళ్ళు మూసుకో అంది డాలీ

కళ్ళు మూసి తెరచింది

తెరచిన కళ్ళు అబద్ధం చెబుతున్నాయా

లేక కలలో ఉన్నానా

ఎదురుగా భర్త. రామారావు

అతను దగ్గరకు వచ్చాడు

ఆశ్చర్యంతో కళ్ళప్పగించింది సీత

సీతా

పులకించింది ఆ పిలుపుకు

డాలీ పరుపు కింద నున్న టేపు ఆన్ చేసింది

భార్గవ మాటలు అతనిలోని అనుమానాన్ని పటాపంచలు చేసాయి

(ఇంకా ఉంది)

# ఛాయారాగం

ఎ.వి.శేషారత్నం

తెల తెలవారుతోంది పక్షులు కిలకిలారావాలకు అతీతమైన మదుర రాగమేదో నా చెవిని సోకి నన్నేదో తెలియని దూర తీరాలకు తీసుకు పోతోంది

అందుకే కాళిదాసు అననే అన్నాడు జననాంతర సౌహృదాని అని ఏ జన్మలో బంధమో తెలియదు గాని సంగీతం అంటే నా ప్రాణం లేచి వస్తుంది మళ్ళీ సంగీతంలో నాకు ప్రవేశం లేనేలేదు

తోచనప్పుడల్లా ఏదో బండగుర్తు పెట్టుకుని పక్కింటి సూరి మాష్టారుతో మాస్టారూ ఇది గౌళ రాగం కదూ అంటే ఆయన పొంగిపోయేవారు

ఆ తొలి సంధ్యలో ఈ రోజు సూరి మాస్టారు ఉదయమే డాబామీద కూర్చుని చేస్తున్న సాదన నా కాళ్ళను అప్రయత్నంగా ఆయన ముందుకు లాక్కెళ్ళింది

కళ్ళు మూసుకుని పరిసరాలను సైతం మరిచిపోయి ఆ సుప్రబాతాన్ని తన మదురగానంతో ముంచెత్తుతున్న ఆయన అపర త్యాగరాజులా కనిపించాడు

అదేదో రాగం నాకు తెలిసీ తెలియనట్టే - అంది అందనట్టే స్మృతి పథంలోకి అడుగు పెట్టి మాయమవుతోంది నా ఆత్రుతను అణచి పెట్టుకోలేకపోతున్నాను

ఆయన చేస్తున్న ఆలాపనకి నా మనసు అనిర్వచనీయమైన అనుభూతితో నిండి పొంగి పొరలుతోంది

ఆలాపన అవగానే కళ్ళు తెరిచారు సూరిగారు

మాస్టారూ మీరిప్పుడు పాడింది హిందోళం కదూ!

చిన్నగా నవ్వారాయన ఆ నవ్వులో ప్రశంసకంటే పనివాడి అమాయకత్వానికి పడే ముచ్చట వుంది

విశ్వనాధరావుగారూ! మీరు పూర్వ జన్మలో తప్పకుండా ఏ నాదబ్రహ్మో అయి వుంటారు '

'నే చెప్పింది కరెక్టేనంటారా - సంబరంగా అన్నాను

కాదు నిశ్చలంగా వుంది అయన కంఠస్వం -

మరి తెల్లబోయాను - చిన్నబోయి ఆయనకి దాదాపు నా వయస్సే వుంటుంది అయినా ఎక్కువ గౌరవం అబిమానం చూపిస్తారు నామీద

నేను పాడింది మోహనం మోహన రాగ గాంధారాన్ని గ్రహబేదం చేస్తే అచ్చంగా హిందో
వినబడుతుంది ఇప్పుడు నా దగ్గర తంబురా శ్రు
లేదు కదూ! శృతి లేకుండా ఇలా ఆలాపన వి
మీలాగే - దానిని హిందోళంగా పొరబ
అవకాశముంది

స రి రి గ గ మ మ ప ద ద ని ని స రి రి గ గ

మోహన స రి రి గ గ మ మ ప ద ద ని ని

హిందోళము

చిన్న విషయాన్ని అంత విపులీకరించి శిష్యు
బోదించినట్టు చెప్పడం ఆయన కలవాటే అయి
నాకు ఒక్క ముక్క కూడా అర్ధంకాలేద
అందుకాయన బాదపడా లేదు

* * * * *

అమ్మా! - జ్వర బారం ఎక్కువగా ఉందేమో నా
మూలుగు ఎక్కువయింది ఒళ్ళంతా కొలిమి
పెట్టి కాలుస్తున్నంత బాద - కణత
అదిరిపోతున్నాయి

ఏమండీ! మీ అమ్మగారొచ్చారు - సంబరం
వినిపిస్తున్నాయి సుబద్ర మాటలు

రండత్తయ్యా! మీ అబ్బాయి లోప
పడుకున్నారు నాలుగు రోజుల్నుంచీ జ్వరం ఇం
పత్యం పెట్టలేదు ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్‌లాగ సుబ
వాగ్ధోరణి సాగిపోతోంది ఆ కంఠంలో చెప్పలేనం
రిలీఫ్ కనిపిస్తోంది



# ఛాయారాగం

అవును మరి పాపం! ఏ కోశానా జలుబు కూడా చెయ్యదేమో జ్వరమనేసరికి ఈ నాలుగు రోజుల నుంచి నాతో నా హైరానాపడుతోంది సుభద్ర

అయ్యో మాయదారి జ్వరం ఇప్పుడే దాపురించాలా? కన్నబాబు కిష్టమని జున్ను వండి మిరియాలపొడి జల్లి మరి పెద్దకేరేజి నిండా పట్టుకొచ్చాను - అమ్మ కంఠంలో కంగారు -

అమ్మ కంఠం వినేసరికి క్రమంగా నా చుట్టూ మంచు పేరుకుంటున్నట్టయింది

ఏరా కన్నా! ఎవరైనా డాక్టర్‌కి చూపించుకున్నావా వెర్రి నాగన్నా! ఎండి వరుగైపోయావు నా మంచం మీద కూర్చుని నా జుట్టు సవరిస్తోంది గాబరాగా అమ్మ నా నుదుటి మీద మంచు పర్వతంలా తొ చింది నా ఆరాటం ఏమయిందో -

నాకు నలభై తొమ్మిదేళ్లనిగాని ఇద్దరు అల్లుళ్లకు మామగారిననిగాని మర్చేపోయాను అమ్మ చేతి గాజులు సవిరిస్తూ

చెయ్యి అలాగే ఉంచవే అమ్మా! అన్నాను

చిన్నప్పటి నుంచి నాకదో అలవాటు తరచుగా అప్పట్లో జ్వరం వచ్చేది అందుకే అన్నయ్యలిద్దరి మీదా కంటే అమ్మకు నేనంటే మరికాస్త అపేక్ష అర్భకుడనే జాలి వుండేవి

నాకు జ్వరం వచ్చినప్పుడు అమ్మ పడే ఆరాటం నా జుట్టులోకి వేళ్లు పోనిచ్చి దువ్వడం అమ్మ ఒళ్లో తల పెట్టుకోవటం - అంత జ్వరంలోనూ అమ్మ చేతిని నుదుట మీద పెట్టుకుని గాజులు సవరించడం - ఓహ్! జ్వరం చాల రోజులు ఉండిపోతే బాగుండుననిపించేది

మామూలుగా అయితే అమ్మకు నన్ను పట్టించుకునే తీరికేది? ఇంటినిండా వచ్చే పోయే బంధువులు పాడి పంటా నాన్నగారి కోసం వచ్చే రైతులు - ఇల్లు తిరనాళ్లలా వుండేది

నాకుద్యోగం వచ్చి పట్నంలో కాపురం పెట్టినా అమ్మ నా దగ్గరకొచ్చి పట్టుమని పది రోజులుండేది కాదు

మాలక్ష్మి ఈనిందిరా మిరియాల జున్నంటే నీకిష్టమని తెచ్చాను - పల్లెటూరి నుంచి బస్సులో పడి ఈ కేరేజి భద్రంగా ఒళ్లో పెట్టుకుని మరి వచ్చేది అమ్మ

మీరొచ్చారంటే మాత్రం ఈయనకు వయసు తెలియదత్తయ్యా! మరి చిన్న పిల్లాడయిపోతారు చూడండి రేపు తలంటు స్నానం మీ చేత పోయించుకోకపోతే సగం నిష్ఠూరం సగం అభిమానం ధ్వనించేవి సుభద్ర కంఠంలో

అలాంటి అమ్మ మళ్లీ చాలా రోజులకి వచ్చింది బహుశా నాకు జ్వరం వచ్చిందని తెలిసిందో ఏమో! తెలిస్తే జున్ను ఎలా తెస్తుంది? ఊహూ! నా కోరిక మన్నించి దేవుడే పంపి వుంటాడు

అమ్మను చూడగానే జ్వరం తగ్గిపోయినట్టనిపించి బెంగగా అనిపించింది జ్వరం తగ్గిపోతే అక్కడ కొంపా గోడూ వదిలి వచ్చాను అని వెళ్లిపోతుందావిడ

అమ్మా నీ కోడలు చూడవే అన్నం పెట్టింది కాదు - ఫిర్యాదు చేస్తున్నట్టన్నాను

అది కాదత్తయ్యా! ఈ జ్వరం కాదు గానీ ఈ నాలుగు రోజుల నుంచి గుండెలు తీయించేస్తున్నారనుకోండి మా అమ్మయితే జ్వరమయినా పెరుగన్నం పెట్టేసేది నువ్వు అన్నం ఎట్టకుండా చంపేద్దామనుకుంటున్నావు అని ఒకటే పోరు అన్నం పెడితే ఏ టైఫాయిడ్‌లో దింపుతుందోనని భయం

ఆచారిగారి మందు వేసి మజ్జిగన్నం తినిపించే దానివికదే - నా గొంతులో గారం నాకే విస్మయం కలిగిస్తోంది

ఊరుకోరా కన్నా! ఆ మందులు -పథ్యాల దారే వేరు ఈ ఇంగ్లీషు మందుల గోల నాకేం తెలుస్తుంది? ఆకలేసి తింటానంటే అన్నం పెట్టేయమ్మా అనేవారు ఆచారిగారు సుభద్రా! జ్వరం జారినట్టుంది వీడికి పథ్యం పెట్టడం కోసమే వచ్చానేమో! కన్నా! నాలుగు రోజులు రాజారం రాకూడదట్రా కాస్త అక్కడయితే పాడి ఉంది కనుక పెరుగు నెయ్యి పుష్కలంగా ఉంటాయి ఈసారి సెలవులకి కూడ వచ్చావు కావు - ఆవిడ ముక్కుకున్న ఒంటి ముత్యం తళుక్కుమంది లైటు వెలుగులో -

కాలేజి మొన్నేకదమ్మా తీసారు - చిట్టిగాడిని ఇంటర్‌లో చార్పాలి శాంత పురుటికొచ్చే రోజులు నువ్వే ఓ పది రోజులు ఉండిపోరాదుటే - అమ్మ చెయ్యి వదలనే లేదు నేను

కళ్లు మూసుకున్నా ఆవిడ చేతిలోంచి చల్లదనం నా నుదురు - కణతలు - కళ్లలోంచి జారి వళ్లంతా ఆవరిస్తున్నట్టుంది

ఎంత చిత్రంగా ఉందో - ఇప్పటిదాకా నాకెప్పుడు జ్వరం వచ్చినా అనుకోకుండా అమ్మ వచ్చేది ఆవిడొచ్చిందంటే జ్వరం జారిపోయేది

'భలేవాడివేలే - నీ కూతురు పురిటికొస్తుందని నువ్వు రాను పొమ్మంటున్నావు గానీ నీ చెల్లెలు కూతురు పెళ్లి కుదిరిందని మర్చేపోయావు పల్లెటూళ్లో పెళ్లంటే మాటలా? ఎన్ని చూసుకోవాలి? అన్నీ ఈ పట్నం నుంచి లాంచి మీద లక్కుపోవాల్సిందే - మొహం తిప్పుతూ మాట్లాడుతుంటే అమ్మ ఎఱ్ఱ పొళ్ల దుద్దులు తళుక్కు తళుక్కుమంటున్నాయి

అసలే జమాబందిల రోజులు - మీ నాన్నగారికి తిండి తిప్పలు అక్కర్లేదు ఆ మధ్య ఏమయిందనుకున్నావ్ కన్నా ఆవిడ దొరణిలో చెప్పుకుపోతూనే ఉంది

నాకు అమ్మ చెప్తున్నదేమీ బుర్రకెక్కడంలేదు కాని సెలయేరు పరవళ్లు తొక్కుతూ కొండరాళ్ల మీంచి జారి నాట్యం చేస్తున్న లయలు వినిపిస్తున్నాయి మధుర గాయకుడెవరో ఆరోహణలో త్వరితగతిన వేస్తున్న సరిగతులు వినిపిస్తున్నాయి

సుభద్రా వాడికెలాగూ ప్రాప్తంలేదు జున్ను పిల్లలకైనా పెట్టు ఏంటో జున్ను తొందరలో ఈసారి అరిశెలు కూడ తేలేకపోయాను చిట్టిగాడేదుస్తాడో ఏమో!

నాన్నమ్మా నీ కొడుకు కోసం తెచ్చావుగానీ మాకెప్పుడైనా ప్రత్యేకంగా తెచ్చావే - చిట్టిగాడు వాళ్ల మామ్మని వెక్కిరిస్తున్నాడు

పోరా భడవకానా కాలేజి చదువుకొచ్చి తెలివితేట లెక్కువయ్యాయి నా కొడుకు మీ నాన్న కాదుట్రా! సుభద్రా! కాస్త వేణ్ణీళ్లు పెట్టు తడి గుడ్డతో వళ్లంతా తుడుస్తాను పిచ్చి సన్యాసి నిద్రపోయాడు ఏమిటో నా ప్రాణమంతా వీడి మీదనే వుంటుంది వారానికో ఉత్తర ముక్కయినా రాయడు పోనీ సెలవులకి పిల్ల వెదవల్ని తీసుకుని రావచ్చుగా - మాయదారి ప్రైవేట్లు కాదు గానీ పట్నం వదలడు మొన్నటికి మొన్న ఆరు చెట్ల కొబ్బరి బొండాలు దింపించాను కాని పిల్లలంతా ఇక్కడుంటిరి అక్కడ్నుంచి తెచ్చే నాధుడేడీ! అడదాన్ని ఎన్నని మోసుకురాను

లేచి - మీరు స్నానం చెయ్యడంత్తయ్యా



# రిఫ్రిజిరేటర్లన్నీ ఒకే పద్ధతిలో తయారుకాలేదు



## జపాన్ సాంకేతిక పరిజ్ఞానం వల్లనే ఆల్విన్‌కు ప్రత్యేకమైన ప్రత్యేకత ఏర్పడింది.

సాటిలేని నిరంతర సేవ మేటిలేని పనితనం నిశ్చలమైన నిశబ్దమైన సమర్థత

అవే కొత్త ఆల్విన్ 2000 ఎస్ ఎల్ సీరీస్ రిఫ్రిజిరేటర్లు మీ కోసం జపాన్‌వారి సాంకేతిక పరిజ్ఞానం మరియూ గ్యారంటీతో లభిస్తున్నాయి

హిటాచీవారి లైసెన్సుతో తయారు చేయబడిన కంప్రెస్సర్ సాఫీగా నిశబ్దంగా పనిచేస్తుంది

అత్యుత్తమమైన రోల్‌బాండ్ ఫ్రీజర్ అతి ఎక్కువ చల్లదనాన్ని అతి తక్కువ వ్యవధిలో ఇస్తుంది

ఆల్విన్ 10 శాతం తక్కువ విద్యుచ్ఛక్తి వినియోగిస్తుంది

170 నుండి 250 వోల్ట్స్ విద్యుచ్ఛక్తికి తగినట్లు తయారుచేయబడినది కనుక వోల్టేజ్ స్టెబిలైజర్ ఉపయోగించ నక్కరలేదు

స్వయంగా నీరు తోడివేసుకొనే పద్ధతి ఉన్నందువలన డీఫ్రాస్టింగ్ మరింత సులభం

ఆల్విన్ రిఫ్రిజిరేటర్లు 85 165 300 లీటర్స్ సింగిల్ డోర్ మోడల్స్‌లోను, మరియు 165, 300 380 లీటర్స్ డబుల్‌డోర్ మోడల్స్‌లోను లభిస్తున్నాయి

వివిధ రకాల్లో, సైజుల్లో మీ ఎంపికకోసం

మీకు జీవితాంతం అతి త్వరితమైన సేవ దేశమంతటావున్న ఆల్విన్ డీలర్లద్వారా లభిస్తుంది

అందుకోసమే

7 సంవత్సరాలు గ్యారంటి




## ఆల్విన్

2000 ఎస్ ఎల్ రిఫ్రిజిరేటర్లు




హిటాచి వారి నుండి లైసెన్సు పొందినది

HITACHI

### అన్ని సమయాలకు ఆల్విన్

ఆల్విన్ ఏరియా సేల్స్ ఆఫీసులు ఈ దిగున స్థలాలలో వున్నాయి

అహమ్మదాబాద్ బెంగుళూరు భోపాల్ భువనేశ్వర్ బొంబాయి కలకత్తా చండీఘర్ ఢిల్లీ ఎర్నాకులం గౌహతి ఘజియాబాద్ హైదరాబాద్ జైపూర్ కాన్‌పూర్ మద్రాసు పాట్నా విజయవాడ మరియు విశాఖపట్నం




**జి యమ్–కాకినాడ**

నేను సుమారు 10 సం క్రితం పళ్ళు గారపడితే దంత వైద్యునిచేత దంతాలు క్లీన్ చేయించాను ఇది జరిగిన కొన్నాళ్ళకి పై పళ్ళు మాత్రమే సలుపు పెట్టడం ప్రారంబించి క్రమంగా ఒక్కొక్క పన్నే ఊడిపోవుట ప్రారంబించినది క్రింది వరుస పళ్ళు మాత్రము చాలా గట్టిగాను ఎ బాదా లేకుండా ఉన్నాయి నా వయస్సు 45 సం లు పై వరుస పళ్ళు తీయించేసి కట్టించుకున్నందు వల్ల ఎమైనా ఉపయోగము ఉంటుందా? పై వరుసలో ఇంకా 5 పళ్ళు మాత్రమే మిగిలి ఉన్నవి

దంతాలను పరిశుభ్రపరచటానికీ అవి ఊడిపోవటానిక సంబందం లేదు మీరు నిపుణులైన దంత వైద్యులను సంప్రదించి వారి సలహా ప్రకారం కృత్రిమ దంతాలను కట్టించుకోవటం సబబు

**టి వి ఎస్ సి–విశాఖపట్నం**

నాకు సం నుండి ఒక బీజము వాచింది నొప్పి కూడా వచ్చేది డాక్టరును సంప్రదించగా నొప్పి తగ్గినది కాని వాపు మానలేదు

వాపు మానటానికి శస్త్రచికిత్స అవసరం

**బి కె ఆర్– ఏలూరు**

చిన్నపిల్లలకి విరేచనాలు వస్తే ముందుగా ఎమి చెయ్యాలి?

చంటిపిల్లలకి విరేచనాలు ఏర్పడితే వెంటనే వైద్యులక చూపించటం అవసరం కానీ ఆ లోపలే ప్రధమచికిత్సగా పిల్లల శరీరంలోని నీటి ప్రమాణం తగ్గకుండా చూడటం ఎంతైనా అవసరం

ఒక లీటర్ నీటిలో 35 గ్రాముల ఉప్పు; 25 గ్రాముల వంటసోడా 15 గ్రాముల పొటాషియం క్లోరైడ్ 20 గ్రాములు గ్లూకోజు కలిపిన మిశ్రమాన్ని వెంట వెంటనే శిశువుక ఇవ్వాలి శరీరం నుంచి ఎంత నీరు బయటికి పోతే అంత నీరు శరీరంలోక ఇవ్వాలి

పై మిశ్రమం అందుబాటులో లేకపోతే ఎడకెడు పంచదార ఒక చిటికెడు ఉప్పునూ ఒక గ్లాసు నీటిలో వేస ఇస్తే మంచిది

వైద్యుల సలహా ప్రకారం లోనికి మందులు వాడాలి

**టి ఆర్ ఆర్–గుడివాడ**

తలలో పొట్టు వస్తూ ఉంటుంది దురద కూడా ఎక్కువగా ఉంటుంది జుట్టు క్రమేపి పల్చబడుతూ ఉంది

దీనిని డాన్ డ్రఫ్ అని అంటారు ఇది ఒక ఫంగస్ అనే సూక్ష్మక్రిమి వల్ల ఏర్పడుతుంది

పై పూతగా సెల్‌సన్ అనే షాంపూ వాడటం లోనిక గ్రైసియో ఫల్విన్ మందు వైద్యుల సలహాపై వాడటం దువ్వటానిక వెడల్పు పళ్ళు (దూర దూరంగా ఉన్నవి) గల దువ్వెనలను వాడటం తీసుకోతగు చర్యలవుతాయి □

గుప్పెడు బియ్యం పొంగిస్తాను సుబ్బ అబిమానంగా అంది

నా తిండికేంలే కాస్త జావకాచి మజ్జిగ కలిపి ఇస్తే నోటికి హితవుగా వుంటుంది పిడికి నిమ్మకాయ ముక్కేమన్నా ఉందా? ఉండు నువ్వేం చేస్తావు గాని నేనే వస్తాను - నేను వద్దనేలోగా నా నుదుటి మించి చెయ్యి తీసుకుని అమ్మ వెళ్ళిపోతోంది

అమ్మా! - నాకు మళ్ళీ ఒళ్ళు బాగా వేడెక్కిపోతోంది ఒళ్ళు విపరీతంగా నొప్పులు

జావ సుబద్ర కాస్తుందిలే కాసేపు నువ్వు నా దగ్గరే కూర్చో విపరీత మైన నీరసం అవహిస్తోంది నన్ను -

మావయ్యగారూ -

ఏవండీ

బలవంతాన కళ్ళు తెరిచాను - ఎదురుగా సుబద్ర పెద్దల్లుడు శేఖరం

ఎలా వుందిప్పుడు అతని గొంతులో ఆత్రుత

అమ్మని పిలు సుబద్రా! అల్లుడెప్పుడొచ్చాడు నా మాటలకి సుబద్ర బయం బయంగా చూస్తోంది

అమ్మ ఏమిటి మావయ్యగారూ! కలేమైనా వచ్చిందా! అత్తయ్య ఒకటే గాబరా పడుతున్నారు

గాబరా కాక ఎమిటి బాబూ! రాత్రంతా అమ్మా

## ఛాయారాగం

అంటూ ఒకటే కలవరింతలు మా అత్తగారు కల్లోక వచ్చారో ఏమో! చచ్చిపోయినావిడ పేరు తలుస్తుంటే నా గుండె లవిసిపోతున్నాయి

ఎవరో చెంపమీద చెళ్ళున చరిచినట్లయింది

అమ్మ అమ్మ - చచ్చిపోయిందా అవును అవును అవును! ఆరేళ్ల క్రితం పోయిన అమ్మ బ్రతికున్నదానిలా ఎంత స్వాబావికంగా ఉంది కల అమ్మ పోయినట్టే గుర్తు రాని కల ఎంత అద్భుతంగా ఉంది

చేదు నిజం తెలుసుకున్నట్టు నాలో ఆరాటం పొంగింది అమ్మ లేదా! మరి నా జ్వరం అవును కదూ ఎప్పుడు జ్వరమొచ్చినా ఉండేది అమ్మ తన చల్లని స్పర్శతో జ్వరాన్ని మాయంచేసేది నాకి మద్య జ్వరం రాలేదు అమ్మ పోక ముందు వచ్చిన జ్వరమే

కాని కలయినా ఇది అద్భుత రాగం చాయారాగం చాయా మాత్రమే తేడా అయినా అచ్చం అలానే అన్పించింది

నాకెందుకో పక్కింటి సంగితం మేస్టారి మాటలు గుర్తొచ్చాయి

ఈ చకటి ఈ రాతిరి ఎటుల వేగునో ప్రియా ఎవరో శిష్యుడికి నేర్పిస్తున్న లలితసంగీతం విని

మాస్టారూ ఇది శివరంజని రాగం కదూ!

కాదు రావుగారూ దాని చాయలున్న మరో రాగం గ్రహబేదం వల్ల అలానే అన్పిస్తుంది ఒక్క స్వరం మాత్రం తేడా

సంగితం మాస్టారు ఆ రోజు చెప్పిన ఆ రాగం పేరేమిటో నాకు గుర్తులేదు

కాని ఈ కల మాత్రం చాయా రాగమే

ఆరేళ్ల తర్వాత మా అమ్మ కలలోకొచ్చిందనే ఆనందం కంటే మా అమ్మ చచ్చిపోయిందన్న నిజమే నన్నెక్కువ బాదిస్తోంది

అమ్మా నా చెంపల వెంబడి కన్నీళ్ళు వరదలా జారి పడిపోతూంటే మృదువుగా కొంగుతో తుడుస్తోంది సుబద్ర నా జుట్టు వెనక్కు తోస్తోంటే కడలి కెరటంలా ఎంతో ఎత్తుకు ఎగిసిన ఉప్పెనలా నాలో దుఃఖం

హమ్మయ్య కళ్ళు తెరిచారు మనలో పడ్డట్టే పెద్దల్లుడు శేఖరం ఓదార్పుగా సుబద్రతో అంటున్నాడు

సూరి మాస్టారూ! గ్రహబేదం అంటే నాకప్పు డర్థమయింది □

బొమ్మల సీరియల్



సీక్రెట్ ఏజంట్
విక్రమ్
4




అవును ఎమిటది?
నా జేబులో ఉన్న బీపర్ అది అంటే ఇక్కడికి దగ్గరలో నే ఒక శక్తివంతమైన రేడియో ట్రాన్స్‌మిటర్ ఉందన్న మాట!
బీప్ బీప్




ఆ శబ్దం మరింత పెద్దదైంది–
మనం సరైన దిశలో నే వెళుతున్నాము!
బీప్ బీప్




అనంతరం
తెలిసింది! మన లక్ష్యానికి వగ్గరలో నే ఉన్నామనిపిస్తున్నది!




అంతలో నే వారికి ఒక ఎత్తైన గోడ ఎదురైంది–
!?




మార్టిన్ ఒక తాడుని బయటికి తీసాడు–
ఈ తాడుతో ఆ ముళ్ల తీగెకి ఉచ్చు వేస్తాను మనం పైకి ఎక్కవచ్చు
ఆగు! ఈ అల్యూమినియం కడ్డితో అసలదేమిటో చూస్తాను!




విక్రమ్ ఆ కడ్డిని విసిరాడు –
క్రాక్ లేల్!
చూసావా? దాంట్లో కరెంటు ఉంది! వెయ్యి వోల్టులకి పైనే ఉంటుంది!
1983




మనం లో పలికి వెళ్లడానికి మరోమార్గం ఆలో చించాలి నా వెంబడే రా




ఈ చెట్టు కొమ్మలు గోడ మీదుగా అటు వైపుకి ఉన్నాయి మనం దీని పైకి ఎక్కి అటువైపుకి దూకుదాం!
బలే ఆలోచన!




ఇప్పుడు –
మొదట నేను దూకుతాను!
అలాగే
(ఇంకా ఉంది)

# ఫిల్మోత్సవ్ '86 లో డాక్యుమెంటరీ చిత్రం "కలంకారి"

హైదరాబాద్‌లో 1986 జనవరి 10వ తేది నుండి 24వ తేదివరకు జరిగిన ఫిల్మోత్సవ్ 86లో భారతీయ పనోరమ విభాగంలో శ్రీ మన్‌మోహన్ దత్ దర్శకత్వం వహించిన కలంకారి డాక్యుమెంటరీ చిత్రం ప్రదర్శనకు ఎంపిక చేయబడింది

ఆంగ్లంలో పద్దెనిమిది నిమిషాల పాటు ప్రదర్శింపబడిన ఈ ఈస్ట్‌మన్ కలర్ డాక్యుమెంటరి చిత్రం లేపాక్షి చిత్ర వారిచే నిర్మింప బడింది శ్రీ మన్‌మోహన్ దత్ స్క్రిప్ట్ దర్శకత్వం శ్రీ సన్ని జో... ఛాయాగ్రహణం డా ఎ ఎస్ రామన్ మాటలు శ్రీ ... కె కృష్ణన్ శ్రీ బినాపాల్ ఎడిటింగ్ శ్రీ అరవిందన్ సంగీతం శ్రీ జి ఎస్ గోపాల కృష్ణన్ నేపథ్యం శ్రీ దేవదాస్ శబ్దగ్రహణం శ్రీ శ్రీపతి శ్రీ మన్ మోహన్ నిర్మాణ నిర్వహణ కలంకారి కళని గురించి ఈ చిత్రం వివరిస్తుంది



'కలంకారి' డాక్యుమెంటరి చిత్రం దర్శకుడు శ్రీ మన్‌మోహన్‌దత్

'ఆకాంక్ష' సినిమాలో నటించిన కొత్త అమ్మాయి సుమతి



ప్రస్తుతం శ్రీ మన్ మోహన్ దత్ ఆచార్య ... గారు నపై ఒక డాక్యుమెంటరీ చిత్రాన్ని ...యడానికి పూనుకున్నారు ...టీవల నూతన ...టీసట వర్ణంతో నాగార్జునసాగర్ డాని పరిసర ప్రాంతాలలో ఆకాంక్ష అనే ఫీచర్ చిత్రానికి షూటింగ్ పూర్తి చేసారు ఈ చిత్రంలో గుంటూరుకి ...ందిన సుమతి అనే కొత్త అమ్మాయి నటించింది ఈమె శ్రీలంక సినిమాలలో వేసింది శ్రీ అరవిందన్‌తో "కాంచన సీత అనే చిత్రానికి శ్రీ దత్ పని చేసారు

ప్రస్తుతం శ్రీ దత్ హైదరాబాద్ లోని ఫేకల్టీ ఆఫ్ ...న్ ఆర్ట్స్ జవహర్‌లాల్ నెహ్రూ టెక్నలాజికల్ విశ్వ విద్యాలయంలో చిత్రలేఖనం బోధిస్తున్నారు

శ్రీ మన్ మోహన్ దత్ చిత్రలేఖనం (పెయింటింగ్)లో పోస్టు గ్రాడ్యుయేట్ డిగ్రీ పొందారు గత రెండు దశాబ్దాలుగా చిత్రలేఖనం అభ్యసిస్తూ భారత దేశంలో జరిగిన ఎన్నో ప్రదర్శనలలో పాల్గొన్నారు గౌరవనీయమైన అవార్డులను స్వర్ణ పతకాలను గెలుచుకున్నారు దేశ విదేశాలలోని మ్యూజియంలలో ఈయన వేసిన చిత్రాలు చోటు చేసుకున్నాయి

కలంకారి 35 ఎమ్ ఎమ్ లో డాక్యుమెంటరి చిత్రం ఈ చిత్రం లేపాక్షి చిత్ర వారి మొట్టమొదటి సాహస యత్నం కలంకారి అనేది ఆంధ్ర ప్రదేశ్‌లోని సాంప్రదాయక కళా స్వరూపం కోస్తా ఆంధ్రాలో కలంకారి వస్త్రములు 16వ శతాబ్దం ప్రాంతంలో ఆవిర్భవించాయి ఈ కలంకారి పని కుతుబ్ షాహి రాజులచే బాగా ప్రోత్సహించబడి ఇరాన్‌కు తదితర పశ్చిమాసియా దేశాలకు ఎగుమతి చేయబడుతూ ఉండేది తరువాత పోర్చుగీసు వారు ఇంగ్లీషు వర్తకులు ఎగుమతి చేసి దూర ప్రాచ్య దేశాలకు యూరోపియన్ మార్కెట్‌కి దీనిని పరిచయం చేసారు వాస్తవానికిది దీని మాతృ స్థానంలో పూర్తి గా అదృశ్యమయ్యింది ఇటీవల కొందరు చేతి పని వృత్తుల ప్రోత్సాహకులచే తిరిగి పునరుద్ధరింప బడింది — (ఒ వి)

## సుమన్ "ఉక్కు సంకెళ్ళు" త్వరలో విడుదల

డిసెంబర్ 19 నుంచి నెలాఖరు వరకు జరిగిన షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తయింది ఫిబ్రవరి విడుదల అన్నారు పి చంద్రశేఖరరెడ్డి ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో షేక్ షజులుల్లా హాక్ నిర్మించిన ధర్మ విజయ ఎక్సర్ ఉక్కు సంకెళ్ళు లో సుమన్ పవిత్ర అర్చన గుమ్మడి రమణమూర్తి పద్మనాభం రాళ్ళపల్లి సత్యరాజ్ వినోద్ రాజశేఖరరెడ్డి సిలోన్ మనోహర్ స్మిత పండరిబాయి లక్ష్మి సురేఖ సరోజ విజయలక్ష్మి మున్ని నటించారు సాయినాద్ మాటలు ఆత్రేయ పాటలు రాశారు రాజ్ కోటి సంగీతం దశరథ రామయ్య ఛాయ రంగారావు శిల్పం అంకిరెడ్డి కూర్పు కృష్ణారెడ్డి – మదన్‌మోహన్ సహకార దర్శకత్వం ఎ రఘురామ్ ప్రొడక్షన్‌తో కె ధ్రువకుమార్ ఎ హెచ్ కృష్ణకుమార్ నిర్వహణ బాధ్యతలు వహించారు ఎ లీలాచంద్రశేఖరరావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ షేక్ రహతుల్లా షేక్ షంషుద్దీన్ సహ నిర్మాతలు సమర్పణ ఎస్ అబ్దుల్ ఖాదర్

## శివశక్తి ఆర్ట్స్ చిత్రం తొలి షెడ్యూల్

పౌరాణికం కలగలిపిన జానపదం నెమలి పాము పోరాటం గగుర్పాటు కలిగిస్తుంది జనవరి 5 నుంచి 11 వరకు మొదటి షెడ్యూల్ పూర్తి చేశాం మిగతా షెడ్యూల్ జనవరి 20 నుంచి 26 ఫిబ్రవరి 2 నుంచి 9 వరకు అన్నారు బి వి శ్రీనివాస్ ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో శివశక్తి ఆర్ట్స్ అధినేతలు కె మహేంద్ర కె ప్రకాష్ ప్రచండ భైరవి అనంతరం నిర్మిస్తున్న తాజా చిత్రంలో నరసింహరాజు నళిని వంకాయల జీవా రాళ్ళపల్లి నర్రా జయమాలిని అనూరాధ నారదుడుగా నూతన్ ప్రసాద్ నటిస్తున్నారు పేరాల కథ మాటలు రాశారు రాజశ్రీ గీతాలకు శంకర్ గణేశ్ బాణీలు కూర్చారు ఆర్ చంద్రన్ ఛాయ నాగరాజన్ శిల్పం దిలీప్ సహకార దర్శకత్వం ప్రసాద్ ప్రొడక్షన్ ■ ఉదయకుమార్ నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు

## త్రిపురనేని వరప్రసాద్ దర్శకత్వంలో కె రాఘవ నిర్మించే "ఈ ప్రశ్నకు బదులేది?"

నాలుగు జంటల మధ్య నడుస్తుంది పటిష్టమైన ఈ కథ రంగనాద్ ప్రభ ఒక జంట మిగతా పాత్రలకు హైదరాబాద్‌కు చెందిన కళాకారులను ఎంపిక చేస్తాం అన్నారు త్రిపురనేని వరప్రసాద్ ఈయన దర్శకత్వంలో ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ అధినేత కె రాఘవ నిర్మించే చిత్రానికి డిసెంబర్ 23 న జె వి రాఘవులు స్వరకల్పనలో సి నారాయణరెడ్డి రాసిన గీతం ప్రతాప్ రికార్డింగ్ థియేటర్‌లో ధ్వని ముద్రితమైంది

లక్ష్మీ ఫిలింస్ డివిజన్ ప్రొడక్షన్ నెం 3 చిత్రంలో అర్చన, భానుచందర్





టాల్‌స్టాయ్ పాత్రలో నటుడు దర్శకుడు సెర్గి గెరాసి మోవ్

## భారతదేశంలో విడుదల కానున్న రష్యన్ చలన చిత్రం "లియో టాల్‌స్టాయ్'

చెకోస్లావేకియా సోవియట్ దేశాలు కలిసి సంయుక్తంగా ప్రఖ్యాత రష్యన్ రచయిత లియో టాల్‌స్టాయ్ జీవిత చరిత్రను వర్ణ చిత్రంగా రూపొందించారు ప్రఖ్యాత రష్యన్ నటుడు దర్శకుడూ సెర్గి గెరాసిమోవ్ ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే దర్శకత్వం వహించడంతో పాటు లియో టాల్‌స్టాయ్ పాత్రను అద్భుతంగా పోషించారు

టాల్‌స్టాయ్ జీవితంలోని చివరి సంవత్సరాల సంఘటనల నాధారం చేసుకొని ఈ చిత్రం రూపొందించబడింది

పీడిత ప్రజల పతితుల బాధలను తనవిగా భరిస్తూ ప్రపంచంలో అధర్మం క్రౌర్యం హింస వున్నంత వరకూ తాను శాంతియుతంగా జీవించలేనని ఆత్మ పరిశుద్ధత జీవితానికి సారమూ లక్ష్యమూ అని టాల్‌స్టాయ్ అభిప్రాయం

అత్యంత ప్రాచీన సంస్కృతిగల భారతదేశం టాల్‌స్టాయ్‌ని సదా ఆకర్షించేది టాల్‌స్టాయ్ మహాత్మాగాంధి తమ గాఢ పరస్పర ప్రయోజనాలతో అతి సన్నిహితులై పరస్పరం ఉత్తర ప్రత్యుత్తరాలను జరిపారు ఆ ఉత్తర ప్రత్యుత్తరాల నుండి టాల్‌స్టాయ్ భావ ప్రతిస్పందనలను దర్శకుడు గెరాసిమోవ్ గమనించారు

మానవ జీవిత పరమార్థం గొప్పదనాన్ని సంపన్నతనూ ఖ్యాతినీ పొందడం కాదు ఆత్మను ప్రదిలపరచుకోవడమే నన్న టాల్‌స్టాయ్ సూక్తిని కేవలం వినడమే కాక సదా మననం చేయాలనే సందేశంతో ఆ మహా రచయిత రూపాన్ని తెరపై గెరాసిమోవ్ పునప్రతిష్ఠ చేశారు లియో టాల్‌స్టాయ్‌గా గెరాసిమోవ్ నటన ఆయన జీవితంలో ఓ మైలురాయి

కార్లోవీ వేరి అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో గ్రాండ్‌ప్రే బహుమతి నందుకొన్న ఈ చిత్రం త్వరలో భారతదేశపు వెండి తెరలపై ప్రదర్శింపబడబోతోంది

మహా రచయిత టాల్‌స్టాయ్ జీవిత చిత్ర కథ భారత ప్రేక్షకులకు కనుల పండువే □



"లియోటాల్‌స్టాయ్"లో గ్రామీణ పాఠశాల దృశ్యం

## పి చంద్రశేఖరరెడ్డి, ఎన్ వి సుబ్బరాజు కాంబినేషన్‌లో "పరాశక్తి"గా మాధవి

దక్షతగల నిర్మాత అనిపించుకోవడం చాలా కష్టం నిరంతర శ్రమ పథకాలు పద్ధతులు అన్నిటికి మించి ఓర్పు ఎంతో అవసరం ఇవన్నీ గల వ్యక్తి ఎన్ వి సుబ్బరాజు ఈయన కథ సమర్పణలో రూపొందుతూన్న శ్రీవాణి క్రియేషన్స్ తాజా చిత్రం పరాశక్తి ఇతివృత్తం గురించి ఇలా తెలియ చేశారు పిల్లికూనను నాలుగు గోడల మధ్య ఉంచి నలుగురూ చిత్రహింసలు పెడితే అది పులిగా



విదేశీయులకన్నా సెక్స్ సన్నీ మనమే బాగా తీయగలం అనిపించిందోయ్!

మారుతుంది. తన తండ్రిని అంతమొందించి, తమ కుటుంబాన్ని నాశనం చేసిన వారిమీద ప్రతీకారం తర్చుకోడానికి ఒక అబల పరాశక్తిగా మారుతుంది అన్యాయాలను అక్రమాలను తుదముట్టించడానికి ప్రతి అబల సబలగా మారాలని నిరూపించే పాత్రలో మాధవి అమోఘంగా నటిస్తోంది మూడు షెడ్యూల్స్‌గా ఫిబ్రవరికి చిత్రీకరణ ముగిసి ఉగాదికి విడుదలయ్యే ఈ చిత్రంలో మాధవి కపిల్‌దేవ్ నూతన్ ప్రసాద్ వినోద్ వేలు జయప్రకాష్‌రెడ్డి ఆదిగాగలవారు పాల్గొంటున్నారు పూసల మాటలు రాజ్ కోటి సంగీతం ఎన్ ఎస్ రాజు ఛాయ గౌతంరాజు కూర్పు మదన్‌మోహన్ సహకార దర్శకత్వం టి వి కృష్ణ సహాయ దర్శకత్వం రత్నారావు ప్రొడక్షన్‌తో ఎన్ ఆర్ రాజు నిర్మిస్తున్న ఈ చిత్రానికి ఎ చంద్రశేఖరరెడ్డి స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు

## విజయనిర్మల దర్శకత్వంలో కృష్ణ, నరేష్ నటించే కోగంటి విశ్వేశ్వరరావు చిత్రం

తిరఘై – అనే హిట్ అయిన తమిళ చిత్రం ఆదారం అన్నారు విజయనిర్మల ఈమె దర్శకత్వంలో శ్రీ పంచవటి చిత్రాలయ కంబైన్స్ అదినేత కోగంటి విశ్వేశ్వరరావు నిర్మించే చిత్రం జనవరి 3న సెట్స్‌కు వెళ్లింది కృష్ణ–రాద నరేష్–రాదిక కె ఆర్ విజయ నూతన్‌ప్రసాద్ అల్లురామలింగయ్య వీరబద్రరావు రాళ్ళపల్లి శుబలేఖ సుదాకర్ ప్రబృత తారాగణం సతానంద్ మాటలు వేటూరి పాటలు వి రాపువులు సంగితం పుష్పాల గోపీకృష్ణ ఛాయ, ఆదుర్తి హరినాధ్ కూర్పు నిర్వహిస్తున్నారు. మార్చిలో చిత్రకరణ సమాప్తమౌతుంది.



వేట లో జయప్రద

## "రాముడేలిన రాజ్యంలో" కట్టా దర్శకత్వంలో మోహన్‌బాబు

బావగర్భితమైన డైలాగ్స్‌ను అనకాపల్లి తెలుగుదేశం పార్టీ శాసనసభ్యులు దాడి వీరబద్రరావు సమకూర్చారు అన్నారు కట్టా సుబ్బారావు ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో ఎన్ దర్మయ్య కె వెంకటకన్నయ్య నిర్మించే కమలాలయ ఆర్ట్ ఎక్సుర్స్ వారి పై చిత్రంలో మోహన్‌బాబు సత్యనారాయణ రావుగోపాలరావు గిరిబాబు కోట శ్రినివాసరావు జయసుద దేవి వై విజయ అన్నపూర్ణ పాత్రదారులు జనవరి 20 నుంచి 30 ఫిబ్రవరి 20 నుంచి 28 మార్చి 20 నుంచి 30 వరకు మూడు షెడ్యూల్స్‌లో చిత్రికరణ ముగుస్తుంది

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## పాఠకులకి అగ్ర కథానాయిక జయసుధ సమాధానాలు!



తెలుగు సనిమా ప్రేక్షకుల ఆదరాబిమానాలని విశేషంగా చూరగొన్న ప్రముఖ నటీమణి జయసుద ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకుల ప్రశ్నలక సమాదానాలు ఇస్తారని తెలియ చేయటానికి సంతోషస్తున్నాము త్వరలో ప్రారంబం కాబోయే ఈ శర్షికకి పాఠకులు అర్దవంతమైన ప్రశ్నలని మాత్రమే పంప గోరుతున్నాము వారం వారం ప్రచురింపబడే ఈ శీర్షికలో ప్రతివారం జయసుధ ఎన్నిక చేసిన ఉత్తమ ప్రశ్నని పంపినవారికి ఆటోగ్రాఫ్‌తో ఉన్న ఆమె అందమైన ఫొటో బహుమతిగా లబిస్తుంది ప్రశ్నలు పంపేవారు తమ ప్రశ్నని ఈ కింది కూపన్‌లో స్పష్టంగా సిరాతో లేదా బాల్‌పాయింట్ పెన్‌తో రాసి తమ పేరు పూర్తి చిరునామాతో సహా జయసుద సమాదానాలు శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక గాందినగరం విజయవాడ– 520003 అన్న చిరునామాకి పంపాలి ఒక కూపన్‌లో ఒక ప్రశ్నని మాత్రమే రాయాలి విడిగా రాసి పంపినవి పరిశీలింపబడవు

పాఠకులు ఉత్సాహంతో ఈ అవకాశాన్ని వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము

కూపన్

### ఆంధ్రసచిత్రవారపత్రిక

### జయసుధ సమాధానాలు

ప్రశ్న

పంపినవారి పేరు

పూర్తి చిరునామా

# మా నలుగురం ఒక అన్యోన్య కుటుంబం!



మా కుటుంబానికి మొదటి చేరిక మా పెళ్లయిన రెణ్ణెల్లకే వచ్చింది. అదే, మిలమిలా మెరిసిపోయే కొత్త గోద్రెజ్. ఆ తర్వాత కొన్నేళ్లకి దీపక్ పుట్టాడు. వాడికిప్పుడు 12 ఏళ్లు. ఈ మా నలుగురం కలిసి మెలిసి ఎంత సరదాగా కాలం గడుపుతూ వస్తున్నామో!

గోద్రెజ్‌ని మా కుటుంబ సభ్యులలో ఒకరిగా మేము చూస్తున్నామంటే దీని మీద మాకంత విశ్వాసమన్నమాట.



అగ్రగామి అయిన ఈ రిఫ్రిజిరేటర్ కలకాలం నిలిచే విలువల ఆధారంతో తయారైనది. ఒక తరం మంచి మరొక తరం దాకా నిలిచి పనిచేయగలది. అందుకే, గోద్రెజ్‌ను మా యింటికి తెచ్చుకున్నప్పుడే మాకు తెలుసు, ఇది బహుకాలం సాగే అనుబంధమని!

**బహుకాలం మీకు విశ్వాసపాత్రం**

**Godrej® రిఫ్రిజిరేటర్**

మేలైన శాస్త్ర పద్ధతిలో ఉత్పత్తులు
కలకాలం నిలిచే విలువలు



"అనసూయమ్మగారి అల్లుడు"లో
బాలకృష్ణ, భానుప్రియ

## శోభన్‌బాబు, రాజాచంద్ర కాంబినేషన్‌లో కోనేరు - రవీంద్రనాథ్ చిత్రం

శోబన్‌బాబు సరసన జయసుద రాద హీరోయిన్‌లు జనవరి ఫిబ్రవరి మార్చి నెలల్లో షూటింగ్ పూర్తవుతుంది అన్నాడు లోగడ ముద్ద మందారం నిర్మించిన కోనేరు రవీంద్రనాథ్ ఈయన విజయశ్రీ ప్రొడక్షన్స్ పతాకంలో నిర్మించే చిత్రం షూటింగ్ జనవరి 6 న మొదలైంది సత్యనారాయణ ప్రబాకరరెడ్డి గిరిబాబు వేలు రాళ్లపల్లి రమాప్రబ తతిమ్మా నటవర్గం జాన్సన్ మాటలు సత్యం సంగితం సురేష్ చాయతో కోటేశ్వరరావు సమర్పించే ఈ చిత్రానికి రాజాచంద్ర దర్శకుడు

కొనేరు రవింద్రనాద్ స్వియ దర్శకత్వంలో అమెరికాలో నిర్మించే చిత్రం మే 10న ప్రారంబమవుతుంది శరత్‌బాబు జయసుద సత్యనారాయణ గొల్లపూడి గుమ్మడి ప్రబాకరరెడ్డి

# సినిమా

గిరిబ బు వేలు రాళ్లపల్లి మాడా అదిగ గల వారు పాల్గొంటారు గొల్లపూడి మాటలు సత్యం సంగితం ఎం ఎ. రఘు చాయ తెరవెనుక హంగులు

## శోభన్‌బాబు, అర్జున్‌లతో పద్మావతి ఫిలిమ్స్ డివిజన్ నిర్మించే చిత్రాలు

విజయ బాపినీడు దర్శకత్వంతో శోబన్‌బాబు నటించే చిత్రాన్ని దీనికి ముందుగా రవిరాజా దర్శకత్వంలో అర్జున్ నటించే చిత్రాన్ని గుంటూరులోని ప్రముఖ పంపిణీ సంస్థ పద్మావతి పిక్చర్స్ అధినేత ఎ ఎస్ సుబ్బారావు తన మిత్రుడు కె రవీంద్రబాబుతో కలిసి పై పతాకంలో నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్నారు రవిరాజా దర్శకత్వం వహించే చిత్రంలో బానుప్రియ అర్జున్ రావు గోపాలరావు అల్లు రామలింగయ్య ప్రబృతులు పాల్గొంటారు సత్యమూర్తి కథ సంబాషణలు సమకూరుస్తున్నారు

## బాలకృష్ణతో విశ్వశాంతి వారి చిత్రం

బాలకృష్ణ తల్లిగా శారద మరో క్లిష్టమైన పాత్ర పోషిస్తారు జనవరి 16 నుంచి షూటింగ్ అన్నారు ఎ వి కె ప్రసాద్ ఈయన నిర్మించే విశ్వశాంతి ఎంటర్‌ప్రైసెస్ వారి చిత్రంలో రావుగోపాలరావు రంగనాద్ గొల్లపూడి సుదాకర్ నూతన్‌ప్రసాద్ పి ఎల్ నారాయణ అల్లు రామలింగయ్య రమాప్రబ ఇతర పాత్రదారులు ఎం డి సుందర్ కథకు పరుచూరి సోదరులు సంబాషణలు రాశారు వేటూరి గితాలను చక్రవర్తి స్వరపరిచారు నందమూరి మోహన్‌కృష్ణ ఛాయ తోట తరణి శిల్పం– హేమసుందర్ శిల్పం రఘురాం నృత్యాలు శివప్రసాద్ సహకార దర్శకత్వం నరసింహారావు కూర్పుతో కె మురళీమోహనరావు దర్శకుడు




## లలిత శ్రీ కంబైన్స్ అభినందన'

చాలా కాలం తర్వాత జమున గౌరవ పాత్రలో కనిపించే అబినందన చిత్రాన్ని అశోక్‌కుమార్ స్క్రీన్‌ప్లే ఛాయ దర్శకత్వంలో చలన చిత్ర పరిశ్రమతో చిరకాలంగా అనుబంధ బాంధవ్యాలున్న రమణమూర్తి నిర్మిస్తున్నారు డిసెంబర్‌లో మద్రాసులో మూడు రోజుల పాటు చిత్రీకరణ జరిగింది జనవరి 15 నుంచి 25 ఫిబ్రవరిలో 10 రోజులు మార్చిలో 10 రోజులు ఎప్రిల్‌లో ఊటి కొడైకెనాల్ మున్నార్ విశాఖపట్నం ( రోజుల షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది ఆత్రేయ మాటలు పాటలు రాశారు ఇళయరాజా సంగీతం తోట తరణి శిల్పం లెనిన్ కూర్పు యోగి సహదర్శకత్వం మాదురి నృత్యాలు మురళి ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు తారాగణం కార్తీక్ శరత్‌బాబు శోభన ఎ సోమయాజులు మున్నగువారు

## ముగ్గురు నాయికలతో చిరంజీవి, కోదండరామిరెడ్డి కాంబినేషన్‌లో "రాక్షసుడు"

చిరంజీవి సరసన సుహాసిని కన్నడ నటి జయమాలతో పాటు మరో యువతి నటిస్తుంది యండమూరి వీరేంద్రనాథ్ నవల ఆదారం జనవరి 21 నుంచి షూటింగ్ అన్నారు క్రియేటివ్ కమర్షియల్స్ అదినేత ఎస్ రామారావు ఈయన నిర్మించే రాక్షసుడు చిత్రంలో రావుగోపాలరావు రాజేంద్రప్రసాద్ గొల్లపూడి మారుతీరావు కన్నడ ప్రబాకర్ సంయుక్త అన్నపూర్ణ తక్కిన తారాగణం ఎం వి ఎస్ హరనాదరావు మాటలు వేటూరి పాటలు ఇళయరాజా సంగీతం లోక్‌సింగ్ చాయ శ్రీనివాసరాజు శిల్పం కొటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో ఎ కోదండరామిరెడ్డి స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాద్యతలు వహిస్తున్నారు □

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## పాఠకులకి ప్రత్యేక ఆకర్షణ!

కొత్త శీర్షిక

# అభిమాన తారలపై అభిప్రాయం!

తెలుగు చలన చిత్రరంగంలో ని తమ అభిమాన తారలపై పాఠకులు తమ తమ అభిప్రాయాలని వెల్లడించటానికి ఈ శీర్షిక వేదికగా ఉపయోగపడుతుంది

**ఉబయతారకమైన ఈ శీర్షిక పై వారం నించి ప్రారంబం అయి ప్రతి వారం ప్రచురింపబడుతుంది**

పాఠకులు తమ అభిమాన నటీనటుల వ తమకు గల అభిప్రాయాలని నటన పాత్రల విషయంలో వారికి మీరు అందించే నిర్మాణాత్మకమైన సూచనలని వివరిస్తూ పాపురావు సైజు పేజు (సుమారు 500 అక్షరాలు) మించకుండా కగితానికి ఒకవైపే రాసి తమ పోటో తో సహా మాకు పంపగోరుతున్నాము

రచన పోటోలని సంపాదకుడు ఆంధ్రసచిత్రవారపత్రిక గాంధినగరం విజయవాడ-520003 అన్న చిరునామాకు పంపాలి కవరు పైబాగంలో శీర్షిక పేరు అబిమాన తారల పై అభిప్రాయం అని రాయాలి

ప్రచురణార్హం కాని రచన పోటోలని తిప్పి పంపగోరేవారు తమ రచనతో పాటు తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవరు జతపరిచి పంపాలి వాటి విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు

ప్రచురింపబడిన వాటికి పారితోషికం ఉంటుంది

–సంపాదకుడు

పుప్పిపళ్లను ఎదుర్కోడానికి ఒక

# సూపర్ ఫైటర్

వుంటేనే సాధ్యం.






















ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్
ప్రసిద్ధ ఫోర్‌హాన్స్
రక్షణ అందిస్తుంది.




ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్ చిగుళ్లను బిగిస్తుంది. పుప్పిపళ్లను ఎదుర్కొంటుంది.

సీరియల్



# మనసుకు సంకెళ్ళు

ప్రమీలా జనార్దన్

(గత సంచిక తరువాయి)

సుద స్పృహ గోల్పోయినా రవి గురించి ఆలోచిస్తున్నట్టుగా మాట్లాడడంతో ఆమె కోలుకుంటుందనుకున్నాడు డాక్టర్ కిషోర్

చంద్రం పూర్తిగా బాగయ్యాడు చంద్రం సుదతో పాటు పార్కులో చూసిన యువకుడు

అతడి స్థితి బాగవుతుందనుకోలేదు తను అతడు సుదను పలకరించడం చూశాకే అతడు పూర్తిగా కోలుకున్నాడన్న నమ్మకం కుదిరింది కిషోర్‌కు

సాధ్యం కాదనుకున్న కేసు విజయం సాధిస్తే డాక్టర్ పొందే ఆనందం మాటల కందనిది

అందులో మానసిక రుగ్మత నుండి మనిషిని బైటపడెయ్యడమంటే ఒక లోకం నుండి మరో లోకంలోకి తెచ్చినట్లే అప్పుడా డాక్టర్‌కు కలిగే తృప్తి ఏ ధనరాసులు ఇవ్వలేనిది

చంద్రం రెండు నెలల క్రిందటే హాస్పిటల్‌లో చేరాడు

అతను పోస్ట్ గ్రాడ్యుయేట్

బి ఏ చదివాక వుద్యోగం దొరక్కపోవడం వల్ల తండ్రి అప్పుచేసి ఎమ్ ఎ చదివించాడు

జరిగిన కథ- 5 అప్పు అడగవచ్చిన పరందామయ్య గారితో తనే ప్రతిమని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నట్టుగా చెపుతాడు రవి సుదకు దూరం కావాలంటే తను వెంటనే వేరొకరిని పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు రవి రవి ప్రతిమల పెళ్ళి నిశ్చయమయింది ఈ విషయం తెలిసి సుద తండ్రి మోహనరావు తల్లి సుబద్రమ్మ సుదకి విషయం ఎలా చెప్పాలా అని మదనపడతారు ఊరి నుంచి వచ్చిన సుద ఆ రోజే రవికి పెళ్ళిందని తెలిసి కొయ్యబారిపోయింది అతనిని కలుసుకోడానికి పెళ్ళి జరిగిన గితామందిరానికి ఆమె వెళుతుంది రవి ప్రక్కన ప్రతిమని చూసిన సుదకు మళ్ళి మతి తప్పింది సుదను చూడను హాస్పిటల్‌కి వెళ్ళిన రవికి గతం గుర్తుకు వచ్చింది సుద నాట్యం అంటే రవికి ఇష్టం నాట్యప్రదర్శన ఇవ్వడానికి సుద విదేశాలకు వెళ్ళడానికి నిశ్చయించుకుంది నృత్య ప్రదర్శనలో కాలి ఎముక విరిగిన సుదకు జీవితమే శూన్యమవుతుంది రవి సాహచర్యంలో సుద తిరిగి కోలుకుంటుంది గతం నుండి తేరుకున్న రవి ఇంటికి వచ్చాడు హాస్పటల్‌కి వెళ్ళినందుకు ప్రతిమకి కోపం రాలేదని తెలుసుకొంటాడు సుద పరిస్థితి రవికి ఆందోళన కలిగిస్తుంది సుద బయంతో హాస్పిటల్ నుంచి పార్క్‌కి పరుగుతీసింది అక్కడ ఆమెకు ఒక యువకుడు తటస్తపడతాడు బయంతో ఆమె అతని చేతులలో స్పృహ కోల్పోతుంది

ఎమ్ ఎ అయ్యాక సంవత్సరంన్నర గడిచినా అతడికి ఉద్యోగం దొరకలేదు చంద్రం తర్వాత ఇద్దరాడ పిల్లలు తల్లిదండ్రుల గుండెల మీద కుంపట్లలా వున్నారు చంద్రానికి ఉద్యోగం వచ్చి తను తండ్రికి తోడ్పడలేనేమోనన్న వ్యధ మొదలయింది అదే అతడ్ని మానసికంగా కృంగదియ్యటంతో తను నిరుద్యోగిగా వుంటే ముమ్ముందు ఎలా వుంటుందో వూహించుకొన్న ప్రపంచంలోకి అడుగు పెట్టింది మనసు

ఆ ప్రపంచంలో అతడికి కష్టాలు కన్నీళ్ళు

తల్లిదండ్రుల తో బుట్టువుల నిరసన

చుట్టుప్రక్కలవారి పరిహాసాలు

అవన్నీ నిజంగా జరుగుతున్నట్టుగా ఏడ్వడం తల్లిదండ్రులను కొప్పడవద్దని అర్ధించడం ఓ మూల ఒంటరిగా కూర్చోవడం

అతడి చర్యలకు బయపడి తండ్రి ఫ్యామిలీ డాక్టర్ దగ్గరికి తీసుకెడితే అతడు డాక్టర్ కిషోర్‌కు చూపించమన్నాడు

అతడు హాస్పిటల్‌కు వచ్చినా మొన్న మొన్నటి వరకు ఒంటరిగా కూర్చోవడం ఏడ్వడం చేస్తూనేవున్నాడు వారం రోజుల నుండే అతడిలో మార్పు

గదిలోనే కూర్చోకుండా పార్కుకు వస్తున్నాడు తండ్రితో ఏవో పుస్తకాలు తెప్పించుకుని చదువుతున్నాడు తల్లిదండ్రులతో చెల్లెళ్ళతో ఇదివరకులా కుంచించుకుపోతూ మాట్లాడకుండా స్వేచ్ఛగా మాట్లాడుతున్నాడు

ఈ నిరుద్యోగ సమస్య ఎందరి యువకుల్నిలా చేస్తున్నదో! చంద్రం హాస్పిటల్‌కు వచ్చిన రోజున అతడి కుటుంబ పరిస్థితి తెలుసుకొని అతడు కోలుకోవడం కష్టమనుకున్నాడు కిషోర్

కాని చంద్రం తల్లిదండ్రులు చెల్లెళ్ళు తమ కష్టాలు బాదలు లెక్కచెయ్యకుండా అతడికి సహకరించారు చంద్రం ఆరోగ్యవంతుడయ్యాడు అయితే అతడు పూర్వపు స్థితినే ఎక్కువ రోజులు ఎదుర్కోవలసి ఫస్తే ఎలా ఉంటాడోనని కిషోర్ అనుమానం

ఆ అనుమానం అతడి రోజు సుదను పలకరించడం చూశాక తొలగిపోయింది

అతడు ఆమె ఎందుకో బాదపడుతోందని అనుకోడంలోనే అతడి మనసు మామూలు స్థితిలో వుందని తెలుస్తోంది తన ప్రపంచం నుండి బైటికి రానట్లయితే ఇతర్ల గురించి ఆలోచించగలిగే వాడు కాదు

అతడి పలకరింపుతో మనోనిబ్బరత ప్రస్ఫుటించింది అతడి చూపుల్లో దైన్యత లేదు చంద్రాన్ని గుర్తు చేసుకొంటూ అనుకొన్నాడు

తను అతడి కేసు విజయం సాధించినట్లే మరోసారి సంతోషంగా అనుకున్నాడు

సుద ఒకసారి దెబ్బతిన్న మనిషి ఆమె కోలుకోవాలంటే ఆమె కోరుకున్నది అందుతుందన్న భ్రమ కలిగించాలి ఆమె కోరుకొంటున్నదేమిటో తెలుసు రవిని ప్రేమించింది అందులో ఆశ్చర్యంలేదు రవి ఆమెకు తనే తోడనేలా

ప్రవర్తించాడు కాని తోడుగా నిలవలేదు మరో అమ్మాయిని చేసుకున్నాడు ఎందుకలా చేశాడు? అతడి ఆలోచన తెలిసి జవాబు చెప్పేందుకే వచ్చినట్టుగా డాక్టర్ అంటూ వచ్చాడు రవి

కమాన్ మిస్టర్ రవికుమార్ మిమ్మల్నే అనుకుంటున్నాను కూర్చోమన్నట్టుగా కుర్చీ చూపించాడు కిషోర్

రవి కూర్చోలేదు

సుధకు స్పృహలేదు డాక్టర్ మీకా విషయం తెలుసనుకున్నాము మీరు వస్తారని ఇంతసేపూ ఎదురు చూశాము

స్పృహ లేదని భయపడక్కర్లేదు కూర్చోండి రవి మీతో మాట్లాడాలి అన్నాడు కిషోర్

తప్పదన్నట్టు కూర్చున్నాడు రవి అతడు తననేదో అడగబోతున్నాడని తెలుసుకున్నాడు

మిస్టర్ రవీ కుర్చీలో కొద్దిగా కదిలి అన్నాడు కిషోర్

సుధ మిమ్మల్ని కోరుకుంటున్నట్టు మీకు తెలుసా?

డాక్టర్ అనుకోని ఆ ప్రశ్నకు అప్రతిభుడయ్యాడు రవి

చెప్పండి రవీ సుధ మిమ్మల్ని కోరుకుంటోందని మీరు తెలుసుకోలేదా? రెట్టించి అడిగాడు

తెలియదన్నా తెలుసుకోలేదన్నా ఆత్మవంచనే అవుతుంది డాక్టర్ బాధగా పలికింది రవి స్వరం

మరి మీరు ఆమెనెందుకు పెండ్లి చేసుకోలేదు?

డాక్టర్ మీకెలా చెప్పను? సుధను నేను గూడా మనస్ఫూర్తిగా ప్రేమించాను ఇది మాత్రం నిజం

అర్థమైంది రవీ డాక్టర్ గొంతులో కోపం తొంగిచూసింది

ఆమె జబ్బు తిరగబెడుతుందని భయపడ్డారు ఆమెతో జీవితం ఆనందకరంగా వుండదనుకున్నారు

లేదు డాక్టర్ లేదు ఆవేశావేదనలు మిళిత స్వరంతో అన్నాడు ఆమె గురించి నేనెప్పుడూ అలా అనుకోలేదు ఆలోచించలేదు

మరి? డాక్టర్ మాటల్లో వ్యంగ్యత

అతడు పేషెంట్ విషయం తప్ప ఏం ఆలోచించడం లేదు

మనసు బలహీనమై తేరుకున్న వ్యక్తులను సమాజం ఆదరించడం లేదు అందుకే కొందరు దుర్భర జీవితం గడుపుతుంటే మరి కొందరు మళ్ళీ అదే స్థితికి వస్తున్నారు రవి వైపు సూటిగా చూశాడు

చదువుకున్న మీలాంటి వాళ్ళలో గూడా మార్పు లేదు ఆ కారణంగానే కొందరు పేషెంట్లు ఇంటికి వెళ్ళేందుకు ఇష్టపడడం లేదు

డాక్టర్ అతడి మాటలు వినలేకపోయాడు రవి

మీరు నన్ను అపార్థం చేసుకుంటున్నారు సుధ జబ్బు గురించే ఆలోచించలేదు నేను నాకు ఆమెను అందుకొనే అర్హత లేదని ఆలస్యంగా తెలుసుకున్నాను

ఎందుకలా అనుకున్నారు? యాభై ఏళ్ళు పైబడ్డ వయసు వృత్తి ధర్మం అతడ్ని వ్యక్తిగత విషయాలు అడిగేందుకు వెనుకాడ నివ్వడం లేదు

క్షమించండి డాక్టర్ కారణం చెప్పలేను నన్ను బలవంత పెట్టకండి అది చెప్ప గలిగి వుంటే నాకీ క్షోభ వుండేది కాదు సుధ కాస్థితి వచ్చేది కాదు

సారీ రవీ మిమ్మల్ని బాధ పెట్టినట్టున్నాను అతడి ముఖం చూసి నొచ్చుకుంటూ అన్నాడు

మీరు మూర్ఖంగా ఆలోచించి సుధకు అన్యాయం చేశారనుకున్నాను రవి మాటలు ముఖంలో బాధ అతడు చెప్పిన దేదీ అబద్ధం కాదని తెలుపుతున్నాయి

ఆల్‌రైట్ ఇక ఆ విషయం వదిలేద్దాం ప్రస్తుతం జరగాల్సిన దాని గురించి ఆలోచిద్దాం

నేను ఆలోచించేదేముంది డాక్టర్ ఆమెకు నేనేం చెయ్యలేనింక భారంగా నిట్టూర్చాడు రవి

మీరేం చెయ్యలేనంటే నేనీ కేసు విషయం ఆశ వదులుకోవల్సిందే

డాక్టర్ అలా అనకండి కలవరంగా అన్నాడు

సుధ మామూలు మనిషి కావాలి

మీ సహకారం లేనిదే అది అసాధ్యం మీ కోపాన్ని చూసి మీరేదో చేస్తారని భయపడుతోందామె మీరా భయం పోగొట్టాలి ఆమె మీమీద మమతను చంపుకో నక్కర్లేదన్నట్టుగా ప్రవర్తించాలి

లేదు డాక్టర్ నేనలా ప్రవర్తించలేను ఆమె కేమీ చెయ్యలేను

మతి తప్పేస్థితిలో వున్న ఆమె మామూలు ప్రపంచంలోకి రావాలంటే మీరలా అనలేరు

డాక్టర్ నేను వివాహితుడ్ని

మిమ్మల్ని సుధను చేసుకోమని చెప్పడం లేదు ఇదివరకులా అభిమానం వున్నట్టు కనిపించాలి

అలా చేస్తే ఆమె మళ్ళీ షాక్ తినే అవకాశం వుంటుంది

అలా కానివ్వ నీ సారి మీరు మరోసారి ఆలోచించండి సుధ మళ్ళీ మనలో మనిషిగా తిరగాలంటే మీరు ఆమెతో ఇదివరకులా వుండాలి

సుధ కోలుకోనేందుకు తప్పదంటే ఏ పనికైనా సిద్ధమే డాక్టర్ అన్నాడు రవి కుర్చీలో నుండి లేస్తూ

మీరు సుధ కేదో చేస్తున్నానని అనుకోకండి డాక్టర్‌కు పేషెంట్‌ను రక్షించడంలో సహాయ పడుతున్నా ననుకోండి మీకే ఇబ్బంది బాధ వుండదు తనూ లేచి బైటికి నడుస్తూ అన్నాడు డాక్టర్

ఇద్దరు మాట్లాడుకుంటూ సుధ దగ్గరికి వచ్చారు

సుధను చూసి ఇంజక్షనేదో ఇవ్వమని నర్స్‌కు చెప్పి వెళుతూ మిస్టర్ రవీ నేను చెప్పిన విషయం మరిచి పోకండి సుధకు మీరే డాక్టరిప్పుడు మీ అభిమానమే ఆమెను బాగు చేసే మంచి మందు అంటూ రవిని మరోసారి



హెచ్చరించాడు డాక్టర్

★ ★ ★ ★

ఇంజక్షన్ ఇచ్చిన కొద్ది సేపటికే సుదకు స్పృహ వచ్చింది

తనను చూసి మళ్ళీ బైటికి వెళ్ళిపోతుందేమో అమె కండ్లు తెరవగానే రవి బయపడ్డాడు కాని అమె అలాంటి ప్రయత్న మేమీ చెయ్యలేదు

అతడ్ని చూడగానే ముఖం ప్రక్కకు తిప్పుకుంది

సుదా అటు వైపు వెళ్ళాడు రవి

కాపీ తాగుతావా? ప్రక్కనే కబోర్డ్ మీద వున్న ప్లాస్క్ తీసుకొని కాపీ గ్లాసులో పోస్తూ అడిగాడు

సుద మాట్లాడదని అతడికి తెలుసు

గ్లాసు అమె ముందుంచాడు

సుద లేచి గ్లాసు తీసుకుంది కాపీ తాగాలన్న కోరికతో కాకుండా అతడే మంటాడో నన్న బయంతో తీసుకున్నట్లున్నాయా చూపులు

రవి స్టూలు మీద కూర్చున్నాడు

సుబద్రమ్మ మోహనరావు కాస్త దూరంలో బొమ్మల్లా నిల్చొని చూస్తున్నారు

రవి తప్ప తామేం చెయ్యలేమని వాళ్ళనుకోడమే కాకుండా డాక్టరు గూడా అనడంతో సుద బాద్యత పూర్తిగా అతడికే అప్పగించారు

సుద కాఫీ తాగగానే గ్లాసు తీసుకొని కబోర్డ్ మీద పెట్టి మోహనరావు దగ్గరికి వచ్చాడు రవి అదే అదను అనుకుందేమో సుద మంచం దిగి పరుగెత్త బోయింది కాని రవి చూపు అటే వుండడంతో గబుక్కున వచ్చాడక్కడికి

ఎక్కడికి వెళుతున్నావు?

సుద అతడి వైపో సారి చూసి మంచం మీద కూర్చుంది

పైకి ఏం అనకున్నా తను బైటికి వెళ్ళ లేక పోయినందుకు చాలా బాద పడుతున్నట్లుగా వుందామె వదనం

ఎందుకలా వున్నావు? ఎక్కడికి వెళ్ళాలో చెప్పు తీసుకెళతాను అన్నాడు రవి

ఆశ్చర్యంగా చూసింది సుద

రవి హృదయం ఆనందడోలికల్లో తేలి పోయింది అమె అలా చూసిందంటే తన మాటలు అర్థం చేసుకున్నట్లే తన కింక అమె బయాన్ని పోగొట్టడం కష్టం కాదు అమె మాట్లాడకున్నా ఇతర్ల మాటలు వింటోంది

కాసేపు రెస్ట్ తీసుకో ట్యాంక్‌బండ్‌కు వెళ్దాం అన్నాడు అనునయంగా

సుద వెనక్కు వాలి పడుకుంది








రవి గది గుమ్మం దగ్గరికి వెళ్ళి నిల్చున్నాడు

మోహనరావు అతడి దగ్గరికి వచ్చాడు

సుద కలా చెప్పారు అమె మన మాటలు అర్థం చేసుకుంటోందని మీరు తెలుసుకో లేదా? అన్నాడు దిగులుగా

అర్థం చేసుకుంటున్నదనే తీసుకెళతా నన్నాను

అక్కడేదైనా గొడవ చేస్తే

వెంటనే పిలుచు కొస్తాను ఆలోచన దేనికి? అన్నాడు రవి

మీరు చాలా శ్రమ తీసుకుంటున్నారు రవి బాదగా అన్నాడు మోహనరావు

శ్రమేముంది? మనిషిగా మనం చెయ్య గలిగింది చెయ్యాలి

అలా అనుకోడం మీ మంచితనం అన్నాడు మోహనరావు

కాదు మానవత్వం అమె కోసం నేనేం చేసినా తక్కువే అవుతుంది రావుగారూ అక్కడ నిలవలేని వాడిలా బైటికి వెళ్ళాడు రవి

మోహనరావు గాడంగా నిట్టూర్పి లోపలికి వచ్చాడు

రవి సుదను ప్రేమించాడు పెండ్లి చేసుకోక పోయేందుకేదో పెద్ద కారణం వుంది చాలా సేపు అతడి గురించే ఆలోచించాడు

రవి గదికెదురుగానే వరండాలో నిల్చొని దూరంగా వున్న మనుషులను చూస్తున్నాడు

అక్కడ వివిద వింత ప్రవృత్తులతో వున్న మనుషులు

శారీరకంగా కాని మానసికంగా కాని ఏదైనా లోపమైతే మనిషి జీవితం ఎంత బయంకర మౌతుంది! అనిపిస్తోంది అక్కడి మనుషులను చూస్తుంటే

ఒకరు లోకమే లేదన్నట్లుగా వుంటే మరొకరు తామే లోక మేలుతున్నా మనుకుంటున్నారు

బాదను బరించలేని మనిషి మనసు మూగ బోతే జీవితమే చిత్రంగా మారిపోతుంది సుదను షికారుకు తీసుకెళతానన్న విషయం గుర్తొచ్చి లోపలికి వచ్చాడు

సుదా వెళ్దామా!

తను సిద్ధమే నన్నట్లు లేచింది సుద

కారు దగ్గరికి రాగానే తనే డోర్ తెరుచుకొని కూర్చుంది

సుద తప్పకుండా కోలు కుంటుంది అమె మామూలుగా ప్రవర్తించడం చూశాక ధైర్యం వచ్చింది రవికి

చీకటి పడేవరకు టాంక్ బండ్ మీదే గడిపా రిద్దరు

సుద మాట్లాడకున్నా అక్కడ నీళ్ళ వంక పిల్లల వంక చూస్తూ ప్రశాంతంగా కనిపించే సరికి సంతోషంగా వుంది రవికి

తిరిగి వచ్చేటప్పుడు కారు ఓ హోటల్ ముందు ఆపాడు

టిపిన్ చేసి వెళదాం నాకు బాగా ఆకలిగా వుంది అన్నాడు

సుద వెంటనే కారు దిగి అతడ్ని అనుసరించింది మామూలు స్థితిలో వున్నట్లుగానే టిపిన్ కాపీ తీసుకుంది

హోటల్ నుండి బైటికి వస్తుండగా రవి స్నేహితుడు సుదీర్ కనిపించాడు

ఈమె అతడు సుదను వెంట పెట్టుకొని రావడం ఆశ్చర్యం కలిగించింది సుదీర్‌కు

రవి పెండ్లికి ఆతడు వచ్చాడు అక్కడ సుద గొడవ చెయ్యడం గూడా అతడికి తెలుసు

సుద మళ్ళీ ట్రీట్ మెంట్ తీసుకోవల్సి వచ్చింది ఆ ట్రీట్ మెంట్‌లో బాగమే మేము ఇలా రావడం గూడా అన్నాడు రవి

ఇంకెక్కడి కైనా వెళుతున్నారా? అడిగాడతడు

లేదు హాస్పిటల్‌కే వెళతాము

అయితే దానికంటే ముందో పని చెయ్యి మా కంపినీ తరఫున స్కూలు పెట్టించాలని ఈ రోజు బెనిఫిట్ షో ఏర్పాటు చేశాము ఎనిమిది గంటలకు శాంతి

థియేటర్‌లో మొదలౌతుంది అక్కడికిరా అమెకు పిక్చర్ చూపించి నట్లుంటుంది మాకు కొంత డబ్బు ముట్ట చెప్పే అవకాశమూ వుంటుంది చివరి మాటలు నవ్వుతూ అన్నాడు సుధీర్

ఓ కె నీవు కోరినంత డబ్బు ఇస్తాను నీవు టిఫిన్ చేసి వస్తావేమో వెళ్ళు నేను మోహనరావు గారికి పోన్ చేసి వస్తాను అన్నాడు రవి

సుధ వారికి కొద్ది దూరంలో వుండడం వల్ల వారి మాట లేమి విన్నట్టు లేదు

రవి అక్కడి నుండి కదలగానే తనూ కదిలింది

సుదను పిక్చర్‌కు తీసుకెళ్ళడమా! రవి చెప్పగానే ఆశ్చర్యంగా అన్నాడు మోహనరావు

ఏం తీసుకెళ్ళ గూడదా?

అలా అని కాదు మిమ్మల్ని ఇబ్బంది పెడుతుందేమో నని

మీరా విషయం ఆలోచించ వద్దని చెప్పానుగా అమె ప్రవర్తన భరించ లేనిదైతే వెంటనే వచ్చేస్తాను

రవి ఎంత ధైర్యం చెప్పినా అతడ్ని సుధ,ఏం బాధ పెడుతున్నదో నని దిగులుగా వున్నారు సుభద్రమ్మ, మోహనరావు

కూతురి గురించే ఆలోచిస్తున్న మోహనరావుకు పది గంటలు దాటాక ప్రతిమ గుర్తొచ్చింది

రవి అమెకు ఫోన్ చేశాడో! లేదో! మధ్యాహ్నం ఆఫీసు నుండి ఇక్కడికి వచ్చాడు అమె భయపడుతుంటుంది అనుకొని ప్రతిమకు పోన్ చేశాడు

సుదస్థితి ఎలా వుంటుందో రవిని రాత్రి హాస్పిటల్లోనే వుండమనాలనుకొని అమెకు రవి రాత్రి ఇంటికి రాడని చెప్పాడు సుదను పిక్చర్‌కు తీసుకెళ్ళాడంటే అమె ఏమనుకుంటుందో నని చెప్పలేక పోయాడు

రవి రాగానే సుద గొడవేం చెయ్య లేదని మామూలుగానే వుందని చెప్పి ఇంటికి వెళ్ళ బోతుంటే మీరి రాత్రి ఇక్కడే వుంటారని ఇంటికి పోన్ చేసాను అన్నాడు మోహనరావు

సుధ ఎలా వుంటుందో! మీరిపూట ఇక్కడే వుంటే బాగుంటుంది రవి అమెను నేను పట్టుకోలేను

అతడు ఇంటికి పోన్ చేశానని చెప్పిన మాట తర్వాత ఇంకే మాటా వినిపించుకోలేదు రవి

అంత వరకు సుధ మామూలుగా వుందని ఆనందంగా వున్న అతడికామాటలు వినగానే ఏదో ఘోరం జరిగి పోయినట్లుగా అనిపించింది

ప్రతిమకు ఫోన్ చెయ్యాలన్న ఆలోచనే రాలేదు తనకు సుదను పిక్చర్‌కు తీసు కెళ్ళాలను కున్నప్పుడు మోహనరావుకు పోన్ చెయ్యాలనుకున్నాడు కాని ఇంటి దగ్గర తన కోసం ఎదురు చూసే వ్యక్తి వుందని మరిచాడు ప్రతిమ తనకోసం ఎంత ఎదురు చూసి వుంటుందో అతడక్కడ నిలవ లేక పోయాడు

సుధ ఇక ఏం చెయ్యదు లెండి వుండలేనన్నట్టుగా అని బైటికి వచ్చాడు రవి

తనిలా వచ్చాడు సుద ఏం చేస్తుందో? అమె ఏం చెయ్యదని మోహనరావుకు చెప్పాడు కాని అతడికి బయంగానే వుంది సుదను ఆమె కర్మానికి వదల లేదు భార్య బాద పడడం భరించ లేదు

సుద మీద అబిమానం అయితే ప్రతిమది మూడు ముళ్ళతో వచ్చిన బందం

సుద మీద ఇది వరకున్న అబిమానం వేరు ఇప్పటి అబిమానం వేరు

ఇది వరకు సుదను తన దాన్నిగా చేసుకోవాలనిపించేది

ఇప్పుడామె మామూలు మనిషి కావాలని తప్ప మరే ఆలోచనా లేదు అలా వుండగూడదనే తను పెండ్లి చేసుకోడం గూడా ప్రతిమను పెండ్లి చేసుకోడం మనసుకు సంకెళ్ళు వేసుకోవాలనే

ఆ సంకెళ్ళు తనను బాదపెడుతున్నాయి

సుదను తను అబిమానిస్తున్నట్లు నటించినా ఆమెకు ఆశ పెంచేలా వుండగూడదు అనుకున్నాడు

(ఇంకావుంది)

# రెడ్డిరాజుల రాజధాని 'అద్దంకి'

తూర్పు చాళుక్య వంశములో అగ్రగణ్యుడయిన గుణగ విజయాదిత్యుని కాలమున (క్రీ శ 848–891) అద్దంకి నగరము మొదటిసారిగ చరిత్ర రంగమునకు ఎక్కినది 12వ శతాబ్దిలో వెలనాటి చోళుల అధీనంలో ఉండినట్లు ఆధారాలు ఉన్నవి క్రీ శ 1150 ప్రాంతములో చక్రనారాయణ వంశీయులు అద్దంకిలో రాజరికము చేశారు ఈ వంశమునకు చెందిన మాదవరాజు 1240 ప్రాంతంలో కాకతి గణపతిదేవ చక్రవర్తికి సామంతుడు

## "రెడ్డి" శబ్దోత్పత్తి

కాకతీయుల పతనానంతరము సింహాచల విక్రమపుర మద్యస్త తీరాంధ్రాన్ని శ్రీశైల అహోబిల క్షేత్రాల వరకు శతాబ్దికి పైగా పాలించి తెలుగు బాషా సంస్కృతులకు రెడ్డి రాజులు మెరుగులు దిద్దారు క్రీ శ అరవ శతాబ్ది నుండి ఆంధ్రదేశంలో కాపుల పేర్ల చివర రట్టకుడి లేక రట్టగుడి పదం కన్పిస్తుంది కుడియన్ అనే పదానికి కాపు అని అర్థం నేటికి ఆంధ్రదేశంలో రెడ్డికాపు అనే ప్రయోగం సర్వ సాదారణం రట్టకుడి పదమే రట్వోడి రట్టడి రడ్డి అనే మార్పులు పొంది రెడ్డి గా స్థిరపడిందని ఐతిహాసికులు బావిస్తున్నారు ఈ రూపాలన్ని శాసనాలలోను తెలుగు ప్రాచీన ప్రతులలోను కన్పిస్తున్నయి రాయలసీమలోని అనేక ప్రాంతములలో రెడ్డి పదం గ్రామ పెద్దకు పర్యాయ పదంగ ఈనాటికి వాడుకలో ఉంది

రెడ్డి రాజులు పంటశాఖీయులు వారు నివసించే ప్రాంతాలను బట్టి మోటాడి వెలనాటి మొరస చాంగలునాటి మొదలయిన పదునాల్గు శాఖలున్నట్లు ఆదారాలు ఉన్నయి వడ్లలో ఎన్ని రకాలున్నవో రెడ్లలో అన్ని శాఖలున్నవని నానుడి

## రెడ్డి రాజ్య స్థాపన

కాకతి ప్రతాపరుద్రుని కొలువులోని నాయంకరులలో ఒకడయిన ప్రోలయ వేమారెడ్డి క్రీ శ 1324–25 నాటికి అద్దంకి రాజదానిగ రెడ్డిరాజ్యం స్థాపించినట్లు మల్లవరం శాసనం తెల్పుతుంది ఇతను 1353 వరకు రాజ్యాపాలన చేసినట్లు మణికేశ్వరం శాసనం వలన వెల్లడి అవుతుంది అద్దంకి ఒంగోలు నుండి 40 కి మి దూరంలో నరసరావుపేట మార్గంలో ఉన్నది

తురుష్కులు ఓరుగల్లును ఆక్రమించిన తర్వాత ప్రోలయ వేమారెడ్డి విజృంబించి దిగ్విజయయాత్ర ద్వార తన పరాక్రమాన్ని ప్రదర్శించాడు ముస్లిములను కృష్ణానదికి దక్షిణదేశం నుండి తరిమివేసిన ఘనత యితనికి దక్కింది ఈ యుద్ధాలలో వేమారెడ్డికి గుజ్జరి ధట్టు విబాళ మండలి కరగండ బిరుదములు సంక్రమించాయి

ప్రోలయ వేమారెడ్డి కుమారుడు అనవోతారెడ్డి (అనపోతారెడ్డి) 1353–64ల మధ్య రాజ్యాపాలన చేశాడు నిరంతర యుద్ధాలు జరుగుతున్న ఆ రోజులలో స్థల దుర్గమైన అద్దంకి సురక్షితం కాదని బావించి గిరి దుర్గమైన కొండవీటికి రాజదానిని మార్చాడు క్రమంగ అనవేమారెడ్డి, కుమారగిరి రెడ్డి, పెదకోమటి వేమారెడ్డి రాచవేమారెడ్డి రాజ్యాపాలన చేశారు దరణికోట చందోలు ఏనుకొండ బెల్లంకొండ కొండవీడు కొండపల్లి, కందుకూరు దుర్గములు రెడ్డి రాజులకు బలమైన సైనిక స్థావరములుగ ఉండేవి శ్రీ కృష్ణదేవరాయలు పూర్వ ద్విగ్విజయ యాత్రలో అద్దంకి దుర్గమును పట్టుకున్నాడు విజయనగర చక్రవర్తులు బహమని సుల్తానులు వెలమ ప్రభువుల దాడులకు రెడ్డి రాజుల శాసనము క్షీణించినది కొండవీటి రెడ్డి రాజులలో చివరి వాడు రాచవేమారెడ్డిగ చెప్పబడు తున్నాడు

## ప్రజా జీవనము

రెడ్డి రాజుల పాలనలో కొదువ ఎరుగరు ప్రజలు అను నానుడి ప్రచారంలో ఉండేది వామనబట్ట బాణుడనే సంస్కృతకవి తన వేమ భూపాల చరితములో అద్దంకిని– ప్రకాశమానమైన మేడల గోపురములు కలదియు, నిత్యోత్సవములతో విలసిల్లునదియు, సమ్మోదముతో గూడిన పౌరజనులు కలదియు అగు అద్దంకి నగరము ఒప్పుచున్నది అని వ్రాశాడు దీనిని గందర్వభూమిగ కొనియాడాడు–

బలిరాజ నిలయ భూతాపి గంధర్వభూమిః
అద్దంకి నామదేయ నగరి

వ్యవసాయం ముఖ్యవృత్తిగ ఉండేది వరి, జొన్న సజ్జ, చెరకు నువ్వులు ప్రత్తి పంటలతో పాటు అరటి ద్రాక్ష కొబ్బరి ఆకుతోటలు పెంచేవారు


రామలింగేశ్వరాలయము


ప్రఖ్యాతమైన వేయి స్తంబాల గుడి

కలమ, శాలి సిరాముఖ పతంగ హాయన మున్నగునవి ఆనాటి వరిలో రకాలుండేవి కదురు కవ్వం ఆడిన ఇంట్లో కరువుండదనే సామెత నాటి పాడి పరిశ్రమకు సంకేతంగ చెప్పవచ్చును రంభయైన ఏకులు వడకునె' చాటువు వలన వస్త్ర పరిశ్రమ వ్యాప్తిలో ఉన్నట్లు తెలుస్తుంది వస్త్ర పరిశ్రమకు అనుబంధంగ రంగుల పరిశ్రమ కూడ సాగింది ఆ రోజులలో నీలిమందు తయారు చేసేవారు

పంచలోహంతో కొలువు చవికెలు గజ ఘంటలు జయస్తంభము దీపస్తంభములు ఆయుధాలు తయారు చేసేవారు గాజు రెక్కల తలుపులు అద్దాలు ఉన్నట్లు ఆధారా లున్నవి తురుష్కుల దండయాత్రలలో దెబ్బతిన్న మోటుపల్లి రేవు పునరుద్ధరింపబడి తద్వారా సప్తదీవ సద్వస్తు సంబారం దిగుమతి అయ్యేది జాఫ్నా సింహళ సుమత్రా మలయా ఇండోచైనా భూటాన్ మొదలయిన దేశాల నుండి చీనాంబరములు చందనము అగరు, కర్పూర హిమాంబు పూరముల వంటి విలాస వస్తువులు దిగుమతి అవుతుండేవి

## మతము – కళాసేవ

రెడ్డిరాజులు పరాక్రమములో ఎంతటి ఘనులో ధర్మ రక్షణలో అంతటి ఉదారులుగ ఖ్యాతి గాంచారు వీరు శైవమును ఎక్కువగ ఆరాధించినప్పటికి వైష్ణవమును కూడ పోషించినట్లు ఆదారము లున్నవి ఆ కాలంలో అద్దంకిలో విఘ్నేశ్వరాలయము రామలింగేశ్వరాలయము కమరేశ్వరాలయము శ్రీ రామాలయము వీరభద్రాలయము రంగనాయకస్వామి మందిరము మున్నగు 101 దేవాలయములు 101 బావులు ఉండేవి వానిలో వేయిస్తంబాల గుడి (నగరేశ్వరాలయము) చాల ప్రశస్తి పొందింది వేమారెడ్డి శ్రీశైలంలో పాతాళ గంగకు మెట్లు కట్టించాడు దుర్గ కాళి భద్రకాళి చండి మున్నగు పేర్లతో శక్తిని ఆరాధించేవారు



వేయిస్తంభాల గుడి ప్రాంగణంలోని ధ్వజస్తంభము, శిలా శాసనము

మొక్కుబడులు వీరపూజ ఉండేది

ప్రోలయ వేమారెడ్డి శాసన కాలంలో ప్రబంద పరమేశ్వరుడు శంబుదాసుడుగ గణుతి కెక్కిన ఎర్రా ప్రగడ అద్దంకిలో నివశించాడు తాను రచించిన హరివంశ కావ్యమును ఎర్రన ప్రోలయ వేమునికి అంకితం కూడ యిచ్చాడు ఆ కాలంలో కవులు అష్ట బాషలలో కవిత్వం చెప్పటం గొప్పగా బావించేవారు అరబీ పారశీక బాషలు సయితం అబ్యసించేవారు విప్రులు జ్యోతిషం షట్దర్శనములు శబ్దమీమాంస శాస్త్రములు సంగిత సాహిత్యములు దర్మశాస్త్రం ఆయుర్వేదం అధ్యయనం చేసేవారు ప్రభువులు వేదాంగములు పురాణేతిహాసములు కావ్య నాటకాలంకార శాస్త్రములు రాజనీతి శాస్త్రము అశ్వశాస్త్రం సామజశిక్ష, శస్త్ర దారణాది విద్యలు బరత సంగిత కామశాస్త్రములు అబ్యసిస్తున్నట్లు తెలుస్తుంది పెదకోమటి వేమారెడ్డి అస్థానములో (కొండవీడు) కవిసార్వబౌముడైన శ్రీనాథుడు విద్యాదికారిగ ఉండేవాడు

## ఈనాటి పరిస్థితి

అంతటి ప్రాబవ ప్రాశస్త్యములు కలిగిన అద్దంకి నేడు రూపుమాసి బోసిపోయి మూగవేదనను వ్యక్తం చేస్తూ కనుపిస్తుంది ఇప్పుడు బహుకొద్ది ప్రాచీన దేవాలయములు మాత్రం ఉన్నయి అవి కూడ కొన్ని బీటలువారి కొన్ని కూలిపోయి మరికొన్ని కూలటానికి సిద్ధంగ కన్పిస్తాయి ఒకప్పుడు ఎత్తైన కోటగోడ ఉన్నచోట నేడు చెట్టంత లోతున గోతులతో బయలు ప్రదేశంగ ఏర్పడి వరాహముల విహారస్థలంగ మారిపోయింది రామలింగేశ్వర ఆలయము చుట్టూర కూడ మట్టి త్రవ్విన గోతు లేర్పడినయి

ప్రఖ్యాతమైన వేయి స్తంబాల గుడి ముస్లిముల దండయాత్రలలో ధ్వంసముకాగా కాలగమనంలో తిరిగి కొంత పునరుద్ధరింపబడి నూరు స్తంబాల గుడిగ నిలిచి ఉంది పూజారి వచ్చి అర్చనచేసి తాళము బిగించి వెళ్ళిన తర్వాత చుట్టు ప్రక్కల గల కొందరు యువక సోమరులు ప్రహరిగోడ దూకి మంటపములో డబ్బు ఎట్టి జూదము ఆడుచుండుట ఈ వ్యాసకర్త ప్రత్యక్షంగ చూసిన విషయం ప్రాచీన నిర్మాణములు వాస్తు శిల్ప సమన్వయంతో విలసిల్లే దార్మిక కళా కేంద్రములు ఇవి మన సంస్కృతికి సంకేతములు కూడ! వానిని పవిత్రంగ నిలబెట్టుకొనటం మన బాధ్యత

ఫొటోలు, వ్యాసం కెప్టెన్ షేక్ మౌలాలీ

బీటలు వారిన విఘ్నేశ్వరాలయము



గోతులతో, వరాహముల విహారస్థలంగ మారిన అలనాటి కోట గోడ



# పగలు కోరిన కొవ్వొత్తి

దుర్గమహంతి భారతి

"అమ్మా! చిన్నక్కొచ్చిందే!" అంటూ పెద్దగా కేకేసింది రమణి అప్పుడే ఆటో దిగుతున్న సుశీల్ని చూసి – పిండి రుబ్బుతున్న పార్వతమ్మ పేపరు చదువుతున్న పరందామయ్యగారు ఎవరి పన్లు వారాపి గుమ్మం దగ్గరకి పరుగు తీశారు పండకొచ్చిన రెండో అమ్మాయిని ఆహ్వానించటానికి

ఏమ్మా సుశీ బాగున్నావా? ఒక్కసారి ఆర్ద్రతతో పలకరించారు దంపతులిద్దరూ

అదేంటే ఉత్తరమైనా రాయకుండా వచ్చేశావు అల్లుడుగారేరి? అంది పార్వతమ్మ లోపలికి దారి తీస్తూ

ఆయనకేమో శెలవు లేదట పండగ నాటికి వస్తానన్నారు నాకు చిరాకనిపించింది కోపం వచ్చి ముందే బయల్దేరి వచ్చేశాను అంది చిరుకోపంగా తండ్రి వైపు తలెత్తి చూడకుండా కూతురు



జవాబుకి పరందామయ్యగారి ముఖ కవళికలు మారిపోయాయి

పెళ్ళై ఏణ్ణర్థం కాలేదు అప్పుడే భర్తపై కోపాలు తాపాలు ఏం సంసారాలో ఏంటో! అని గొణుక్కొని పేపర్లో తల దూర్చారు

ఏమే సుశీ! ఇప్పుడేనా రావటం? తడిబట్టలతో బాత్‌రూం నుండి బయటకు వస్తూనే పలకరించింది సుగుణ

అవునక్కా నువ్వెప్పుడొచ్చావ్? బావగారేరి కిరణ ఏడి ప్రశ్నపై ప్రశ్న వేసింది సుశీల

కిరణ అల్లరి పైదవైపోయాడు ఆటకి బయటకి పోయుంటాడు బావగారేమో రేపొస్తానన్నారు బట్టలు మార్చుకుంటూ అంది సుగుణ

అన్నట్టు వేణక్క కూడా రేపే వస్తుందే! అంది రమణి సుశీల నుద్దేశించి

అదేంటే! వేణు బావగారితో కల్సి వస్తుందా, అంది నవ్వుతూ సుశీల

ఛా ( అదేంకాదు పెద బావగారు వేరే ట్రైన్‌లో వస్తారు కదా! బదులు చెప్పింది రమణి

అందరూ ఒక్కసారి నవ్వేశారు

పార్వతమ్మ గారొక్కరే రుబ్బు రోలు దగ్గర కూర్చొని జబ్బలు నొప్పెట్టాలా రుబ్బుతున్నారు

నే చేస్తాలే అమ్మా అంటూ లేచింది చిన్నకూతురు రమణి

వద్దులేవే నువెళ్ళి దానికి కాస్త కాఫీ కలిపియ్యవే అంటూ పని పురమాయించింది

ఒసేవ్! పార్వతీ టైమవుతోంది నన్ను ఆఫీసుకి పోనిస్తావా లేదా? అంటూ ఒక్క కేకేశారు పరంధామయ్య ఆ పిలుపుకి అందరూ ఒక్కసారి సంబాషణ లాపి ఎవరి పన్లో వారు చొరబడ్డారు

పరంధామయ్య ఇంకా రెండేళ్ళలో రిటైరు కానున్న గమర్నమెంటు సర్వెంటు

ముగ్గురు కూతుళ్ళకి వరుసగా మూడేళ్ళలో పెళ్ళిళ్ళు చేసి గుండెల మీద కుంపటి దింపుకున్నా ననుకున్నాడు కాని ఆ కుంపటి బాగా అంటుకొని ప్రతి సంవత్సరం పండగల పేరిట పురిళ్ళ పేరిట కళ్ళెమంటలకి ఆహుతై పోతానని అనుకోలేదు నేటి మానవుడు జలాంతరాల్లో దిగిపోతున్నా గ్రహాంతరాలు దాటి పోతున్నా గ్రహాంతర తెలుగు సాంప్రదాయ ఆచార వ్యవహారాలకు స్వస్తి చెప్పలేకపోతున్నాడు ఆడపిల్లల తండ్రి పరందామయ్య కూడా ఆ కోవకు చెందినవాడే ప్రతి ఏటా అల్లుళ్ళని ఆహ్వానించి ఏదో విదంగా తృప్తిపరచి పంపిస్తున్నారు

ఈ ఏడాది కూడా ముగ్గురు కూతుళ్ళని పండక్కి పిలిచాడే కాని వారి కోరికల్ని తృప్తిపరచలేనేమో అని వాపోతూ అసంతృప్తిగా భోజనం ముగించాడు

ఆఫీసుకి బయలుదేరుతున్న పరందామయ్యకి పార్వతమ్మ చేతికి వక్కపొడి అందిస్తూ –

ఏమండి పండగ ఇంకా నాలుగు రోజులు కూడా లేదు గుర్తుందనుకుంటాను అదే డబ్బు విషయం అంది నెమ్మదిగా

ఆ మాటలకి పరందామయ్య మౌనంగా భార్య వంక చూసి ఫైళ్ళని చెంక పెట్టుకుని ఆఫీసుకి బయలుదేరాడు

★ ★ ★ ★

ఇంకా పండగ ఒక్కరోజుందనగా పరందామయ్య గారిల్లు కూతుళ్ళతో అల్లుళ్ళతో నిండిపోయింది

ఒకొక్కరి అల్లుడి మనసులో ఒక్కో ఆలోచన ఒకొక్క కూతురి మనసులో ఒకో ఆలోచన

తండ్రిని ఏవో అడగాలని

పరంధామయ్యగారు ముగ్గురు కూతుళ్ళకి ఒకే రకం చీరలు తెచ్చారు నాలుగో అమ్మాయికి పట్టు పరికిణి తెచ్చారు అందరూ కలిసి చీరలు నచ్చింది నచ్చలేదని వాదించుకుంటున్నారు

అమ్మా ఈసారి పండక్కి అల్లుడికి స్కూటరు కొనివ్వకపోయినా కనీసం మూడు వేలైనా అప్పివ్వమను నాన్నగార్ని రోజు – రోజుకి సిటీబస్ ఛార్జీలు పెరిగిపోతున్నాయి బస్సులో వెళ్ళి రావాలంటే జీతమూ సరిపోవటం లేదు టైమూ సరిపోవటం లేదు చీరల్ని మడత పెడుతూ అంది పెద్దమ్మాయి సుగుణ

నీకు మూడు వేలిస్తే నేను మాత్రం వూరుకుంటానటే నా మొగుడుకి సైకిల్ కొనిమ్మంటాను అంది పెళ్ళై ఆర్నెల్లయిన మూడో అమ్మాయి వేణు

పెద్దమ్మాయి అంటూ పెళ్ళి ఘనంగా చేయాలని ఎక్కువ కట్నం ఇచ్చారు దానికి మూడో దానికి ముచ్చటగా చెయ్యాలని ఆరు తులాల బంగారం పెట్టారు నా భర్త మాత్రం ఆఫీసరు కాదా? కాదు పోదు అంటే కాస్త ఆస్తి ఉందని వాళ్ళు కట్నం అడగలేదు కానీ, అడిగితే కనీసం ఇరవై వేలన్న ఇచ్చి ఉండేవారే పెళ్ళయిన సంవత్సరం ఆయన రానేలేదు ఇదే మొదటిసారి రావటం ఏమిస్తారో ఏమో? నిర్ణయం తల్లికే విడిచి పెట్టింది రెండో కూతురు సుశీల

అమ్మా వింటున్నావా? అన్ని నాన్నగారితో చెప్పు మళ్ళీ నోరందుకుంది పెద్దమ్మాయి రమణికి జడ వేస్తున్న తల్లితో

అమ్మాయి ఈ సంసార విషయాలు మీకు

తెలిసివికావు నాన్నగారి సంపాదన కూడా ఎంతో మీకు తెలుసు

ఆర్నెల్ల క్రితం మూడోదాని పెళ్ళికి చేసిన అప్పు ఇంకా తీరనేలేదు ప్రతి పండక్కి మీరంతా వస్తూనే ఉన్నారు మీ అందరి కోర్కెలు తీర్చడాన్కి పాపం! ఆయన మాత్రం డబ్బెక్కడ తెస్తారు నోరు విప్పి ఎన్నో చెప్పాలనుకుంది ■ తల్లి హృదయం కాని బిడ్డలు మనసు పండగలో నొప్పించటం ఎందుకని కనుకొనలలో నిండిన కన్నీరు కొలను కాక ముందే అక్కణ్ణుంచి లేచి వంటగదికి వెళ్ళిపోయింది పార్వతమ్మ

ఒసేవ్ రమణీ నీవు మాత్రం చిన్న ఉద్యోగస్తుణ్ణి చేసుకోవద్దు ఏభై వేలు కట్నం పోయినా పరవాలేదు ఎ డాక్టరునో ఇంజినీరునో చేసుకో నాన్న అంత డబ్బు ఎలా తెస్తాడని ఆలోచించకు ఈ ఇల్లు అమ్మయినా సరే మంచి సంబంధం తెమ్మను వింటున్నావా? నిలువుటద్దం ముందు నిల్చొని బొట్టు పెట్టుకుంటున్న రమణి నుద్దేశించి అంది సుశీల

అద్దంలో తండ్రి ప్రతిబింబం చూసి ఉలికిపడి వెనుతిరిగింది రమణి ఆమెతోపాటు ఆశ్చర్యంగా ముగ్గురమ్మాయిలు తండ్రిని చూసి బిత్తరపోయారు

అంతా విన్నానమ్మా అంటూ తన అసమర్ధతకు నొచ్చుకుంటూ నిట్టూర్చాడు తండ్రి

గత మూడు రోజులుగా అప్పు కోసం అడగనివారంటూ లేదు ఇక ఉన్నదల్లా ఒకే ఆశ వడ్డీ వ్యాపారస్తుడు వెంకట్రామయ్య దగ్గరకెళ్లాలని బయలుదేరుతున్న పరందామయ్యని మామగారు నెమ్మదిగా పిలిచాడు పెద్దల్లుడు మురళి

ఆయన తలెత్తి ఒక్క క్షణం అల్లుడి ముఖంలోకి చూశాడు

స్కూటరు కోసం డబ్బు అడుగుతాడని గుండెల్లో రాయి పడ్డట్టయ్యింది

మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి మళ్లీ అల్లుడే అన్నాడు

అమ్మాయి నాకు అన్ని విషయాలు చెప్పింది బాబు ఆ ఏర్పాట్ల మీదే అర్ధొక్తిలోనే ఆగిపోయారు పరంద మయ్య

ఆ తర్వాత చెప్పకూడనిది రహస్యంలా

మీతో నేను వస్తాను పదండి అంటూ బయటికి దారితీశాడు అల్లుడు రోడ్డు మీద వస్తున్న ఆ యిద్దరి మధ్య నిశ్శబ్దం వడ్డీ వ్యాపారస్తుడు వెంకట్రామయ్య యింటికి బయలుదేరిన పరందామయ్య గార్కి అల్లుడు తనతోపాటు





రావడం ఇబ్బందిగానే ఉంది

అలా ఆ హోటల్లో కూర్చుని మాట్లాడుకుందాం రండి అన్న అల్లుడితో అప్రయత్నంగానే అనుసరించారు పరందామయ్య అల్లుడికి నచ్చచెప్పి ఇటునుంచే ఇటు తనని ఇంటికి పంపిద్దామనే ఉద్దేశ్యంతో

కాఫీకి ఆర్డరిచ్చి

ఈ ఉత్తరం చదవండి అంటూ రెండు పేజీల ఉత్తరాన్ని మామగారి చేతిలో పెట్టాడు అల్లుడు

అర్థం కానట్టు చూశారు పరందామయ్య

మీరేమిటో నాకు చెప్పిన ఉత్తరం అది చదవండి ఉత్తరం తీసి చదవటం ప్రారంభించాడు పరందామయ్య అది తన అల్లుడు మురళికి తండ్రి రాసిన ఉత్తరం మురళి చెల్లెలకి బావకి తీర్చవలసిన కోర్కెల చిట్టా చదువుతూ అందులో మునిగిపోయారు పరందామయ్య అతని ముఖంలోని భావాల్ని పరిశీలిస్తూ కాఫీ తాగడం పూర్తి చేశాడు మురళి

అంతా చదివి అల్లుడి చేతికి ఉత్తరాన్ని అందించి కాఫీ సిప్ చేసారు పరందామయ్య

చల్లగా గొంతులోకి జారింది కాఫీ

ఇక నేను చెప్పింది వినండి ■ ఉత్తరాన్ని నేను

చదువుతున్నంతసేపూ మా నాన్నగారితో పాటు మీరు కూడా నా కళ్ళ ముందు మెదిలారు అల్లుడి హోదాను మర్చిపోయి ఆడపిల్లల తండ్రికి కొడుగ్గా నేను ఆలోచించాను

మి అమ్మాయి మిమ్మల్ని కోరే గొంతెమ్మ కోర్కెలు అవి తీర్చటానికి ఎండలో వానలో వీదుల వెంట మి పచార్లు

సాంప్రదాయాల అడుగున చితికిపోయే మి జీవితాలు ఆచారాలు గౌరవం పేరిట తలనయినా తాకట్టు పెట్టే మి మనస్తత్వాలు ఇవన్ని ఆలోచించి నేనూ ఓ సగటు అల్లుడిగా బ్రతుకుతున్నందుకు ఎంతో సిగ్గుపడుతున్నాను

అసలు మి గురించి మిరెప్పుడయినా ఆలోచించారా? ఆవేశంగా చెప్పుకుపోతున్న అల్లుడిని ఒక వైపు ఆశ్చర్యం మరో వైపు ఆనందంతో తబ్బిబ్బవుతూ చూస్తున్నాడు పరంధామయ్య

బాబూ ఇవన్నీ మాకు తెలియవని కాదు కూతురు సుఖం కోసం పడే తపనకు కన్న తండ్రి ఇవన్నీ ఆలోచించడు కూతుళ్ళు తమ తమ సంసారాలు చక్కగా చేసుకుంటూ కల కలలాడుతుంటే ఆ తండ్రికి అంతకంటే తృప్తి ఏముంటుంది చెప్పు

అందుకు తనెంత పతనమై పోతున్నాడనే ఆలోచనరాదు తండ్రిగా అంటున్న పరందామయ్య మాటలకు మద్యలో నే అడ్డు పడుతూ

ఆపండి అదే ఆసెంటిమెంట్లే మిమ్మల్ని అదొగతిపాలు చేస్తున్నాయి కట్నుకొన్నవాడు తీర్చకపోతే కన్నవాళ్ళు నడుగుతారు కూతుళ్ళు వాళ్ళు మిమ్మల్ని అర్ధం చేసుకోలేనప్పుడు మిరెందుకు వారికి వంతపాడాలి

## కాంటాక్ట్ లెన్స్‌లు – కొత్త సమస్యలు

కాంటాక్ట్ లెన్స్‌ల వలన కండ్లకు కొత్త సమస్యలు రాగలవని ఇటీవల పశ్చిమ జర్మనీలో ఏషెన్‌లో జరిగిన నేత్ర వైద్యుల సమావేశంలో నిపుణులు పేర్కొన్నారు అయితే ప్రస్తుతం అందుబాటులోకి వస్తున్న అభివృద్ధి చెందిన రకాలు నాణ్యత కొంత మెరుగుగా ఉన్నదని వీరు పేర్కొన్నారు కాంటాక్ట్ లెన్స్‌లు ధరించే వారు ప్రతీ మూడు నెలల కొకసారి కండ్లను పరీక్ష చేయించుకొనడం మంచిదని వారో సలహా ఇచ్చారు ఈ కొత్త రకం కాంటాక్ట్ లెన్స్‌లను ఎక్కువ కాలం ఉపయోగించవచ్చునని రాత్రిపూట వీటిని తొలగించ నక్కర్లేదని వీరు తెలియచేశారు పశ్చిమ జర్మనీలోని అరు కోట్ల జనాబాలో రెండున్నర కోట్ల మంది కంటి అద్దాలు దరించే వారే!

(గ్లోబల్)

## పగలు కాలిన కొవ్వొత్తి

మరొక విషయం చెపుతాను అసలు నేను స్కూటర్‌కి డబ్బివ్వమని అడగలేదు మా యింటి చుట్టుపక్కల వాళ్ళందరికి స్కూటర్లు ఉండటంతో సుగుణకి లేకపోవటం చిన్నతనంగా ఫిలయి నన్ను కొనమంది నేనూ కొనే స్థితిలో లేనుకదా! నాకన్నా హినమయిన స్థితిలో మిరున్నా కూతురు అడుగుతుంటేకాదనలేరు కదా!

మి ఆ బలహీనతని ఆమె క్యాష్ చేసుకుంటుంది ఇవన్నీ మీకు చెప్పడమే కాదు మా నాన్న గార్కి కూడా, ఈ విషయాలు ఉత్తరం వ్రాసాను

నవ్వుతూ అల్లుడి వైపు చూస్తున్నారు పరందామయ్య అతను నవ్వుతూంటే అర్ధంకాలేదు మురళికి

ఎందుకలా నవ్వుతారు ఈసార మికే నేను బట్టలు కొంటాను మిమ్మల్నిద్దర్ని మా యింటికి తీసుకెళ్తాను ఈ పండగలకి ఈ సాంప్రదాయాలకి గుడ్‌బై కొట్టేయాలి అంటూ లేవబోతున్న అల్లుడ్ని

కూర్చో బాబు నేను చెప్పేదికూడా విను అంటూ మరో కాఫీ ఆర్డరిచ్చారు పరందామయ్య

మీరు చెప్పిందంతా సత్యమే కాదనను సాంద్రాయపు అడ్డు తెరలనుండి ఇదంతా మసగ్గానే కనిపిస్తుంది కాని వాస్తవంలో ఈ సమాజం దాన్ని ఒప్పుకోదు అంతెందుకు మా అమ్మాయే చీదరించుకోవచ్చు పండక్కి అల్లుడికి మర్యాద చేయవలసింది పోయి అల్లుడి యింట్లో ఉండటం ఏంటా? అని

వేళ్ళతో పాతుకుపోయిన ఈ ఆచారాన్ని ఒక్క మాటలో నువ్వు కొట్టేయగలిగావు కాని ఫలితం ఎలా ఉంటుందో ఇన్నేళ్ళుగా జీవితాన్ని అనుబవించిన నాకు తెల్సు

సాంప్రదాయపు పగటి వెలుగులో కాలిపోతున్న కొవ్వొత్తి జీవితాలు మావి

ఈ మార్పుకి మా జీవితాలు సర్దుబాటు చేసుకోలేవు

ఎవరెన్ని చెప్పినా మి నాన్న నేను మా తరం ఈ సాంప్రదాయపు నీడల్లో అంతరించి పోవలసిందే

మిరనుకున్నట్లు ఆశించినట్లు మి తరం మారితే మీరు అదృష్టవంతులే ఇప్పటికి మమ్మల్నిలా వదిలేయి ఈ తృప్తితోనే జీవితాల్ని చివరి వరకూ బ్రతకనీ పద అంటూ లేచి బిల్ చెల్లించి వెళ్ళిన పరంధామయ్యతో పాటు బయటకొచ్చాడు మురళి

మిరింటికెళ్ళి విశ్రాంతి తీసుకోండి నాకిటు పనుంది అంటూ వడ్డీ వ్యాపారి వెంకట్రామయ్య ఇంటికి దారితీస్తున్న పరందామయ్యను చూచి నోట మాట రాక అలాగే ఉండిపోయాడు మురళి.□






# 21వ శతాబ్ది వైపుగా ముందంజ




## కలసికట్టుగా ముందుకు నడుస్తూ

davp 85/427

రె డి. సీరియల్



ఇచ్ఛాపురపు రామచంద్రం

(గత సంచిక తరువాయి)

"అబ్బాయ్! రామం

ఏమిటి? అన్నాడు నిర్లక్ష్యంగానూ నిరాశగానూ

నువ్వు చదువుకుందుకు చిన్న మార్గం లేకపోలేదు అన్నాడు మెల్లగా ఆత్రంగా చూశాడు రామారావ్ ఏమిటన్నట్టు

నిజానికది మంచి మార్గమే కూడా ఒక్క దెబ్బకి రెండు పిట్టలు మీ అక్కయ్య పెళ్ళి ఐపోతుంది నీ చదువూ సాగుతుంది

చెప్పు

ఒక సంబంధం వొచ్చింది కుండ మార్పిడి సంబంధం

కుండ మార్పిడి సంబంధ మేమిటి?

వాళ్ళమ్మాయిని నీకిస్తారు వాళ్ళబ్బాయికి నీ అక్కని చేసుకుంటారు ఆ అమ్మాయికి కాలు కొంచెం వంకర చిన్నప్పుడేదో జబ్బు వొచ్చి అలా అయిందట నీ అక్కయ్యకే అవకరమూలేదు కనుక – నీకు ఐదు వేలు కట్నం ఇమ్మన్నా వాళ్ళు మొగ్గవచ్చు ఆలోచించుకో అన్నట్టు చూశాడు పాపారావ్

రామారావ్ మనసులో ఒక్కసారి ఉప్పెన మెదిలింది అంతే అతను తీవ్ర స్వరంతో అన్నాడు నా చదువు సాగకపోతే పోయింది కానీ యిలాటి పెళ్ళి కొప్పుకుని నా జీవితం యింకా నాశనం చేసుకోను

అది కాదురా ఆడదాని కందమేమిటి

తండ్రి మాటలు వినిపించుకోకుండా విసురుగా వెళ్ళిపోయాడు అతను

* * *

నీ యిష్టం డాడీ! నవ్వాడు నిఖిల్ నా మంచి చెడ్డలు నీకన్నా ఎవరికి కావాలి?

గుడ్! చక్రపాణి గారమ్మాయిని చేసుకోడం వల్ల నీకు చాలా లాభముంటుంది అయన – రాజకీయాల్లో పాతుకుపోయిన వాడు ఏ పార్టీ రానీ అయన పొజిషన్‌కి ఢోకా ఉండదు అమ్మాయి నీకు నచ్చింది కదా? ఈ విషయంలో రాజీపడ వొద్దు సుమా!

అమ్మాయి – చాలా అందంగా ఉంది కదా డాడీ!

నీకు నచ్చడమే ముఖ్యం మిగిలిన విషయాల కొట్టే ప్రాముఖ్యం లేదు అంది నిఖిల్ అమ్మ

చాలా నచ్చింది విలిపిగా నవ్వాడతను

ఐతే – మా నిఖిల్ పెళ్ళి కొడుకై పోయాడన్న మాటే!

నువ్వు అత్తగారివై పోయావ్

మీరూ మామగారయినట్టే

అక్కడ నవ్వులూ ఆనందమూ ఈ శుభవార్తని నిఖిల్ అంగీకరించిన వార్తని చక్రపాణికి టెలిఫోన్ చేయడానికి లేచారు వెంకటేశ్వరరావ్ తాను చూసి వొచ్చిన – ఊర్మిళ గురించి తీయని కలలు కనసాగాడు నిఖిల్ చక్రపాణికి టెలిఫోన్ చేసి వొచ్చిన వెంకటేశ్వరరావ్ ముఖం వెలిగి పోతోంది కట్నం కాకుండా మారుతి కారుట ప్యాక్టరీ ఓపెన్ చేసేందుకు అనుమతి కాగితాలూ లోను శాంక్షనూ ఓహ్! నిఖిల్! నువ్వు చాలా అదృష్టవంతుడివి అన్నారాయన కొడుకుని ఆనందంతో కౌగలించుకుంటూ

నేను – మీ అబ్బాయిని డాడీ! సరేకాని కట్నమూ అవీ

నేనడుగుతానా! నెవర్ ఆయనే అవన్నీ ఆఫర్ చేశారు నేను వొద్దన్నా వినిపించుకో లేదు ఆ విషయంలో ఎక్కువ మాట్లాడితే ఏం బాగుంటుంది?

రైట్ నాకు చాలా ఆనందంగా ఉంది ఊర్మిళ చాలా నైస్‌గర్ల్

వాళ్ళ పాదరూ చాలా నైస్ మానే

* * * * * *

ఇంక లాభం లేదనేసుకున్నాడు ఎంకటేసు

అయ్య ఆ నాడు చెప్పిందే నిజంలాగుంది పెళ్ళి చేసుకుంటే తప్ప బతుకు వెళ్ళేటట్టు లేదు సరిగా కూలి పనులు దొరక్క రెండ్రోజులు తింటే మూడ్రోజులు పస్తుండాల్సి వస్తూంది అదిగాక తను మగాడై పోయాడు రాత్రులు ఒంటరిగా నిద్దర పట్టడం లేదు వొళ్ళు వేడిగా ఏదోలా ఉంటూంది

మునెమ్మ బాగానే ఉంది పిక్కలా ఉంది నల్లగా ఉంటేనేం కళగా ఉంది ముఖం వారాని కేడు రోజులూ పని దొరుకుతూనే ఉంటుందట దానికి మేస్త్రీ దగ్గర కూలీట వాళ్ళ మేస్త్రీతో చెప్పి తనకి కూలిప్పిస్తుందేమో పెళ్ళి చేసుకుంటే – పెళ్ళాంతో పో లేకపోతే ఒక్కడివీ పో నా అంతవాడివి నువ్వయ్యావు ఇంకా నా గుడిసెలో ఉండడానికి సిగ్గు లేదూ? అంటున్నాడయ్య తను జవాబు చెప్పలేదని కాదు నేనేటి ఊరికే ఉంటున్నానా? తెచ్చింది తెచ్చినట్టే అమ్మ చేతిలో పోస్తున్నాను కదా ఓ రోజు పని దొరక్క కూలి తేపోతే రాద్ధాంతం చేస్తావు అన్నాడు

రాద్ధాంతవూ లేదు సిద్ధాంతవూ లేదు నీ దారి నువ్వు చూసుకో తొరగా

ఔన్నిజవే వయసొచ్చాక ఎక్కడుండవలసిన వాళ్ళక్కడుండడమే మంచిది అయ్యన్నాడని కాదు తనకి ఓ సంసారమనీ ఆడదనీ ఉండక్కర్లేదేటి? రోజులకేటి? ఎలాగేనా గడుస్తాయి పని దొరికిన

జరిగిన కథ- 7 నిఖిల్‌కి క్రీడలంటే ఆసక్తి ఎక్కువ రామారావు మంచి మార్కులతో క్లాసులో ప్రథముడిగా ఉంటున్నాడు కంపెనీలో ఘోర ప్రమాదానికి గురైన శంకరం శరీరం చూసి ఎంకటేశుకి జ్వరం వచ్చింది పాపారావుకి తన కొడుకు రామారావే ఆశాకిరణం వెంకటేశ్వరరావు తన కొడుకు నిఖిల్ కోసం తాను ఎమ్మెల్యే కావాలనుకుంటాడు నిఖిల్‌కి అమ్మాయిల స్నేహం ఎక్కువయింది రామారావు ప్రేమ ఫలించలేదు ఎంకటేశుకి ప్రేమకన్నా బ్రతుకు ముఖ్యం చేసే కూలి పని ఉంటుందో ఊడుతుందో అని బెంగపెట్టుకున్నాడు నిఖిల్ డబ్బు పలుకుబడి ఉపయోగించి ఇంజనీరింగ్‌లో చేరాడు రామారావు బి కామ్‌లో ఎనభై శాతం మార్కులు వచ్చినా ఆర్థిక ఇబ్బందుల వల్ల ఉన్న ఊర్లో ఎమ్ కామ్ లో చేరాడు నిఖిల్ ఇంజనీరై అమెరికా వెళ్ళి వచ్చాడు రామారావ్ ఎం కామ్ మెరిట్‌లో పాస్ అయినా ఉద్యోగం రాలేదు ఎంకటేశుకి అగ్గిపెట్టెల ఫ్యాక్టరీలో ఉద్యోగం పోయింది రామారావ్ ఐ ఏ ఎస్ ప్రిలిమినరీ పాస్ అయ్యాడు ఫైనల్ ఎగ్జామ్‌కి మద్రాసో ఢిల్లీనో వెళ్ళి కోచింగ్ తీసుకోవాలంటే ఆర్థిక సమస్య అడ్డువస్తోంది

నాడు తను తెస్తాడు లేకపోతే ఆడది తెస్తుంది అయ్య మాట సబువే తినే నోరుతో పాటు ఆడదానికి రెండు చేతులూ బగవంతు డెందుకిచ్చాడు? పన్సెయ్యమనే మొగుడూ పెళ్లాల్లో ఎవరు తెస్తే ఏటి? ఇద్దరూ తినగలిగితే సాలు

మునెమ్మని మనువాడతాను అనేశాడెంకటేసు అయ్య ముఖంతో పాటు మిగిలిన కులపెద్దల ముఖాలు కూడా వికసించాయి ఆ మాటకి పెళ్లయితే - ఆళ్లకి విందు దొరుకుతుంది ఏందంటే మాంసమూ సారా సెబాసయిన మాటన్నావు మగాడనవలసిన మాటన్నావు అన్నారు వాళ్లు మరుక్షణం అక్కడ ఉత్సాహం వెల్లివిరిసింది బామ్మడికి కబురు సేసి మంచిరోజు కనుక్కొండి మూడు ముళ్లూ ఏయించేద్దాం అన్నాడెవరో ఒక కులపెద్ద

మునెమ్మకి ఎంకటేసు నచ్చాడు

ఎంకటేసుకి మునెమ్మ వచ్చింది

ఇద్దరికీ – కలసి బతుకుదామనే ఊహ నచ్చింది

కాని –

రామారావుకి వసంత ఏమాత్రమూ నచ్చలేదు ఆమె కాలి వంకర నచ్చలేదు ఆమె ఉషలా ఉండకపోవడం అసలు నచ్చలేదు పాపారావుకి మాత్రం వసంత తండ్రి యిస్తానన్న పదివేలూ నచ్చాయి రెండో అమ్మాయికి పెళ్లయిపోవడం నచ్చింది పెళ్లి ఖర్చులు కూడా వాళ్లే పెట్టుకోవటం మరీ నచ్చింది అబ్బాయిని ఉద్యోగం వొచ్చాకే వసంతని కాపురానికి తీసుకు వెళ్ళదురుగాని అనడం మరీ మరీ నచ్చేసింది దానితో

నీకు పెళ్లికి తొందరలేదు సరే నీ అక్కకి మహ తొందరగా ఉంది నేడో రేపో పెళ్లి చెయ్యకపోతే ఏ టైలరు సాయిబుతో నో లేచిపోయినా ఆశ్చర్యంలేదు అలా ఉంది దాని ప్రవర్తన అంచేత - నీ కోసం కాకపోయినా దానికోసం అయినా ఉ అను ఇప్పటికే వీధిలోకి వెళ్తే నలుగురూ మా ముఖాన పేడ నీళ్ళు జల్లుతున్నారు - కూతురికి పెళ్లిచేయవా అని అంటూ తల్లీ తండ్రీ రామారావ్‌ని బయపెట్టేసి మెదలు వంచేశారు అతన్ని మాట్లాడనివ్వలేదు

పెళ్లికూతురి మెడలో తాళి కడుతూంటే ఉషే మెదులుతోందతని మనసులో పెళ్లి చేసుకుని ఆ డబ్బుతో ఐ ఏ యస్ ఫైనల్‌కి కోచింగ్ సెంటర్‌లో చేరవచ్చునన్న విషయమే మెదులుతూంది అతను - వసంతలో ఉషని చూస్తున్నాడు పెళ్లిలో తన అయ్యేయస్ ఫైనల్‌ని చూస్తున్నాడు

అదే ముహూర్తానికి -

నిఖిల్ వివాహం - అట్టహాసంగా జరుగుతూంది రాజకీయాలతో పాటు వివిధ రంగాలలో ప్రముఖులు కార్లలో వచ్చారు మినిస్టరు గారబ్బాయి పెళ్లికి దేవుడి పెళ్లంత ఘనంగా జరుగుతోందా వివాహం కళ్యాణమండపాలంకరణకే పాతిక వేలయింది

రామారావ్ వివాహం - కొండమీద అన్నవరం కొండ మీద జరుగుతూంది బంధువులు వొచ్చారు గానీ మరీ ఎక్కువమంది లేరు పెళ్లయితే చాల్లే అన్నట్టున్నారు యిరుపక్షాలవారూ కుండమార్పిడి కనుక ఇద్దరు వియ్యంకులూ ఆడపెళ్లివారే ఇద్దరూ మగపెళ్లివారే

ఎంకటేసు పెళ్లి గుడిసె ముందే చిన్న పందిరిలో జరుగుతూంది ఎంకటేసూ పెళ్లికూతురూ కొత్త బట్టలు కట్టుకున్నారు పందిరి కవతల మాంసం ఉడుకుతోంది సారా సిద్ధమవుతోంది కాలనీలో ఆ మాత్రం హడావిడికే అందరూ చేరుతున్నారు నిఖిల్ రామారావ్ ఎంకటేసు ఒకే నిమిషంలో జన్మించడం వల్లనేమో ముగ్గురికీ ఒకేసారి పెళ్లికూడా అయింది తేడా జరిగే తీరులోనే

## 16

పెళ్ళప్పటి మాటలు నాగవెల్లికుండవు ఇది , యీ పెద్దల మాట అక్షరాలా నిజమయింది రామారావ్ విషయంలో రామారావ్ మామగారు పెళ్లి బాకీ ఐదు వేలూ తీర్చలేదు అడిగితే బోలెడు కష్టాలు ఏకరువు పెట్టేసాడు అమ్మాయి పెళ్లిచేసి మునిగిపోయానన్నాడు అంతేకాదు అర్జంటుగా అమ్మాయిని తీసుకెళ్లాలని పట్టుబట్టాడు

మన కుటుంబాల సంగతి మీకు తెలియనిదేముంది? పెళ్లయ్యాక ఆడపిల్ల పుట్టింట్లో అర రోజుందో అందరూ ఆ మాటా యీ మాటా అనేవారే అపవాదూ అపనిందా

పాపారావ్ ఊరికే ఊరుకోలేదు మీ అల్లుడి ఐ ఏ ఎస్ ? మీ అమ్మాయి సుఖపడుతుంది మీ మాట ప్రకారం ఐదు వేలూ యివ్వండి కనీసం అప్పుగానయినా వాడిని పెళ్లికి వొప్పించింది యీ షరతు మీదనే అన్నాడు

మాటలకేమిటి? అన్నీ అనుకుంటాం అన్న ప్రతి మాటా చెల్లించేడానికి మనమేమన్నా సత్య హరిశ్చంద్రులమా? మహామహులే అవసరార్థం అనేకం అంటున్నారు మాట నిలబెట్టుకోలేక పోతున్నారు మీరూ నేనూ ఎంత? అనేశాడాయన అతి దీమాగా ఆయనకి బయం ఎందుకు? తమ పిల్ల వాళ్లింట్లో ఉంటే వాళ్ల పిల్ల తమ యింట్లో ఉంటుంది పెళ్లయిపోయిందిగా ఇంకెవరేం చెయ్యగలరు?

అదికాదు మీ అల్లుడు అయ్యేయస్సయితే మీ అమ్మాయి

అందుకని యిప్పుడు నేనెక్కడి నుంచి ఐదువేలూ అప్పు చేసేది? తల మునిగే అన్ని అప్పులు చూడండి బావగారూ! ఈ పులుసుతో యీ ముద్ద దిగనివ్వండివాళ్టికి రేపటి సంగతి రేపు చూసుకుందాం ఇవాళ మంచిరోజు అమ్మాయిని వెంటబెట్టుకుని వెళ్లండి చలిమిడి చేయిస్తాను బార్యాభర్తలనురాగం కావాలి గాని అతనయ్యేయస్ అయితే ఏమిటి మరొకటయితే ఏమిటి? ఈ వయసులో వారిని విడదియకండి అంటూ కూతుర్ని ఆయన కంటించేశాడు

ఐదు వేలూ తీసుకురాలేదు సరికదా ఆవిడని వెంటబెట్టుకొచ్చిన తండ్రిని చూసి వొళ్లు మండిపోయింది రామారావుకి తను చెప్పిందేమిటి? తండ్రి చేసిందేమిటి?



నేనేమి చెయ్యలేనురా మీ మామగారు మూర్ఖుడూ మహా మొండి అని - ఒక్క ముక్కతో కాళ్ళు జాచేశాడు పాపారావు

వివాహం విద్య నాశాయ శోబనం - సర్వనాశాయ కాపురం ? కష్ట సమన్వితం అనుకొన్నాడు రఘూరావు మనసులో మెడకో గుదిబంద! ఏం చేయడం? భార్యని కన్నెత్తి చూడలేదు పన్నెత్తి పలకరించలేదు

పెళ్ళి తనని మోసం చేసేసింది!తను గోతిలో పడిపోయాడు శాశ్వతంగా ఇక దీని నుంచి బయటపడడం తన తరంకాదు ఈ బతుకికి యింతే అతనికి ఉష జ్ఞాపకం వచ్చింది

* * * * *

నిఖిల్‌కెవరూ జ్ఞాపకం రావడంలేదు అతనికి - కన్ను తెరచినా మూసినా ఊర్మిళే అమె అందమైనది ఈ ఖరీదయిన హనీమూన్ - మామగారే ఏర్పాటుచేశారు ఒక నెల దేశమంతా చూడడం కన్యాకుమారి నుంచి కాశ్మీరు వరకూ అతి ఖరీదయిన హోటళ్ళలో అందమయిన ప్రదేశాలలో వింతలూ విచిత్రాలూ చూస్తూ మామగారు మహా మంచివారు అన్నీ తెలిసినవారు

ఓ నెల హాయిగా తిరిగి రండోయ్ యిద్దరూ కొత్త రోజులు మళ్ళీ రావు లైఫ్‌ని ఎలా ఎంజాయ్ చేయాలో - అలాగే ఎంజాయ్ చేయాలి అంటూ ఎయిర్ రిజర్వేషన్స్ అందించాడు ఎక్కడికక్కడే తామిద్దరూ సర్వ విధాలా సుఖపడేలా ఏర్పాట్లు ట్రావెల్ ఏజన్సీలు హోటల్ బుకింగ్స్ కారు అన్నీను

ఊర్మిళ లబించడం తన పూర్వజన్మ పుణ్యం అందమొక్కటే కాదు అమె ప్రవర్తన చాలా బాగా ఉంటుంది ఎంతో కలుపుగోలు మనిషి ఎప్పుడూ అమె పెదవుల మీద చిరునవ్వే అమె నన్నదే ఒక స్వర్గం ఈ హనీమూన్ తమ జీవితాలకు మంచి స్మృతి

## త్రివేణి

నిజానికి పెళ్ళయిన వెంటనే కాశ కొంచెం నెలలు అలస్యంగా జరగుతూంది హనీమూన్ అందుకు కారణం తనే

హాయ్! నిఖిల్! మార్నింగ్

మార్నింగ్

అమె చేతిలో ఉత్తరం ఉంది రాత్రి మరచిపోయాను నాన్నగారు ఉత్తరం రాసారు

రాత్రులు - నాన్నగారూ ఉత్తరాలూ జ్ఞాపకం రావులే నవ్వాడు

నువ్వు రానివ్వవు అఫ్‌కోర్స్ - పగలూను

విశేషమేమిటి?

మన ఫ్యాక్టరీకి గ్రీన్ సిగ్నల్స్ శాంక్షన్లు త్వరత్వరగా వొస్తున్నాయి

మీ నాన్నగారు

మీ నాన్నగారూను అందామె నవ్వుతూ

మరి యీ శుభసందర్భాన్ని సెలిబ్రేట్ చేసుకుందాం అతనామె వేపు నడిచి - దగ్గరగా తీసుకుని అమె పెదవుల మీద తన ప్రేమనీ అనురాగాన్నీ అంతటినీ ముద్రించాడు ఊర్మిళ ముందు - అతనికి పూర్వాశ్రమంలోని ప్రేమలు గానీ అమ్మాయిలు కానీ - ఎవరూ ఏమీ జ్ఞాపకం రావడంలేదు అతనికి జీవితం నందనవనంలాగా ఊర్మిళ ఊర్వశీ నా ప్రేయసిలాగా తోస్తూంది కుబేరుడూ దేవేంద్రుళ్ళలాటి తండ్రీ మామ గారూ ఉన్నారతనికి మరి

* * * * *

తండ్రీ మామగారూ ఉన్నా లేనట్లే లెక్క ఎంకటేసుకి

అతనికున్నది ఒక్క మునెమ్మ మాత్రమే ఆ కాలనీలోనే చివరగా చిన్న గుడిసె తీసుకుని ఉంటున్నారిద్దరూ అది వాళ్ల అనవాయితీ

పెళ్ళితో పొయ్యి వేరు కావలసిందే తల్లీ తండ్రి ముసలివాళ్ళయి తమని తాము పోషించుకోలేకపోతే అప్పుడు వాళ్ళు యిద్దరూ కొడుకు గుడిసెకొచ్చి అతనితో నివశిస్తారు సింహాచలమూ అతని బార్యా యింకా ఓపిగ్గానే ఉన్నారు కనుక - కొడుకు దగ్గరకి చేరలేదు అందుచేత ఎంకటేసూ మునెమ్మా విడిగానే ఉన్నారు

ఎంకటేసు - మునెమ్మతో హాయిగానే ఉన్నాడు తెల్లారేదు గంటలకి అమె పన్లోకి పోతుంది యింత కూడొండేసి తరవాత ఎంకటేసూ పనెతుక్కుంటూపోతాడు వాళ్ళు మళ్ళీ కలిసేది చీకటిపడుతుండే వేళకి గుడిసె చేరుకొన్నాకే మునెమ్మ కూడొండితే - వెన్నెల్లో - గుడిసె ముందు కూర్చుని ఊసులాడుకుంటూ సరసాలాడుకుంటూ తిండి తినడం అయిందనిపిస్తారు ఇంక - తరవాత వాళ్ళు గుడిసెలోకి పోతారు మళ్ళీ ఎప్పుడో అర్ధరాత్రికి మునెమ్మ - నులకమంచం తెచ్చి గుడిసె ముందు ఆరుబయట పడేస్తే - దానిమీదకు చేరుతాడు ఎంకటేసు

ఎలాగో ఒకలాగ రోజు గడిచిపోతూంది కలో అంబలో కడుపుకింత పడుతూంది రెండు పూటలా ఉండడానికి గుడిసె ఉంది ఇంకేం కావాలా కొత్త దంపతులకి? ఎంకటేసు - పేదవాడు కనుక పెళ్లామే భార్య వాడికి జ్ఞాపకాలు లేవు జ్ఞాపకం తెచ్చు కుందుకు ప్రేమలూ లేవు జ్ఞాపకం తెచ్చుకోవలసిన అవసరమూలేదు వాడి మనసు కిప్పుడు హాయిగా ఉంది రేపటి గురించి చింతలేదు ఎలాగో ఒకలాగా గడవకపోదులే అన్న దీమా ఉంది వాడి పరిధి చిన్నది వాడి అలోచనలు చిన్నవి వాడి అశలు చిన్నవి వాడి కోర్కెలు చిన్నవి అందుచేత - వాడి బాధలూ చిన్నవే ఎంత పీత కష్టాలు పీతవనుకొన్నా మునెమ్మ సమక్షంలో వాడికి బతుకంటే దీమా వొచ్చేసింది అయితే - వాడు -పనికోసం మంచి ఉద్యోగం కోసం కష్టపడడం లేదనికాదు పగలంతా జీవితం గురించి ఏమయినా యాతనపడినా రాత్రి యింటికొచ్చి మునెమ్మని చూసేసరికి అన్నీ మరిచిపోతాడు చీకూ చింతా లేకుండా రాత్రి గడిపి - హాయిగా నిద్రపోతాడు సంపాదించినదానిలో వొచ్చినంత తినడం సుఖంగా కబుర్లు చెప్పుకొని స్వర్గం చూసి తెల్లవారేక మళ్ళీ ఊరిమీద పడడం

ఆ గుడిసె - స్వర్గంకాదు అయినా ఎప్పుడూ చీకటిపడుతుందా ఎప్పుడు మునెమ్మ తనూ కబుర్లు కలబోసుకుంటూ కమ్మగా గడుపుదామా అని ఆత్రంగా ఎదురు చూస్తాడు ఎంకటేసు వాడు మునెమ్మా అనడు మణెమ్మా అనే పిలుస్తాడు అతనికామె ఒక్కతే స్త్రీ ఆ గుడిసే స్వర్గం

## 17

ఏమండీ! యీవేళ మీ పుట్టిన రోజండీ!

వినిపించినా వినిపించనట్టుండిపోయాడు



రామారావ్ ఈ జీవితానికి పుట్టిన రోజు వొక్కటే తక్కువ!

హఠాత్తుగా అతనికేదో విషయం జ్ఞాపకం వొచ్చింది అంతే మరుక్షణం అతని కళ్ళవెంట నీళ్ళు రాసాగాయి

ఏమిటండి మీ కళ్ళల్లో నీళ్ళు! రండి లెండి తలంటుపోస్తాను పుట్టిన రోజు పూట అయినా తలంటుకోకపోతే ఎలా? పరవాలేదు మీ కంట్లో కుంకుడు పులుసు పడకుండా నేను తలంటుతానుగా లాలిస్తున్నట్లే అంది భార్య

గెటౌట్ అరిచాడతను గట్టిగా

ఆమె తెల్లబోయింది నేనేం తప్పుచేశానని? కాని మాటన్నానని? తలంటుతానన్నానంతేగా

ఐసే గెటౌట్ మళ్ళీ అరిచాడతను

ఆమె కళ్ళలోకి నీళ్ళు వొచ్చేసాయి అతని నిరాదరణకి ఎప్పుడూ యింతే తనంటే చిరాకే తన ముఖం చూస్తేనే చాలు చిటపటలాడతారు అంత యిష్టంలేనివారు తననెందుకు పెళ్ళిచేసుకోవాలి? తన వాళ్ళేమి దాచలేదే తను కుంటిదని తెలిసి చేసుకుని యిప్పుడు చిరాకుపడితే ప్రయోజనమేమిటి?

నన్ను వొంటరిగా వొదిలి నువ్వు దయచెయ్యి యిక్కడినుంచి కావాలంటే నీ కాళ్ళకు దణ్ణం ఎడతా కోపంగా అరుస్తున్నాడు రామారావ్ అతని ముఖము వాలకమూ పిచ్చివాడిలా ఉన్నాడు

## కాలం గొంతులో

పరాక్రమాన్ని
దురాక్రమణకు
వెచ్చించితే
వచ్చేది సంక్షోభం –
అనంతశక్తిని
శాంతి సంరక్షణకై
వినియోగిస్తే
వస్తుంది సంక్షేమం –
అందుకే చెప్తున్నా!
భూగోళపు బంతితో
ఆటలాడకండి
కాలం గొంతులో
హాలాహలం పోయకండి–

— బొగ్గరపు రాదాకృష్ణమూర్తి

ఏం మాటలండి అవి? అలాగే పోతానులెండి ఎంత తొందరగా నా పీడ మీకు లేకుండా శాశ్వతంగా పోతానా అనే నేనూ ఎదురు చూస్తున్నాను ఏడుస్తూ కళ్ళు తుడుచుకుంటూ అక్కడినుంచి కదిలిందామె కుంటుతూ - కాలీడుస్తూ నడుస్తున్న ఆమెను చూస్తుంటే అతనికి మరింత కోపం వొచ్చేసింది ఆమె మీద మండిపడేవాడే కాని ఆమె వెళ్ళిపోయింది అతనికి దూరంగా గది అవతలకి

అతనికి ఏడుపొచ్చేసింది ఎంత ప్రయత్నించినా దుఃఖం ఆగడంలేదు అతనికి పిచ్చెక్కిపోతోంది

రామారావ్ - జుట్టు పీకేసుకుంటున్నాడు

పళ్ళు కొరికేసుకుంటున్నాడు

ఏడిచేస్తున్నాడు ఉండి ఉండి అతను గొణుక్కుంటున్నాడు తనలో తానే

ఐపోయింది

అంతా ఐపోయింది

సర్వనాశనం ఐపోయింది

ఇంక జీవితంలేదు బాగుపడే అవకాశాలూ మార్గాలూ లేవు అన్ని అవకాశాలూ మార్గాలూ పూర్తిగా మూసుకుపోయాయి శాశ్వతంగా మూసుకుపోయాయి

ఇవాళ తను పుట్టిన రోజు కాదు

సమాధౌతున్న రోజు

నిశ్చయంగా అంతే తను సమాది ఐపోయాడు తన జీవితం శాశ్వతంగా సమాధైపోయిందివాళ్టితో

ఔను

తన కిరవైఎనిమిదేళ్ళు నిండిపోయాయి

ప్రభుత్వోద్యోగానికిక పనికిరాడు ఐ ఏ యస్ అవకాశం దాటిపోయింది బ్యాంక్ ఆఫీసరు కూడా కాలేదు

ఏమీ కాలేదు ఇంక యీ జీవితమింతే

(ఇంకా ఉంది)



వై డి, రావులపాలెం

★ గొప్పవారందరూ త్వరగా పోతా రెందుకని?

● అలాంటి దాఖలాలు లేవే!!

ఎల్ సి హెచ్ పాపినేనిపల్లి

★ మీ అమ్మాయి ఒక హరిజనుల అబ్బాయిని పెళ్లి చేసుకుంటానని మొండిపడితే మీరేం చేసేవారు?

● నూతిలో మటుకు పురకను!

సిహెచ్ కె వల్లివలస

★ మీకు మ్యారేజి అయిందా?

● ఆ! ముప్పయి ఏళ్లవుతోంది

ఎన్ వి కె పొద్దుటూరు

★ ఆలస్యం అమృతం విషం అంటూనే నిదానం ప్రధానం అంటారోయా రెండింట్లో దేనిని పాటించాలి?

● అదనుపట్టి పాటించవలసినదని దాని సలహా-అంతేకాని ఏదో ఒకటి పాటించాలనికాదు

చందు కదిరి

★ వెధవ చచ్చు ప్రశ్నలు సమాధానాలు మీరు పేజి చించేయాలన్నంత కోపం వస్తుంది పత్రిక తెరవగానే

● ఎవరాపు తున్నారు- చింపెయ్? లేక ఓ సారి చదివేసి చింపాలని ఆగుతున్నారా?

పి ఎన్ విశాఖపట్నం

★ ప్రశ్నావళికి పూర్వం మూడు ప్రశ్నార్థకాలుండేవి ఇప్పుడో స్త్రీ బొమ్మ వుంటోంది అదేమి చిత్రం వేస్తే మీతో మాట్లాడుతున్నట్టు సంతోషించే వాళ్లం కదా?

● చిత్రకారునికి కూడా సరదా లుంటాయని- దానికి అర్థం




పి కె గుంటూరు

★ చదువు గొప్పా? సంస్కారమా! గుణమా? ధనమా?

● పూర్వం చదువుంటే అన్ని ఉన్నట్టు ఇప్పుడు డబ్బుంటే- అన్ని వున్నట్టు అంచేత మీరు తేల్చుకోవాలి

★ ఆడదాన్ని మగాడు మగాడిని ఆడది అర్థం చేసుకుందుకు ఎంత కాలం పడుతుంది

● ఓ జీవిత కాలం కూడా చాలదని నా అనుమానం

జి వి ఆర్ పాల్వంచ

★ మీ జీవితంలో ఎవరినైనా మీరు మనస్ఫూర్తిగా ప్రేమించారా?

● ఆ!

ఎల్ వి ఆర్ నౌపాడ

★ రామలక్ష్మిగారూ నేను ఆదర్శాలు గల యువకుడిని నేను మీ అమ్మాయిని పెళ్లి చేసుకోవాలను కుంటున్నా మీరు అంగీకరిస్తారా?

● సారీ- బెటర్‌లక్ ఇన్‌ది నెక్స్టు జన్మ?

కె ఎస్ ఎన్ మాడుగుల

★ ప్రశ్నావళి పత్రికకే హైలైట్ రెండు పేజీలేనా వెయ్యాలి కనీసం

● ఎందుకు రెండు వారాల్లో మీరే- ఆపేయండి అనడానికా? బాగున్నది- యింక కావాలని ఎస్తున్నప్పుడు ఆగాలి

ఆర్ ఎమ్ ఆర్ కాశీబుగ్గ

★ మీకు అనుకోకుండా పెద్ద ఉద్యోగం వచ్చిందనుకోండి అప్పుడు ప్రశ్నావళికి రాజీనామా చేస్తారా?

● ప్రశ్నావళి ఉద్యోగం కాదు రాజీనామా ఏమిటి?! ప్రయత్నించినా నా కెవరూ ఉద్యోగం యివ్వరు మీకాభయం లేదు!

జి ఆర్ ఆర్ బిలాయి

★ హిందూ మత సంస్కరణ జరగడం లేదు అన్ని అర్థరహిత మైన ఆచారాలు సంప్రదాయాలు పైవారి విమర్శకి తల ఒంచక తప్పడం లేదు

● ఏమతంలో లేవు అర్థరహిత మైన ఆచారాలూ సంప్రదాయాలూ? చెప్పండి ఏ హిందు మతం మూర్ఖంగా మిమ్మల్ని - అనుసరించమని వేధించడం లేదే? నేను హిందువునే నమ్మకాలున్నదాన్నే మూఢాచారాలని అవలంబించడం లేదే వ్యక్తుల నిర్ణయాలని పట్టుకుని మతాన్ని ఆడిపోసుకోడం అవివేకం

జి వి ఆర్ కర్నూలు

★ వచ్చే వారికి పోయే వారికి తేడా ఏమిటి? దారి! వచ్చేరూట్ ఒకరి దైతే- వెళ్లే రూట్ యింకో కరిది- కాదా?

ఎన్ వి కరీంనగరు

★ బ్రహ్మ చర్య నియమాల ననుసరించే వారికి- యింద్రియ సుఖాసక్తి ఉండదంటారు మరి సృష్టికి ప్రతిసృష్టి చేయకల్గిన విశ్వామిత్రుడు గంధర్వ కన్య సంపర్కంతో నే కదా శకుంతలను కన్నది? దీనిపై మీ అభిప్రాయం?

● సంభోగ ప్రాప్తి దాకా అంతా సన్యాసులే!!

జి ఆర్ చంద్రగిరి

★ ఆరుద్రగారి చదరంగం మీద పుస్తకం రాశారట ఎక్కడ దొరుకుతుంది?

● న్యూస్టూడెంట్ బుక్‌హౌస్ విజయవాడ-2

★ సమస్యలు పరిష్కరించుకోలేక జాతకాలు రాశులు మంత్రాలు నమ్మేవారి మీద మీ అభిప్రాయం?

● ఏం లేదు కంప్యూటర్ స్పెషలిస్టులు శాస్త్రవేత్తలు మహామేధావులు-అనుకునే వారే- జాతకాలు కుదరాలనుకుంటున్నప్పుడు -సాదా సీదా వాళ్లు అనుకోవడంలో- నాకు వింత కనబడలేదు 






# రోత

## అలపర్తి రామకృష్ణ

వెంకటస్వామి చనిపోయి అప్పటికి వారం రోజులైంది

రామచిలుక వున్న పెట్టె భుజాన తగిలించుకోబోయాడు పెంచలయ్య

వాకిలి వూడుస్తున్న రమణమ్మ ఉదయం నుంచి కొడుకు వాలకం గమనిస్తూనే వుంది కొడుకు రామచిలుక పెట్టె అందుకోగానే చీపురు కింద పడేసి గుమ్మానికి అడ్డంగా నిలబడింది

పెంచలూ? నా మాట వినరా! ఆ చిలుక పెట్టె మనకి కలిసి రాలేదురా మీ తాత చిలుక జోస్యం చెప్పేవాడు ఆయన దగ్గర ఇరవై చిలుకలు వుండేవి పట్టుమని ఏ చిలుకా రెండు నెలలు ఆయన దగ్గర వుండేది కాదు తాగుడుకు డబ్బులు అవసరం అయితే అమ్మేసేవాడు వుంచుకున్న దానికి చిరకొని పెట్టాలంటే దగ్గరున్న రామచిలుకల్ని అమ్మేవాడు కొత్త వాటిని పట్టుకుని మచ్చిక చేసేవాడు నెలరోజుల్లో ఆయన చిలుక జోస్యం చెప్పినన్నాళ్ళూ కటిక దరిద్రం అనుభవించేవాడు చిలుక పెట్టె పట్టుకోవద్దని మీ నాన్నకి చెప్పేడు చనిపోయే ముందు మీ నాన్న వింటేగా! మీ తాత చచ్చిన మర్నాడే పెట్టె పట్టుకుని మీ నాన్న బయల్దేరాడు దరిద్రం మనల్ని వొదలి పెట్టలేదు మీ తమ్ముడికి పోలియో జబ్బు వొచ్చి కాళ్ళు చచ్చుబడిపోయింది ఎందు కనుకున్నావురా! అన్నెం పున్నెం ఎరుగని రామచిలుకల్ని పట్టుకుని రెక్కలు కత్తిరించి పెట్టెలో పెట్టి చిత్రహింసలు చేసినందుకే

ఆమె కళ్ళు చెమ్మగిల్లినాయి

మనం బతికేదెట్లాగమ్మా? - అన్నాడు పెంచలయ్య తల్లికి నచ్చచెప్పాలనే ప్రయత్నంలో

అందరూ చిలుక జోస్యం చెప్పి బతుకుతున్నారా! కూలినాలి చేసుకుని పొట్ట నింపుకుందాం కానీ మనకు చిలుకలు సంపాదించిన కూడొద్దురా!

నీదంతా చాదస్తమమ్మా! ఈ పెట్టెలో చిలుక రోజుకి పది రూపాయలన్నా సంపాదిస్తుంది మనం రెక్కలు ముక్కలు చేసుకున్నా చిలుక సంపాదించినంత సంపాదించలేం వో రోజు పని దొరికితే మరో రోజు మనకి పని దొరకదు జ్వరం వొస్తే పస్తు పడుకోవాల్సిందే మనం చిలుక అలాకాదు గదా రోజూ మనకి డబ్బు వొచ్చేటట్లు చేస్తుంది అసలు నీకేం తెలియదు లేవే నువ్వు తప్పుకో! ఇప్పటికే బాగా ఎండెక్కింది

రమణమ్మని నెట్టుకుని రోడ్డు మీదకు పరుగెత్తాడు పెంచలయ్య

పెంచలయ్య వయస్సు పదహారేళ్ళుంటాయి

కొత్తగా ఉద్యోగం దొరికిన వాడిలా ఉషారుగా నడుస్తున్నాడు

తండ్రి బతికున్నప్పుడు రామచిలుక వున్న పెట్టెను అంటుకోనిచ్చేవాడు కాదు, ఇప్పుడు తనిష్టం చిలక తన సొంతం

పెంచలయ్య తండ్రి వెంకటస్వామికి రామచిలుకల్ని పట్టుకోవడంలో వాటికి తర్ఫీదు యివ్వడంలో మంచి నేర్పు వుండేది

రామచిలుకని పట్టుకోగానే దాన్ని వారం రోజులు తిండి పెట్టకుండా పస్తు వుంచేవాడు వరుసగా పేర్చిన అట్టతో చేసిన కవరు ముక్కుతో తీసి యిస్తేనే వడ్లగింజో మొక్కజొన్న గింజో జామకాయ ముక్కో పెట్టేవాడు చిలుక చెప్పినట్లు వినకపోతే తల మీద చిన్న కర్రపుల్లతో కొట్టేవాడు చేతిలో కర్రముక్క చూడగానే గడ గడ వణికిపోయేది రాంచిలుక అది ఎగిరి పోకుండా రెక్కల్ని కత్తిరించేవాడు

రాంచిలుకకు శిక్షణ పూర్తవగానే దాంతో ఎంతో సన్నిహితంగా వుండి చెలిమి చేసుకునేవాడు అతను చెప్పినట్లు వినేది రాంచిలుక

మొదట్లో పదికి పైగా చెక్క పెట్టెలుండేవి యింట్లో వొక్కొక్క పెట్లో రెండేసి చిలుకలు వుంచేవాడు రోజుకో పెట్టె తీసుకు వెళ్ళేవాడు చివరకు ఒక్క చిలుకే మిగిలిపోయింది వెంకటస్వామి చనిపోయే నాటికి

వెంకటస్వామి తండ్రికి తాగుడు అలవాటంటే వెంకటస్వామికి పేకాట పిచ్చి వుండేది సంపాదించినదంతా పేకాటలో తగలేసేవాడు ఇంటికి వొక్క పైసా తీసుకు వచ్చేవాడు కాదు డబ్బు అవసరమైనప్పుడల్లా చిలుకల్ని అమ్మేస్తుండేవాడు రమణమ్మ కూలి నాలి చేసి సంసారం నెట్టుకు వస్తూ వుండేది

చిలుక జోస్యం చెప్పడంలో వెంకటస్వామి మంచి నేర్పరి మనిషిని బట్టి జోస్యం చెప్పేవాడు

జోస్యం చెప్పించుకోవడానికి వొచ్చిన మనిషి ముందు డబ్బులు తీసి పట్టా మీద పెట్టకపోతే కర్రముక్కతో చిలుకకు సంజ్ఞ చేసేవాడు చిలుక కవర్ల చుట్టూ తిరిగి పెట్టెలోకి వెళ్ళిపోయేది అదృష్టాన్ని తెలిపే కవరు తియ్యకుండా

కవర్లో చిన్న దేవుడి బొమ్మ ఐదారు వాక్యాలున్న కార్డు ముక్క వుండేవి అవి చూసి ఎదురు కూర్చున్న వ్యక్తికి ఉత్సాహం కల్గించేలా మాట్లాడేవాడు వెంకటస్వామి

నీకు ఆంజనేయస్వామి బొమ్మ వొచ్చింది నువ్వు చాలా ధైర్యశాలివి ఏ కష్టాన్నయినా ఎదుర్కొంటావ్! ఈ సంవత్సరంలో నీ నుంచి శని పక్కకు తప్పుకుంటాడు నీ కష్టాల నుంచి గట్టెక్కుతావు హనుమంతుడు సీతమ్మవారి జాడ కనుక్కున్నట్లు నువ్వు లక్ష్మీదేవి జాడ కనుక్కుంటావు నీ యిల్లు బంగారమయమై పోతుంది ఈ సంవత్సరం పంటలు బాగా పండుతాయి - అనేవాడు జోస్యం చెప్పించుకునే వ్యక్తితో

నాకు పొలమే లేదుగా - ఎవరన్నా ఎదురు మాట మాట్లాడితే

ఈ సంవత్సరం నువ్వు తప్పకుండా పొలం కొంటావ్ చిలుక పలుకులకు తిరుగులేదు! - అనేవాడు

ఈ దోరణిలో సాగేది చిలక జోస్యం

కాలేజి కుర్రాడిని చూసి నువ్వు పరీక్షల్లో పాసవుతావ్ అనేవాడు గడ్డం పెంచుకుని తిరిగే కుర్రాడిని నీకు ఉద్యోగం దొరుకుతుంది అని ధైర్యం చెప్పేవాడు హైస్కూలు కుర్రాడికి నీకు ఇద్దరు పెళ్ళాలు అని చెప్పి నవ్వించేవాడు

వెంకటస్వామిని చూడగానే జనం చుట్టూ మూగేవారు అంతకుముందు చెప్పించుకొన్న వాళ్ళే మళ్ళీ చెప్పించుకొనేవాళ్ళు చిన్నపిల్లలు పెట్టె పక్కనే కూర్చుని చువ్వల తలుపు తియ్యగానే బయటకు వొచ్చి అట్టతో చేసిన కవర్లపై దర్జాగా నడుస్తూ అటు ఇటూ తేరిపార చూసి కవరు తీసి వెంకటస్వామి చేతిలో పెట్టే అందాల రాంచిలుకను చూస్తూ ఆనందించేవాళ్ళు

డబ్బులు ఇవ్వడానికి పిసినారితనం చూపినవాళ్ళకు చావుగండం వుందని బెదిరించేవాడు వాళ్ళు భయపడి అతను అడిగినంత డబ్బులు ఇవ్వగానే నవగ్రహ పూజ చేస్తే చావు గండం నుంచి బయటపడవొచ్చని చిట్కా చెప్పేవాడు

కొంతమందికి చిలుక జోస్యం మీద నమ్మకం లేకపోయినా చిలుక చేసే పనులు చూడ్డానికి ఆసక్తిగా అతని దగ్గర చేరేవాళ్ళు

అప్పుడప్పుడు పెంచలయ్య తండ్రితో పాటే టౌనుకు వెళ్ళేవాడు తండ్రి చెప్పే చిలుక జోస్యం శ్రద్ధగా వినేవాడు

పెంచలయ్య గర్వంగా నడుస్తున్నాడు రోడ్డు మీద

కన్పించిన ప్రతివ్యక్తి జాతకం చెప్పెయ్యగలనన్న ధీమా ఏర్పడింది వాడికి

ఈ రోజు సంపాదనంతా తనది

ఇంట్లో పస్తులుండే సమస్యే లేదు

తమ్ముడికి మిఠాయి కొనుక్కు వెళ్ళాలి

అమ్మకి చీర కొనాలి

తను చెప్పులు కొనుక్కోవాలి

ఆలోచనలతో సతమతమవుతూ హైస్కూలు ముందుకు చేరుకున్నాడు చుట్టూ పిల్లలు మూగారు

చింతచెట్టు కిందకు చేరి భుజం మీది దుప్పటి కింద పర్చాడు దుప్పటి మీద రాంచిలుక పెట్టి పెట్టాడు

చేతి సంచిలోని అట్ట కవర్లని దొంతరగా పేర్చాడు

చిలుక జోస్యం చెప్పించుకోవడానికి వో కుర్రాడు ముందుకు వచ్చాడు కవర్ల పైన ఆ కుర్రాడు పావలా బిళ్ల వుంచగానే చున్నల తలుపు తెరిచాడు పెంచలయ్య

రాంచిలుక నెమ్మదిగా బయటకు వొచ్చింది

కర్రముక్కతో కవర్ల కేసి చూపించి సైగ చేశాడు

పెంచలయ్య కేసి తీక్షణంగా చూసి గబ గబా పెట్టిలోకి దూరింది

చిలుక కవరు తియ్యకుండా లోపలికి వెళ్ళడంతో పెంచలయ్యకు కోపం వొచ్చింది

పెట్టిలో నుంచి బయటకు రమ్మని ఎల్చినా బయటకు రాలేదు

కోపం వొచ్చి చేత్తో పెట్టిలో నుంచి చిలుకను బయటకు లాగేడు

పెంచలయ్య చేతిని ముక్కుతో పొడిచిందే గాని కవర్ల దగ్గరకు వెళ్ళలేదు చిలుక

పిల్లలంతా పెద్దగా నవ్వేరు

పిల్లలు నవ్వేసరికి బాగా కోపం వొచ్చింది పెంచలయ్యకి

కర్ర ముక్కతో చిలుకని కొట్టాడు

పెంచలయ్య ఎంత ప్రయత్నించినా చిలకచేత జోస్యం చెప్పే కవరు తీయించలేక పోయాడు

చిలుక మీద పట్టరాని కోపం వొచ్చింది

పైసా సంపాదన లేకుండా యింటి మొహం పట్టాడు

దార్లో సింహాచలం కన్పించేడు

వాడు రోడ్ను మీద గారడి విద్యలు చేస్తుంటాడు

మీ తమ్ముడ్ని నాతో పాటు పంపరాదట్రా! రోజుకి ఐదు రూపాయిలిస్తా! నెల రోజుల్లో తీగమీద చేతులుతో నడిచే విద్య నేర్పిస్తా!

మా వాడికి కాళ్ళు లేవుగా నువ్వే తీగల మీద నడువు! నడి రోడ్లో నాట్యం చేసే ఖర్మ మా వాడికేం పట్టలేదు - సింహాచలంతో అక్కసుగా అన్నాడు

అది కాదోయ్! కాళ్ళు చేతులు వున్నవాడు తీగమీద నడిస్తే ఈ రోజుల్లో ఎవ్వరూ చూడటం లేదురా! కుంటోడు చేతులమీద నడిస్తే అందరూ నోళ్ళు తెరచుకుని చూస్తారు నా మాట వినరా బాగా డబ్బులొస్తాయి - అన్నాడు సింహాచలం

నీ ముష్టి డబ్బులు మాకేం అక్కర్లేదు! అంటూ విసురుగా యింటికి వచ్చేశాడు

చిలుక మీద కోపం తగ్గలేదు

దాని భరతం ఎలా పట్టాలానని చాలాసేపు ఆలోచించేడు చివరికి వో ఉపాయం తట్టింది

ఇంట్లో అందరూ పడుకున్నాక చిలుకను పెట్లో నుంచి తీసి వంటింట్లో వుంచాడు



# స్వార్థం వల్లకలిగే అనర్థం




## ధర్మపథం...

తన్ను మాలిన దర్మం మొదలు చెడ్డబేరం ఉండదని లోకోక్తి ప్రతి మనిషీ తన కుటుంబ పోషణ కోసం అబివృద్ది కోసం దన సంపాదనకు పాటు పడవలసినదే! కాని స్వార్ధపరుడై అత్యాశ పడకూడదు అత్యాశ ఉంటే అవినీతిక పాలుపడి వక్రమార్గాలలో ధనం సంపాదించడానికే ఉపాయాలు వెదక వలసి వస్తుంది అందువల్ల ఇతర్లులతో పాటు తనకు కూడా అనర్థం కలుగుతుంది

ప్రజోపయోగం కోసం ప్రబుత్వం కోట్లకొలది వ్యయం కాగల అనేక నిర్మాణాలను - నీటిని నిలుప చేసే ఆనకట్టలను నదులపై వంతెనలను బవనాలను చేపడుతుంది ఆయా నిర్మాణాలకు ఎక్కువ జీతాలు ఇచ్చి సమర్థులైన యింజినీర్లను నియమిస్తుంది వారు కంట్రాక్టర్లకు ఆయా పనులను అప్పగిస్తారు ఆ యింజినీరు దనాశా పరుడైతే తనకు కొంత దనాన్ని అక్రమ మార్గాన ముట్ట జెప్పే కంట్రాక్టరుకే ఆ పని అప్పగిస్తాడు శ్రమపడి ఆయా నిర్మాణాలను పూర్తి చేసే కంట్రాక్టరు ఎక్కువ లాబానికి ఎదురు చూస్తాడు నష్టం వచ్చే పనికి ఎంత మాత్రం సిద్దపడడు ఏ విదంగానో లాబం వచ్చే పద్దతిలో నిర్మాణాన్ని పూర్తి చేస్తాడు దానిక వీలయినంత చవుకగా లబించే వస్తువులనే కొనుగోలు చేస్తాడు చవుకగా లబించే వస్తువులు మేలురకానివై ఉండవని వేరే చెప్పనక్కరలేదు అట్టివానితో నిర్మితాలయినవి కొద్ది కాలంలోనే కూలి పోవడంలో ఆశ్చర్యం లేదు దనాశాపరుడైన ఇంజినీరు నిర్మాణానికి మేలైన వస్తువులు ఉపయోగింప బడనదీ లేనిదీ పరిక్షింపడు మేలైన వాటినే వాడినట్లు కంట్రాక్టరు చెప్పగా మొగమోటం కొద్ది ఉపేక్షిస్తాడు ఆ నిర్మాణాలు కూలి జన నష్ట మయినా సస్యాదులు మునిగి పోయినా తమకేమి? ఆ బాద్యతను వారు వహించరు ప్రజా నష్టం పంటల నష్టం వారు కోరరు కాని అది జరగకుండా ఎలా ఉంటుంది? వారి అత్యాశ వల్ల కలిగే అనర్థాలు ఇవి తమ జేబులు నిండినా యదార్థం బయలు పడితే వారిక అపకీర్తి తప్పదు ఇంజినీరుకు ఉద్యోగం ఊడపోతుంది కంట్రాక్టరుక విపరీతంగా దననష్టం కలగవచ్చు ఈ విదంగా కొద్ది మంది స్వార్థ పరుల మూలంగా అనేక మందిక అపాయం ఆస్తి నష్టం కలుగుతుంది

స్వప్రయోజనం కోసం జనం ప్రయత్నించ వచ్చును కాని, అవినతిక దారి తీసే స్వార్థపరత్వం తగదు దానివల్ల తనకూ ఇతరులకూ కూడా అనర్థం తప్పదు

—బులుసు వేంకట రమణయ్య

---

కిటికీ తలుపులు మూశాడు

పెంపుడు పిల్లిని తెచ్చి వంటింట్లో వుంచి తలుపులు వేశాడు

పెంచలయ్య మనస్సు తేలికపడింది

కొద్ది క్షణాల్లో చిలుక పని గోవిందా!

రెక్కలు లేని చిలుక ఎగర్లేక ఎగురుతూ వుంటుంది వాటం చూసి పిల్లి దాని మెడ కసుక్కున కొరుకుతుంది ,

చిలుక రోగం ఈ దెబ్బతో కుదురుతుంది

దుప్పటి ముసుగుతన్ని పడుకున్నాడు

నిద్రపోయాక కలలు రాకుండా వుంటాయా?

తమ్ముడు ఎత్తుగా గడలకు కట్టిన తీగమీద చేతుల మీద వో చివర్న నుంచి మరో చివరకు వెళ్తున్నాడు మద్యలో చేతులు పట్టు తప్పాయి

బ్యాలెన్సు కుదర్లేదు గబాల్న కింద పడిపోయాడు

రక్తం మడుగులో తమ్ముడు అవిటి తమ్ముడి

## రాత

పెంచలం రక్తం మడుగులో పత్త విల్లం దెబ్బలు ఎరుకుంటున్నాడు

ఉలిక్కి పడి లేచాడు పెంచలయ్య

బాగా తెల్లారిపోయింది

వంటింట్లో కెళ్ళి చూసాడు

పొయ్యి దగ్గర ముడుచుకు పడుకున్న పిల్లి లేచి మ్యావ్ మ్యావ్ అంటూ కాళ్ళ చుట్టూ తిరగసాగింది చిలక తాలూకు అవశేషాలు ఎక్కడా కన్పించలేదు

ఇంట్లో నుంచి బయటకు వచ్చాడు

వేపచెట్టు కింద చిలుక పెట్టె పక్కన పెట్టుకుని తమ్ముడు కన్పించాడు

రా బుజ్జీ రా బాబుగారి అదృష్టం తెల్పే కవరు తియ్యి చిలుక తల నిమిరి అంటున్నాడు తమ్ముడు

చిలుక గర్వంగా కవర్ల దొంతర పైన దర్జాగా వో కవరు తీసి పెంచలయ్య తమ్ముడి చేతిలో పెట్టింది

దానికో వడ్ల గింజ పెట్టి పెట్టెలోకి పంపించాడు చిలుకను

తన తండ్రీ అంతే! ఆ చిలుకను వొళ్ళంతా నిమిరి బుజ్జగిస్తూ దానిక మాటలు చెప్పేవాడు అది చెప్పినట్లు వినేది దానిక కడుపు నిండా తిండిపెట్టేవాడు

తను కసురుకొంటూ చెబితే తన మాట వింటుందా? అన్నయ్యా! రాత్రి నువ్వు మర్చిపోయి చిలుకను వంటింట్లో వదిలేశావ్! పిల్లి కూడా ఆ యింట్లో దూరింది నాలుగైదు ఎలుకల్ని పట్టినట్లుందిగాని మన చిలుక జోలికి పోలేదు

దాని రాత బాగుండబట్టే పిల్లి చంపలేదు అనుకున్నాడు మనస్సులో పెంచలయ్య

తమ్ముడిని చిలుకని ముద్దుపెట్టుకొన్నాడు పెంచలయ్య

క్షమించానన్నట్లుగా తలెత్తి పెంచలయ్య వైపు

# గుప్తాగ్ని

-సోమసుందర్

పంజాబుకు నవోదయం
కలిగించిన బర్నాలా!
భారతీయ హృదయపూర్ణ
శుభాశంస లివే నీకు
    ఆగామికి రహదారి
    సమకూర్చిన బర్నాలా!
    అభినందన చందనాల
    నందుకోవె మహోదయా!
కంటకాలు కీటకాలు
నిండిన ఈ బాట నడక
గుప్తాగ్నుల కొరవులతో
భయపెట్టే ప్రేత భూమి
    మైత్రీ హిత వాక్కులతో
    హెచ్చరికల నంద చేతు-
    సదా చేతన ధ్వజమై
    సాగవలయు మునుముందుకు!
వరలో దాగిన కత్తులు
త్వరలో తల లెత్తునేమొ?
ఎరమింగిన మత్తులోని
త్రాచులు పడగెత్తునేమొ?
    సమతం లేకుండుట – అది
    శాంతి కాదు ఎన్నటికీ!
    శ్మశాన నిశ్శబ్దం –అది
    శాంతి కాదు భ్రాంతి తప్ప!
సామరస్య సౌహార్దం
సౌజన్యం సుమబంధం!
అదే నేటి నరుల నడుమ
వాంఛనీయ వాత్సల్యం!
    ప్రక్కనె పొంచిన శత్రువు
    ఘాతుకాల ప్రేరేపణ –
    రక్తదాహ పీడువులకు
    శాంతి ప్రాణసంకటమే!
హోషియార్ బర్నాలా!
నవచరణాంకిత పథమిది
అహరహ జాగృతి పురోగతి–
అజ్ఞానంపై ధ్వజమిది
    సర్వత్రా విష ఝుంఝులు
    గర్వాంధ నిశాచరాళి
    మానవతా పరమ శత్రు
    సమూహాల వ్యూహకేళి
నిశిత శాత పరీక్షతో
పరిమార్చక ప్రగతి లేదు
నరరూప పిశాచపాళి
కూల్చక చిరశాంతి రాదు!
    ఆదిమత్వ కూట నీతి
    గుప్తాగ్నులు సుప్తర్పులు
    మానవ జాతి నిరోధులు
    హోషియార్ బర్నాలా!

# అమ్మ

**పులివర్తి పూర్ణచంద్రరావు**

బ్రహ్మాండమయిన వురుము మెరుపులతో కుండపోతగా వర్షం పడుతోంది చెట్లను కూడా కుదుపి పడేసేంత వేగంగా ఎలంగా గాలులు వీస్తున్నాయి కరెంట్ పెయిలవడం వల్ల వూరంతా చీకటిగా వుంది

ఆ రోడ్డు చివర్న డాబా యిల్లొకటి వుంది దానికున్న నాలుగు గదుల్లో మూడు గదుల నుండి మాత్రం చిన్నగా వెలుతురు కనిపిస్తోంది క్రొవ్వొత్తుల తాలూకు వెలుతురది నాల్గవ గదిలో పూర్తిగా చీకటిగా వుంది అయితే ఆ మూడు గదులలోని కొవ్వొత్తుల వెలుగు ఆ గదిలోకి కొద్ది కొద్దిగా పడుతోంది ఆ గదిలో కిటికిని అనుకొని క్షణక్షణానికి విజృంభిస్తున్న వాన వంక తదేకంగా చూస్తున్నాడు కృష్ణుడు.

చీకట్లో చూస్తున్నాడనే గాని మనస్సంతా ఎక్కడెక్కడో తిరుగుతోంది బాల్యంలోకి పరుగుతీస్తోంది మరుక్షణం వర్తమానంలోకి వచ్చేస్తూంది బాల్యంలోకి వెళ్లిందన్నట్లు గుర్తుగా చిన్నగా నవ్వు వర్తమానంలోకి వచ్చేసరికి భయంకరమైన నిజాన్ని తట్టుకొనట్లుగా బాధ తీర్చలేని వ్యధ కాని అది తట్టుకోలేని నిజం

అతని వయస్సు యిరవై సంవత్సరాలు

అతని ఎత్తు మూడున్నర అడుగులు

* * *

ఆ రోజు కృష్ణుడి పుట్టిన రోజు ఆ రోజుకు ఏడేళ్లు నిండుతాయి వాడిక

సాయంత్రం అయ్యింది గబగబా స్కూల్ నుండి యింటికొచ్చాడు కృష్ణుడు

అమ్మా అమ్మా! జవాబు రాలేదు మళ్లీ పిలిచాడు అమ్మా అమ్మా! అంటూ

వంటింట్లోంచి చేతులు తుడుచుకొంటూ వచ్చింది తల్లి

కొత్త చీర కట్టుకొన్నట్లుంది తలారా స్నానం చేసినట్లు గుర్తుగా వెంట్రుకలు ముఖం మీదకు ఎగిరెగిరి పడుతున్నాయి తన పుట్టిన రోజని అందరికి కొత్త బట్టలు తెచ్చారు నాన్నగారు

తల్లిమీద విపరీతమయిన అభిమానం కృష్ణుడికి ఎప్పుడూ ఆమె కూడా తిరుగుతుంటాడు ఏ పని చెయ్యాలన్నా అమ్మనే అడుగుతాడు ఎలా చెయ్యాలమ్మా? ఏం చేయనమ్మా? అంటూ

ఆమె ప్రభావం అంత వుంది కృష్ణుడి మీద

అన్నయ్య లేరమ్మా? అడిగాడు కృష్ణుడికి అయిదుగురు అన్నయ్యలు అందరూ పొడుగువారే చాలా పొడుగు వాళ్లలో కృష్ణుడొక్కడే పొట్టి చాలా

నీకు కేక్ తెద్దామని పెద్దన్నయ్య వెళ్లాడు వాడి వెనుకే మిగతా వాళ్లూ వెళ్లారు చిన్నగా నవ్వుతూ చెప్పింది కాని నువ్వు సమయానికి వచ్చావురా కృష్ణా పూజకి పూలే తెమ్మని చెప్పడం మర్చిపోయాను నువ్వు తేగలవా?

ఇంతలో

ఇదిగో వాడ్ని ఏం పంపుతావుగాని నాకు గుర్తొచ్చినే తెచ్చాను పూలు తీసుకెళ్లు బయటనుండి వస్తూ నాన్నగారు అన్నారు

విపరీతమైన కోపం వచ్చింది కృష్ణుడికి తల్లికి కావలసిన ఏ పనయినా చెయ్యాలంటే వాడికి చాలా యిష్టం కానీ ఆ సంతోషం తృప్తి ఎప్పుడూ పొందలేక పోయేవాడు తల్లి ఎదడిగినా నాన్నగారు గాని వాడి అన్నయ్యలు గానీ ఎవరో ఒకరు చేసేస్తుండేవారు అలా వాడి కోరిక మిగిలిపోయేది నిరాశతో

* * *

తల్లి తలంపు రాగానే కళ్లమ్మట చివ్వున నీళ్లు తన్నుకొచ్చాయి కాంతితో ముఖం వెలిగిపోతోంది కృష్ణుడిది

* * *

ఇంకోసారి

భోజనాల సందర్భంలో నాన్నగారు నవ్వుతూ పులిహోర ఎందుకు చేశావు ఏంటబ్బా యీ రోజు స్పెషల్ ఆలోచిస్తున్నారు

కృష్ణుడితో సహా అందరూ ఆలోచిస్తున్నారు. ఎవ్వరికీ తట్టలేదు తెలియదు కాబట్టి

సడన్‌గా కృష్ణుడి నాన్నగారు అన్నారు లక్ష్మి యీ రోజు నీ పుట్టిన రోజు కదూ?

చిన్నగా నవ్వుతూ తలూపింది తల్లి

కృష్ణుడికి కోపం వచ్చింది తమందరూ పుట్టిన రోజు అర్భాటంగా చేసుకుంటారు మరి అమ్మ ఎందుకు చేసుకోదు?

వాడికి తను దాచుకున్న డబ్బులు గుర్తొచ్చాయి వెంటనే యింకో ఆలోచన కూడా వచ్చింది

భోజనం పూర్తికాగానే పడుకొంటూ

అమ్మా సాయంత్రం నాల్గుగంటల కల్లా లేపమ్మా! మర్చిపోవద్దు అన్నాడు

ఎందుకురా కృష్ణా? తలపై చెయ్యి వేసి అడిగింది

ఊహూ చెప్పను లేపు అంతే!

సరే పడుకో! నవ్వుతూ వెళ్లిపోయింది

ఆమె వంక చూస్తూ అలాగే నిలబడిపోయాడు

నిద్ర నుంచి మెలకువ వచ్చేసరికి అరవుతోంది ఇంట్లో హడావుడిగా వుంది ఆరా తీస్తే తెలిసింది అమ్మకు చెప్పకుండా పెద్దన్నయ్య కేకు తెచ్చాడట రెండో వాడు స్వీట్స్ అలా అందరూ తలా వొకటి తెచ్చారు నాన్నగారు చీరె తెచ్చారు

కృష్ణుడికి కళ్లమ్మట నీళ్లు వచ్చేస్తున్నాయి ఏడుపు ఆపుకోలేక పోతున్నాడు ఎక్కిళ్లు కూడా వస్తున్నాయి అయితే బైట పడటంలేదు

ఆ హడావుడిలో తల్లి తప్ప ఎవరూ గమనించ లేదు కృష్ణుడ్ని కానీ ఏమీ అడగలేదు అలానే కృష్ణుడు ఆ చిన్న గొప్ప పార్టీలో పాల్గొన్నాడు నవ్వులతో హోరెత్తి పోతోంది గది – కృష్ణుడికి ఎలాగో వుంది

అంతా అయింతర్వాత నెమ్మదిగా తన గదిలోకి వెళ్లి పడుకొన్నాడు కళ్లు మూసుకున్నా నిద్ర రావడం లేదు

తల మీద చెయ్యి పడింది చటుక్కున పట్టుకున్నాడు అమ్మ! యిక దాచుకోలేనట్లు ఆమె ఒడిలో తల దూర్చి వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు

ఎందుకురా ఏమయ్యింది కృష్ణా?

ఏడుస్తూనే చెప్పాడు నీ కోసం ఏదైనా చెయ్యాలనుకొంటానమ్మా కానీ అవకాశమే రాదు ఎవరొకరు ఆ పని చేసేస్తుంటారు చిన్నప్పట్నుంచి చూస్తున్నాను అన్నలో నాన్నగారో నువ్వడిగింది తెచ్చేస్తుంటారు నాకు ఆ అవకాశమే రాదు యివాళ నేను దాచుకున్న డబ్బులతో యింకొంచెం నాన్నగారిని అడిగి అంటితో వెళ్లి నీకు చీరె తెద్దామనుకొన్నాను నాన్నగారు తెచ్చేసారు యింకేదయినా తెద్దామంటే అన్నయ్యలు తెచ్చేసారు

మళ్లీ అన్నాడు అందరూ పొట్టి పొట్టి అంటున్నారని వొక ప్రక్క బాధ నీ కోసం ఏదైనా చేద్దామంటే వీలు కావడం లేదని మరొక ప్రక్క బాధ

ఎం చెయ్యాలిరా నువ్వు  చక్కగా చదువుకొని అభివృద్ధిలోకి రా అంతకన్నా ఏం అక్కర్లేదు మందలిస్తూ అంది

కృష్ణుడికి గుర్తొచ్చింది ఇవే మాటలు యింతకు ముందు కూడా అంది అప్పుడు

స్కూల్లో అందరూ ఎగతాళి చేసేవారు పొట్టి బుడంకాయ అంటూ చాలా బాద కలిగింది వెళ్లనని మొరాయించాడు

తల్లి అంది కృష్ణా పొట్టి పొడుగు ముఖ్యం కాదురా! గుణం అదీ ముఖ్యం అది లేని వాళ్ళు ఏవో అంటూంటారు అవి పట్టించుకోకు నీకు జీవితంలో యీ పొట్టితనం ఏ విదంగానూ అభివృద్ధికి అడ్డం కాదు కష్టపడి చదువు పైకిరా నీ





అభివృద్ధిని చూసి నీ పొట్టితనం మీద విసుర్లు మానేస్తారు

అర్థం అయ్యీ అవనట్లుంది కృష్ణుడికి

నెమ్మదిగా ఆ విసుర్లకు అలవాటు పడ్డాడు అన్నలందరూ పొడుగ్గా వుండి తను ఎందుకలా వున్నాడో అర్థం కాలేదు డాక్టర్లు హార్మోన్ల లోపం అన్నారు

ఎ పనయినా చెయ్యబోతే చిన్నవాడివి నువ్వేం చేస్తావ్‌రా? అనేవారు అన్నలు

చిన్న అనడం పొట్టి అన్నట్లుగా వూహించుకొని తెగ బాద పడ్డాడు

క్రొత్తగా కాలేజ్‌లో చేరబోతున్నాడు అయితే మూడున్నర అడుగులు కూడా వుండని తనని చూసి ఆడా మగా అందరూ నవ్వుతారని వెళ్లనన్నాడు కృష్ణుడు

ఊహూ నే చేరనమ్మా! ప్రయివేట్‌గా కడతాను

ఎందుకు చేరవు? కోపంగా అడిగింది తల్లి మనస్సులోని మాట చెప్పలేకపోయాడు

యిది వరలో చెప్పాను గుర్తుందా కృష్ణా నీ ప్రగతికి ఈ పొట్టితనం అడ్డు కాకూడదు నువ్వు బాగా చదవాలి గొప్పవాడివి కావాలి నా కోర్కె తీర్చవూ?

కళ్ల వెంబడి నీళ్లు వచ్చాయి కృష్ణుడికి తనకి ధైర్యం ఎవ్వరూ చెప్పలేదు యింట్లో కోప్పడ్డారు అంతే

నెమ్మదిగా తల వూపాడు

అదంతా యిప్పుడు గుర్తొచ్చింది ఎం చెయ్యాలిరా! చదువుకొని పైకి రా! అనంగానే

తల్లి అంద ఇంకో పని చెయ్యి నాన్నగారు చీరె తెచ్చారు బ్లౌజ్ పీస్ మర్చిపోయారుగా నీ దగ్గర డబ్బులతో అది తీసుకొనిరా! అంది నిజానికి కృష్ణుడి నాన్నగారు అది కూడా తెచ్చారు

తప్పకుండా తప్పకుండా తెస్తాను అన్నాడు వుత్సాహంగా

★ ★ ★ ★ ★

కృష్ణుడు భరించలేని బాద తట్టుకోలేనట్లు కిటికీ వూచల కేసి తల కొట్టుకున్నాడు అలానే దాని

మీద నీరసంగా వాలిపోయాడు

* * * * *

కాలేజీకి క్యారేజ్ తీసుకొని వెడుతూ నవ్వుతూ అన్నాడు నేను తెస్తున్నట్టు ఎవ్వరికీ చెప్పకమ్మా! వాళ్ళు తెచ్చేస్తారు కాలేజ్ నుండి వచ్చేప్పుడు తెద్దామని వాడి ఆలోచన

సాయంత్రం యింటికొచ్చేసరికి యింటి నిండా జనం చుట్టాలు స్నేహితులు అందరూ వున్నారు ఒక్కక్షణం ఒళ్ళు జలదరించింది కృష్ణుడికి గబగబా తోసుకొని లోపలకు వెళ్ళాడు

చాప మీద అమ్మ నిశ్చలంగా పడుకొని వుంది

తల దగ్గర దీపం వెల్గుతూ వుంది ఆ దీపం వెలుతురులో అమ్మ ముఖం మెరుస్తూన్నట్టుగా వుంది

ఇంకా నమ్మకం కలగడం లేదు జీర్ణించుకోవడం కష్టంగా వుంది అంతా కలగా వుంది

అమ్మ ప్రక్కనే నాన్నగారూ అన్నలూ కూర్చొని వున్నారు అందరి కళ్ళలో నీళ్ళు ఆపుకోవడానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు

పిన్ని కృష్ణుడ్ని దగ్గరకు తీసుకొని తల నిమిరింది

హఠాత్తుగా గుండె నొప్పి వచ్చిందిరా కృష్ణా! హాస్పిటల్‌కి వెళ్ళినా లాభం లేకపోయింది ఇంతకు ముందు వొకసారి వొచ్చిందట మనకు చెప్పలేదు మీ అమ్మ! పిన్ని మాటలు అస్పష్టంగా వినిపిస్తున్నాయి

గుండె పగిలి పోతున్నట్టుగా వుంది నవ్వుతోన్న తల్లి ముఖం గుర్తొచ్చింది బాగ్‌లోంచి జాకెట్ పీస్ తియ్యలేక పోయాడు అమ్మ మరి లేదంటే భరించలేకపోతున్నాడు ఆమె కూడా తనూ వెళ్ళిపోవాలని పిస్తోంది

నెమ్మది నెమ్మదిగా తర్వాత చెయ్యాల్సిన కార్యక్రమాలు మొదలు పెట్టారు

కర్రలు తెచ్చారు బ్రాహ్మణులు వచ్చారు అమ్మను స్నానం చేయించి దాని మీద

# పువ్వులు

ఏడు అడుగులే
సప్త స్వరాలు

చిరు చిరు కలతలే
చిట పట చినుకులు

తొలి తొలి వలపులే
తొలకరి వానలు

వలపుల గురుతులే
చిట్టిపాప నవ్వులు

చిన్నారి నవ్వులే
సిరిమల్లె పువ్వులు

—మంతెన విజయలక్ష్మి

# అమ్మ

పడుకోబెట్టారు కృష్ణుడికి ఏం చెయ్యాలో తోచడం లేదు బిగ్గరగా ఏడ్చి బాధ తగ్గించుకుందామంటే ఏడుపు రావడం లేదు

అంతకన్నా భరించలేని వూహించని బాధ తర్వాత కలిగింది నెమ్మదిగా పాడెను ఉహూ కాదు తల్లన్ని పైకి ఎత్తారు నాన్నగారు ముందు నడుస్తున్నారు నల్గురు అన్నలూ నాల్గు వైపులా ఎత్తి పట్టుకొని నడుస్తున్నారు ఒకళ్ల తర్వాత వొకరు చెయ్యి మార్చుకొంటూ స్నేహితులు చుట్టాలు కూడా చేతులు మారుస్తూ నడుస్తున్నారు

కృష్ణుడు పరుగెత్తాడు తను ఒక చెయ్యి వేద్దామని

పిన్ని భుజం పట్టుకొని ఆపేసింది

అప్పుడు అర్థమైంది కృష్ణునికి తను దాన్ని అందుకోలేడు అన్నయ్యలు అందరూ పొడుగ్గా వున్నారు తను దాన్ని పట్టుకోవాలంటే తల్లము ఒక ప్రక్కకు వాలిపోతుంది తనకు ఆ అదృష్టం లేదు లేదు

బాధ రెట్టింపు అయ్యింది పెరిగి పెరిగి మహా వృక్షమై మింగేస్తున్నంత బాధ కలిగింది వెక్కి వెక్కి ఏడ్చాడు

తను వాళ్ళతో వెళ్ళినా వొక్కటే లేకున్నా ఒక్కటే వెళితే మరింత బాధ తను పాలు పంచుకోలేక పోయినందుకు

తన పొట్టితనం మీద ఎప్పుడూ రానంత అసహ్యం కలిగింది అందరూ వెళ్ళిపోయాక గదిలోకి వచ్చి దేముడ్ని ప్రార్థించాడు

దేముడా నా తల్లికి ఏ సహాయం చెయ్యలేకపోయాను చివరికి చివరికి తీర్చుకోలేని ఆమె ఋణంలో కొంత తీర్చుకోర్చుకోడానికి ఆమెను ఎత్తుకొని తీసుకొని వెళ్లే అవకాశం లేకుండా పోయింది కదు నువ్వు చేశావు నువ్వే చేశావు ఈ బాధ భరించ లేకుండా వున్నాను

భగవంతుడా మళ్ళీ జన్మంటూ వుంటే నన్ను సమాన ఎత్తులో వుండేట్టు ఈ తల్లికే కొడుకుగా పుట్టించు లేకుంటే అసలు పుట్టుకే వద్దు అంతేగాని ఈ స్థితిలో మాత్రం వద్దు వద్దు గోడకేసి కొట్టుకున్నాడు

* * * * *

వాన వుధృతం యింకా తగ్గలేదు కృష్ణుడి బాధ లాగానె అలాగే కిటికీ దగ్గర నిలబడి మెరపు మెరిస్తే ఆ మెరుపు వెలుగులో తల్లి కన్పిస్తుందనే ఆశతో ఆ వెలుగులో తన చేతిలో నున్న ఆ జాకెట్టు గుడ్డ ఆమెకు కనిపిస్తుందనే వూహతో అలాగే నిలబడిపోయాడు కృష్ణుడు □

# హైదరాబాదు నోట్‌బుక్

## వీరనారి కాలధర్మం:-

హైదరాబాదులో అత్తవారింట అడుగుపెట్టింది మొదలు అంతిమశ్వాస వరకు తెలుగు కోసం తెలుగు జాతి కోసం తెలుగు సంస్కృతి కోసం మహిళా గౌరవ పరిరక్షణ కోసం అహరహమూ జీవితాన్ని అర్పించిన వీర నారిమణి సోదరి శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారి 1927లో ఆమె హైదరాబాదులో అడుగుపెట్టారు 1928లో ఉరకలు వేసే హృదయంతో సోదరి సమాజంలో స్త్రీ జనాభ్యుదయాన్ని గురించి సంఘ సంస్కరణలను గురించి యువతుల కర్తవ్యాన్ని గురించి దిక్కులు మార్మోగేటట్లు ప్రసంగించారు పదిమందిలో నిలబడి నాలుగు మాటలు చెప్పటమే మహా సాహసమైన ఆ రోజులలో ముఖ్యంగా స్త్రీల సభలు జరపడమంటేనూ స్త్రీలు తమ అభ్యుదయం గురించి సంస్కరణల గురించి ప్రసంగించడమంటేను ప్రమాదమైన ఆ రోజులలో సోదరి సీతాకుమారి ప్రసంగ దోరణి పలువురికి ఆశ్చర్యం కలిగించింది ఆ ఆశ్చర్యాన్ని సీతాకుమారి చివరి వరకు అణగారనివ్వలేదు నిజాం నవాబు పెద్ద కోడలు రాజకుమారి దుర్రెషవర్ బేగం అధ్యక్షతన అఖిల భారత మహిళా సభ హైదరాబాద్ శాఖ సమావేశాలలో సీతాకుమారి తెలుగువారికి ప్రతినిధిగా ప్రసంగించేవారు 1929లో కస్తూర్బా గాంధి భారత పర్యటనలో హైదరాబాద్‌కు వచ్చినప్పుడు ఏర్పాటు చేసిన సభలోను సీతాకుమారి పాల్గొన్నారు శ్రోతలను ఆమె మంత్రముగ్ధులను చేసిన సన్నివేశం 1932లో ఖమ్మంమెట్టులో జరిగిన నిజాం రాష్ట్రాంధ్ర మహిళా సభ దానికి ఆమె అధ్యక్షురాలు అమె ఏడాది పసిపాపను ఎత్తుకొని సాంఘిక దురాచారాల వల్ల స్త్రీలకు జరిగే అన్యాయాలను ఖండిస్తూ గంభీరోపన్యాసం చేశారు అతి బాల్య వివాహాలు ఘోషా పద్ధతి నిర్మూలనం వితంతు వివాహాలు మొదలైన తీర్మానాలు ప్రవేశపెట్టారు సభ కరతాళ ధ్వనులతో దద్దరిల్లింది ఆ సమావేశ ఫలితం అమె ఎక్కడికి వెళ్ళినా ప్రభుత్వ గూఢచారులు వెంటబడడం జాతీయోద్యమంలోను ఆమెది ముందంజే నిషిద్ధమైన 'హరిజన' పత్రికను రహస్యంగా ప్రచారం చేయడంలోను స్వదేశీ ఉద్యమంలోను ఆమె ఎక్కి దిగని గడప లేదు అప్పుడు తెలుగు మహిళలను నవ చైతన్యంతో నడిపే సంఘమే లేదు ఈ లోపాన్ని ఆమె 1936లో తీర్చారు ఆ ఏటి దసరా పండుగనాడు అమె శ్రీమతులు ఇల్లిందల సరస్వతీదేవి చెన్నాప్రగడ సరస్వతి సహకారంతో తమ యింటనే డాక్టర్ లక్ష్మీనరసమ్మ ఆధ్వర్యాన ఆంధ్ర యువతీ మండలిని స్థాపించారు దాని ఆదర్శం అసతోమా సద్గమయ తమసోమా జ్యోతిర్గమయ అమె తమ సంఘం ఆశయాలను గురించి ఇతర సంస్కరణలను గురించి గోలకొండ పత్రికలో తరచు వ్యాసాలు వ్రాసేవారు ఆ కాలంలో తెలంగాణాలో రచయిత్రులూ చాలా తక్కువ ఆమె రచనలతో ప్రోత్సాహితలైన పలువురు యువతులు రచయిత్రులయ్యారు మహిళలకు ఎక్కడ అన్యాయం జరిగినా అమె మనస్సు కుతకుతలాడేది అక్కడికి పరుగుతో వెళ్ళి పరిశీలన జరిపేవారు అక్కిరెడ్డిపల్లిలో నిజాం పోలీసులు మహిళలను అవమానపరచినపుడు రాష్ట్రమంతా గగ్గోలయింది అక్కడి ప్రజలు భయభ్రాంతులయ్యారు ఆ దుండగం దర్యాప్తుకు వెళ్ళిన కమిషన్‌లో సీతాకుమారి కూడా ఒకరు అమె ఆ స్త్రీలకు ధైర్యం చెప్పి న్యాయం కలిగించే ప్రయత్నం చేశారు 1947 49 లలో రజాకార్ దురంతాలు చెలరేగినప్పుడు ఆమె దోపిడీలు అవమానాలు జరిగిన ప్రాంతాలలో పర్యటించి వారిని సాంత్వనపరిచారు తన సహాయం కోరి వచ్చిన ఎవ్వరినీ ఆమె కాదనలేదు అందువల్ల అమె ఎన్నో ఇబ్బందులకు లోనయ్యేవారు హైదరాబాద్‌లో పోలీసు చర్య తర్వాత జరిగిన కలహాలలో అమె ఎందరో మహమ్మదీయ స్త్రీలను రక్షించారు నా దృష్టిలో ఆమె గొప్ప సేవ పతిపరిత్యక్తలను పతితలను వితంతువులను అనాదలను ఆదుకోవడం అత్తవారింటి నుండి అపవాదులతో బహిష్కృతలయిన స్త్రీలు భర్తల అకారణ ఆగ్రహానికి గురి అయిన భార్యలు ఇష్టంలేని పెళ్ళిళ్ళను తప్పించుకొని పారిపోయి వచ్చిన కన్యలూ ఆమె ఇంటి చుట్టూ మూగేవారు వారు వేళగాని వేళల్లో అర్ధరాత్రి అపరరాత్రి అనక తలుపు తట్టేవారు అమె కృష్ణ భగవానుని తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం అనే వాక్యాన్ని స్మరిస్తూ వారిని ఆదరించి నెలలకొద్దీ పోషించేవారు ఇలా ఎందరో పతితంతువులు సతంతువులు సుమంగళులూ అయ్యారు అనాదలు సనాదలై అర్చనపరులయ్యారు ప్రేమించామనే పురుష పుంగవుల పచ్చి అబద్ధాలకు మోసపోయి వారి పాప బీజాలు పంచుకున్న కన్నెతల్లుల ఆత్మహత్యలను ఆపి ఏ ఆస్పత్రులలోనో పురుళ్ళు పోయించి వారు ఆస్పత్రి మంచాలపై వదలిపెట్టిన పసికందులను ఏ అనాదాశ్రమానికో చేర్పించి ఒక గట్టి నిట్టూర్పు వదలడం అమె నిత్యకృత్యాలలో ఒకటి అలాటి అనాద శిశువు ఒకతె సుప్రియ అనే పేరుతో అమె ఇంట పెరిగింది

సోదరి ఇల్లిందల సరస్వతీదేవి అన్నట్టు ఇలాటి విసుగూ విరామం ఎరుగని సంఘ సేవిక అనాదుల పాలిట కల్పవృక్షం సాంసారిక జీవితంలో దేశ సేవ కూడ భాగమైన బాధ్యతగా గ్రహించి కృషి చేసిన మహిళామణి సాహిత్యాన్ని సంఘ సంస్కరణకు సాధనంగా వినియోగించుకొన్న విదుషి సీతాకుమారి 1911 అక్టోబర్ 1ప తేదీన బాపట్లలో జన్మించారు తండ్రి పేరు అచ్యుతుని రామబ్రహ్మంగారు తల్లి పేరు వెంకట లక్ష్మమ్మగారు సీతాకుమారికి చిన్ననాటి నుంచే సాహిత్యాభిరుచి సంఘ సేవాసక్తి ఉండేవి 1931 ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ఆమె తొలి రచన ప్రచురితమయింది 1927లో శ్రీ యల్లాప్రగడ నారాయణరావుగారిని వివాహమాడారు శ్రీ నారాయణరావు ఒక న్యాయమైన కారణం కోసం పదవిని త్యజించి కొందరు మిత్రుల సహాయంతో ఆంధ్ర బుక్‌హవుస్ అనే పుస్తక విక్రయశాల స్థాపించారు సీతాకుమారి 1949లో మద్రాసు విశ్వవిద్యాలయం

శ్రీమతి సీతాకుమారి, శ్రీ నారాయణరావు



# హైదరాబాద్ నోట్‌బుక్

తెలుగు విద్వాన్ పరీక్షలో ఉత్తీర్ణురాలై కీస్ హైస్కూలులో తెలుగు ఉపాధ్యాయినిగా చేరారు ఆమె 1957లో బన్సువాడా నియోజక వర్గం నుంచి ఆంధ్రప్రదేశ్ విధాన సభకు పోటి చేయదలచినపుడు కీస్ హైస్కూలు నిర్వాహకులు ఆమె రాజీనామాను అంగికరించక మీ రాజీనామాను అంగికరింపం మీరు ఎన్నికల్లో గెలిస్తే రాజీనామా అంగికరిస్తాం గెలువకపోతే వచ్చి పనిలో చేరండి అని ఔదార్యం చూపారు ఆమె గెలిచారు సమర్థురాలయిన విధాన సభ సభ్యురాలుగా పేరుపొందారు ఆమె రచనలలో మందార మాల అనే కథల సంపుటి ఒక వ్యాస సంపుటి మాత్రమే ప్రచురితమయాయి 1975లో ప్రపంచ తెలుగు మహాసభ, 1985లో మహిళా సంమాలు పెక్కు చోట్ల పెక్కు సంస్థలు ఆమెని సన్మానించాయి 1982లో దుర్గాబాయి దేశ్‌ముఖ్ అవార్డు ఆమెను వరించింది ఆమెకు ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు పెద్ద కుమార్తె శ్రీమతి శశిబాల ఈమె రోజరీ కాన్వెంటులో ఉపాధ్యాయిని రెండవ కుమార్తె శ్రీమతి విద్యారాణి ఈమె సికిందరాబాదులో కస్తూర్బా మహిళా కళాశాల ప్రిన్సిపాలు కుమారుడు శ్రీ అశోకవర్ధన్ ఒక ఆఫీసరు అప్పటి తెలుగు మిజాన్ పత్రిక సంపాదకులు శ్రీ అడివి బాపిరాజుగారు వీరికి నామకరణం చేశారు సీతాకుమారి అవసాన దశలో వారిని

ఆ మహానుభావుడు అడివి బాపిరాజు
అపూర్వ కళా సంపన్నుడు ఆధ్యాత్మిక పరిపూర్ణుడు
అమృత హృదయుడు ఆశించి రూపొందించిన
ముద్దు పెర్లమ్మ మీవి

అని దీవించారట కుమారుని రాక కోసం శ్రీమతి సీతాకుమారి భౌతికదేహాన్ని మూడు రోజులపాటు పెట్టారు తమ ప్రియతమ సంఘ సేవాపరాయణను జంటనగరాల పౌరులు తీర్థ ప్రజలలాగా తుదిసారిగా దర్శించారు సీతాకుమారి 74 సంవత్సరాల శ్రీమతి సీతాకుమారి భారతీయ మహిళలందరూ ఆశించే విధంగా సుమంగళిగా కీర్తిశేషులయ్యారు ఆమె ధన్యజీవి ఆమె లేని లోపం ఉన్నా విచారించ నక్కరలేదు ఆమె లేని లోపాన్ని ఆమె సేవానిరతిని అనుసరించడంతో తీర్చుకోవాలి ఈ మాటలే మిత్రులు శ్రీ నారాయణరావు గారితో అన్నాను ఆయన కన్నీళ్లతో మరొక సంగతి చెప్పారు ఆమె కీస్ హైస్కూలులో ఉద్యోగం వదలినప్పుడు ప్రావిడెంటు ఫండు డబ్బును ఆ స్కూలుకే విరాళమిచ్చి, విద్యార్థులకు అవార్డులు ఏర్పాటు చేయమని కోరింది అని ఆ వీరనారికి ఇవే నా జోహార్లు

**ఉపశ్రుతి.-**

ఏంసార్ మీ మిత్రులు విషాద ముద్రతో వున్నారే అనడిగారు ఒకరిని గురించి నా మిత్రులొకరు ఆయనకు అనుకున్నవి రాలేదట అందుకని - అని అన్నాను బలే అన్నారండి పట్టుమని పది పేజీ రాలన్నా చెప్పకుండా ప్రొఫెసరయ్యారు పది పంక్తులన్నా వ్రాయకుండా పెద్ద పదవులు సంపాదించారు ఇంకా ఏమి కావాలట?- అని గద్దించాడు ఆయన నన్ను

-తిరుమల రామచంద్ర

# అవీ - ఇవీ - అన్నీ

## ఉత్తమ నవలకి నూతలపాటి అవార్డు

1 ఇతివృత్తం తెలుగుల జీవితానికి సంబంధంచి వుండాలి

2 1-1-83 నుండి 31-12-85 లోగా మొదటి ముద్రణ జరిగి వుండాలి వ్రాతప్రతులు అనువాదాలు పంపరాదు

3 ఒకసారి బహుమతి పొందిన వారు పోటికి పుస్తకాలు పంపరాదు

4 ప్రచురణకర్తలు పుస్తకాలు పంపినా రచయితకె బహుమతి యివ్వబడుతుంది రచయిత తప్పని సరిగా సన్మాన సభకు రావాలి

5 వచ్చిన నవలల నుండే వుత్తమ నవల ఎంపిక జరుగుతుంది పుస్తకాలు తిప్పి పంపబడవు

గంగాధరం సాహితి కుటుంబం (రిజి) 1986వ సంవత్సరం ఉత్తమ నవలకు అవార్డు యిస్తుంది బహుమతి మొత్తం రు 1500/-లు అవార్డు కోసం నవలలు పంపదలచిన వారు క్రింది నిబంధనలు పాటించాలని కార్యదర్శి ఎస్ మునిసుందరం తెలియజేస్తున్నారు

## కవితలు—కథల పోటీలు

చిరంజీవి నేషనల్ అకాడెమీ – కళా సాహిత్య సాంస్కృతిక సంస్థ తెలుగు ఉగాది సందర్భంగా కవితలు – కథల పోటీలను నిర్వహిస్తున్నది కవితలు పద్యము లేదా గేయ రూపమున పంక్తులకు (లైన్సు) మించరాదు కథలు 6 అరఠావు పుటలకు మించరాదు కవితలు గాని కథలు పలానా అంశముపై వ్రాయాలను నిర్బంధము లేదు కాని దేశ రక్షణ దేశ సమగ్రత వరకట్న సమస్య నిరుద్యోగ సమస్య కుల నిర్మూలనము కుటుంబ సంక్షేమము మున్నగు అంశములపై వ్రాసిన కవితలకు కథలకు ప్రాధాన్యము ఉంటుంది ప్రథమ ద్వితీయ తృతీయ బహుమతులు పొందిన కవితలు కథలు వ్రాసిన వారికి ప్రశంసా పత్రము నగదు బహుమతి ఇవ్వబడును కవితలు కథలు 1986 ఫిబ్రవరి 21వ తేది లోగా చేరునట్లు శ్రీమతి విపుల సెక్రటరి చిరంజీవి నేషనల్ అకాడెమీ 7–1–227, మారుతి మార్గ్ సికింద్రాబాదు–500003 అనే చిరునామాకి పంపాలి ☐


Printed and Published for Nageswara Rao Estates Private Ltd , by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada 3, Editor S Radhakrishna
Phones Business 61247, 61248, Editorial 75667